

**గుర్నూలు పూలు**

**Gurnoolu Poolu (Sunflower)**

**ప్రచురణ :** కర్నూలు బుక్ ట్రస్ట్

**మొదటి ముద్రణ :** జులై, 2016

**ముఖ చిత్రం**

**కవర్ డిజైన్ :** చింతలపల్లి అనంతు

**డిటిపి :** దస్తగిరి, సాయిబాబా

ప్రతులకు

**డా॥ ఎం. హరికిషన్**

45/205–1,

లేబర్ కాలనీచర్చ్ ఎదురుగా,

టీచర్స్ కాలనీ, కర్నూలు.

సెల్: 94410 32212

email: drmharikishan@rediffmail.com

**వెల:** 100/–

# మూడో పొద్దును కాస్తున్న గుర్నాలు పూలు

చింతలపల్లి అనంతు

రెండు రాజధానుల తయ్యారీ మధ్య కాలంలో ఉబికిన, నలిగిన, మాయమైన విలాసాల దిగులుయానం ఈ గుర్నాలు పువ్వుల నేపథ్యం. ఈ కథలు, ఈ వ్యధలు, ఈ గాధలూ దానికి ఆనవాళ్ళు.

ప్రగతి పేరిట కబోది పాలకులు పేరాశ అభివృద్ధి నమూనాలతో మన తరపున రచించుకుంటూ పోతున్న, రుద్దుకుంటూ పోతున్న తరాల man-made కరువు కోరలకు నైవేద్యం ఈ జీవితాలూ... ఇందున్న తరాలూ. రాయలేని తలరాతలూ... మిగిలిన ఈ రాళ్ళూ.... ఈ రప్పలూ.

*

"Hunger is not a scourge, it is a scandal" అన్న Susan Geroge మాటలు రాయలసీమకు నూటికి వేయి శాతం వర్తించే అక్షర సత్యాలు. ఆ అక్షరాలనీ, ఆ సత్యాలనీ గుర్నాలుపూలుగా పూయించారీ కథకులు. సీమలోని ఆకలి, కరువు, నిరుద్యోగం, ఆత్మహత్యలు, వలసలు... ఇవన్నీ కూడా failed lobbyists and sheer careerists అయిన సీమ రాజకీయ నేతల చేతకానితనం, పటాటోపం ఫలితమే.

*

ఆంధ్ర, తెలంగాణలకన్నా ముందు తెలుగు కోడి కూసిందీ... తెల్లవారిందీ ఈ సీమలోనే. కానీ ఆ తెలికోడి తొందరపడి ముందే కూసిన కోయిలలా back benchలో వినిపించకుండా నిస్సహాయంగా కూర్చుని వుందిప్పుడు చరిత్రలో.

రెంటికన్నా ముందే కూసిన ఈ కోయిల కరువులోనూ పాడుతున్న వసంతగీతిక ఇది. ఇది ఇప్పటికీ మన చెవినపడకపోతే మనం కబోదులమే కాదు, బధిరులమూ అవుతాం చరిత్రకి.

*

రాయలసీమ ఏకశిలే కానీ దాని జీవితాలు మనం అనుకున్నట్టు, చదువుతున్నట్టు, చూస్తున్నట్టూ, వింటున్నట్టూ ఏకశిలా స'దృశ్యాలు' కావు. మనకు కొత్తగా వినే, చదివే, చూసే, తెలుసుకునే, అర్థం చేసుకునే అకలుషిత ఇంద్రియాలుంటే మాత్రం అవి అపురూపమైన ప్రత్యేకథనాలు. ఈ నాలుగు జిల్లాల్లో జీవితం, యాస, ఆచారాలు, వ్యవహారాలూ, వ్యవసాయాలూ, వ్యాపారాలూ, వ్యాపకాలూ, బాంధవ్యాలూ, నుడి, పెట్టుబడీ, కుల వివక్షా, కుల రాజకీయాలూ, ఉద్యమాలు, వలసలూ, ఆత్మహత్యలూ, హత్యలూ, సంక్షేమాలూ, పథకాలూ, శిలాఫలకాలూ, వాటి ప్రాజెక్టులూ, ఫ్యాక్టరీలు, వాటి నిరుద్యోగాలూ, నిరక్షరాస్యతలూ... అన్నీ... అన్నీ వ్యత్యాసాలే. వేటికవే వేరేవేరే.

వేరు వేరే. ఊరూ వేరే. దేనికవే పోలికలే లేని పొంతన వున్న విధ్వంసాలకు చిరునామాలు. వెనుకబాటు(పోటు) గుట్టు విప్పగలిగే ప్రత్యేకథలు. సీమ గాథలు.

బయటికి ఒక్కటనిపించే లోన కోటిన్నొక్కటి వినిపించే గాయ గేయాలు సీమ రాగాలు.

అందుకే పోలికలే లేని చెలామణీ కవలలు ఈ నాలుగు జిల్లాలు.

*

2015.

మన కొత్త రాజధాని అమరావతిని నిర్మించుకోవాలి. ఇది సీమాంధ్రుల తక్షణ కర్తవ్యం.

పస్తులుండండి. శిస్తులు కట్టండి. చందాలు పోగెయ్యండీ... అందాలు చూడండి.

Lee Kuan Yew clones కట్టే బ్లూ ప్రింట్లూ... సింగపూర్ స్టంట్లూ మన టూరింగుంటూరు టాకీసుల్లో మన కోసమే ఆడుతూన్న స్మార్ట్ సిటీ ఆటలు, క్యాపిటల్ సిటీ డ్రామాలు.

మనమంతా "తప్పక ఆడాల్సిన, పాడాల్సిన ఈ emotional అత్యాచార్ capital city ఆటపాటలు" సీమను మరోసారి మోసపుచ్చుతున్న నాయకుల కబోదితనానికీ, డొల్లతనాలకీ సాక్ష్యాలు.

బైరవాని తిప్ప, పెన్నహోబిళం, చిత్రావతి, మద్దిలేరు, గండికోట, హంద్రీనీవా, గాలేరు నగరి, వెలిగొండ, గురు రాఘవేంద్ర... ఈ ప్రాజెక్టుల గొంతును నులిమేసిన కుటిల నేతలు మరోసారి ప్రజలని నమ్మించేందుకు చేస్తున్న నయా హైటెక్ మోసాలు ఇవి.

హడావిడిగా పట్టి సీమ తెచ్చేయ్... అర్జంటుగా మన అమరావతి కట్టేందుకు. నీరూ – మీరూ.

గుంతకల్లు, ఉరవకొండ, తాడిపత్రి స్పిన్నింగు మిల్లు, బిర్లా ఫ్యాక్టరీ, రాయలీసీమ పేపర్ మిల్లు, బ్రాహ్మణీ స్టీలూ మూసేయ్... మన ఐరావతీ... మన అమరావతిని మోసేయ్... మేసేయ్.

*

1953.

మన కొత్త రాజధాని కర్నూలుని నిర్మించుకోవాలి.

ఇది ఆంధ్రుల కనీస కర్తవ్యం. మదరాసీలనుంచి తెలుగు గౌరవం కాపాడుకునేందుకు ఇదే మార్గం. ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని అనంతపురంలో ఏర్పాటు చేయాలి. హైకోర్టును గుంటూరులో నిర్మించాలి.

80 ఏళ్ళ క్రితం ఏనుగు అంబారి ఎక్కి ఊరేగి, తమ స్వంత ఊళ్ళకు మరెన్నడూ ఏగని నాటి సీమనేతలు చేసిన డిమాండ్లు ఇవీ. ఈ నాయకులను ఎక్కించిందీ ఐరావతమే. ఒరిగింది సీమకు మాత్రం అమరావతమే.

*

ఈ నేపథ్యం మాట్లాడకపోతే ఈ గుర్నూలు పూలు కథలు కనీసం ఆనవు. పైగా మరొక్కమారు పడికట్టు సాహిత్య కొలమానాలకే మన బేరీజు పరిమితం అవుతుంది. ఇందులో 12 కథలున్నాయి.

దజను దుఃఖాలున్నాయి. వలసలున్నాయి. నిర్వేదాలున్నాయి. శాపనార్థాలున్నాయి. నిస్సహాయతలూ వున్నాయి. పాలక ద్రోహాలకు జన నిరసనలున్నాయి. ప్రాంతీయ వివక్షను ఎండగట్టే ఆక్రందనలున్నాయి.

*

మిత్రుడు హరికిషన్ ఈ కథలను నా చేతికి అందించి నాలుగు మాటలు రాయమని కోరిన రోజు సరిగ్గా కర్నూలు జిల్లా రైతులు, ఆందోళనకారులు సిద్ధేశ్వరం అలుగు శంకుస్థాపన కోసం సర్కారీ నిర్బంధాలను, అరెస్టులను, అడ్డంకులను ఎదుర్కొని జెండా ఎగరేసారు. ఇది తప్ప మరో మార్గం లేదని కర్నూలు రైతులకి తెలిసిందనీ, ఈ ఆందోళన మరింత భరోసా ఇచ్చే వుంటుందనీ అనుకుంటా.

*

ఇందులోని మెజారిటీ కథలన్నీ కర్నూలులో సాగని సాగు (cultivation) గురించీ, పారని నీటిపారుదల(irrigation) గురించి తెలిపే, రైతుల నిస్సహాయతను ప్రకటించే, నేతల నిర్లక్ష్యాన్ని ఎండగట్టే కథలే.

సీమ సాగుకు పైసాకు పనికిరాకుండా పోయిన శ్రీశైలం జలవిద్యుత్తు డ్యాం ముంపు గ్రామల వ్యథకీ, అది సృష్టించిన విధ్వంసాలకు గొంతునిచ్చిన కథలు హరికిషన్ రాసిన తరతరాల దుఃఖం, జి. వెంకటకృష్ణ రెండో వీరగల్లు.

1981లో శిలాఫలకంతో ముస్తాబయిన శ్రీశైలం కుడి కాలువ(SRBC) నేటికీ పూర్తికాక కూల్చిన మూడు తరాల కలలే తరతరాల దుఃఖం. గుదిబండగా మారిన వ్యవసాయం వల్ల 'పనుకున్నోడు పనుక్కున్నట్టే మాయం' అయిపోయిన అనేక మంది గోపాల్‌లు ఎక్కడున్నారో మనకు తెలియాలని మన కాలర్ పట్టుకుని మరీ అడిగే కథ ఇది.

ఇదే విధ్వంసాన్ని మరో కోణం నుంచి magic real, hallucination ధోరణిలో చెప్పాడు జి. వెంకటకృష్ణ.

వాదన వినిపించడంలో తలమునకలై కథని ఫైన్ ట్యూన్ చేయకపోవడం కనిపిస్తుంది ఈ రెండు కథల్లో. చెప్పవలసిన విషయాలు అనేకం వుండటం వల్ల ఈ కథకులు వివరాల్లో, వాదనలో ఉక్కిరిబిక్కిరి అయిన తీరు స్పష్టం.

వలసలు (సుగ్గి) మిగిల్చే కర్నూలు వ్యవసాయం గురించి నిజాయితీ చర్చని లేవనెత్తిన కథ మారుతి రాసిన పునరపి. ఇటు పౌరోహిత్యానికీ, అటు తమకు చేతకాని వ్యవసాయానికి కాకుండా పోయి రెంటికీ చెడిన పేద బ్రాహ్మల దీనస్థితి పునరపి. అయితే కంచె ఐలయ్య వాదన ప్రస్తావన కథలోని అసలు విషయాన్ని, కోణాన్ని నీరుకార్చింది.

90లలో ఒక సారి, 2000లలో మరీ భీభత్సంగా మరోసారి వచ్చిన తుంగభద్ర వరదలు మాత్రం కనీసం కర్నూలు జిల్లాకి కొంతే natural calamaity, ఎక్కువ శాతం అవి man-made disasters. చంద్రశేఖర్ కథ వొక్క వరద కొత్తపంథా

కథనంలో నడిచి abort అయ్యింది. వరద తొందర కథకు ఎందుకు? ఈ కథని ఆకాంక్ష అయినా తిరిగి రాయాలని నా ఆకాంక్ష. ఎందుకంటే తుంగభద్ర వరద ఎంత అకాల విధ్వంసమో, వరదానంతర భీభత్సం మరింత కాబట్టి. మన disaster management చాలా disastrous అని తేల్చేసిన వరదే కరువు కర్నూలుకు రాబడిన తుంగభద్ర వరద.

పిల్లల పెంపకంలో మన ఛాయిస్, మన జోక్యం గురించి రెండు అనివార్య, అవసర, భిన్న ప్రకటనలు చేసిన కథలు... కాశీభట్ల నాక్కూడా, విరాగి చిచ్చు. ఈ రెండూ కూడా juxtaposed argumentationలో నడిచిన కథలు. చిన్నగీతని చెరిపేసే లేదా దిద్దే పెద్ద గీత శైలిలో నడిచిన కథలు. పెద్దలు పిల్లలపైన గీసే, గీస్తున్న, గీయకూడని గీతల గురించి  సున్నితంగా చెప్పిన కథలవి.

యాసిడ్ దాడులపైన మన(గ)లో ఆలోచన రేపే, ముఖ వర్చస్సు గురించిన పడికట్టు beauty conceptsని ఛిద్రం చేసే బలమైన కథ నళిని. చాలా bold theme, కానీ handle చేయడంలో తొందరపాటుంది. కథన నేర్పరితనం కొరవడింది. అయినా శైలి మాత్రం చాలా అలవోకగగా సాగింది.

కార్పొరేట్ పాఠశాలలో కేవల పోటీతత్వం నూరిపోసేందుకు పిల్లలను ఉద్వేగాలకూ, అనుబంధాలకూ, మమకారాలకూ దూరం చేసే 'మోటివేషన్' లో కూరుకుపోయి యాంత్రికమైపోయిన వ్యక్తి చేసిన ఆత్మిక సంభాషణే కల్యాణ దుర్గం స్వర్ణలత రాసిన బోగన్ విలియా. సహజాత పరిమళం కోల్పోయి కేవలం కృత్రిమ రంగులీనుతున్న బోగన్విలియాలను కుప్పలుతెప్పలుగా ఉత్పత్తి చేస్తున్న మన విద్యావిధానం పైన కొరడా ఈ కథ.

ఇక పాత్రల, వయసుల, వారి స్వభావాలకుండవలసిన లక్ష్యాల establishments లో కొంత కంగాళీగా నడిచినా ఆరోగ్యకర బంధాలను సూచించిన హృద్యమైన కథ పేరం ఇందిరా దేవి రాసిన అక్షయమైన వెన్నెల.

Professional jargon మితిమీరడం వల్ల ఆ professionలో వున్న వారికి చేరినంత తొందరగా సాధారణ చదువరులకు అంతదగ్గర కాకుండా పోయిన(దూరమైన) దేశభక్తి మీద సెటైర్ జి. ఉమా మహేశ్వర్ రాసిన నేనూ నా దేశం కథ.

సంకలనంలో నిడివిలో పెద్ద కథ సాగరమథనం. ఒక సంబంధం అక్రమమా, సక్రమమా అని తేల్చేది ఆ బంధంలో వున్న ఇద్దరా, లేక వాళ్ళ చుట్టూ వున్న లోకులా? చాలా సార్లు లోకమే తేల్చేస్తుంది, తీర్పు ఇచ్చేస్తుంది. శిక్షా వేసేస్తుంది. పూర్వాపరాల పట్ల వివేకం కొరవడి. ఈ కథలోని ప్రధాన పాత్రలాగే. ఈ సూటి మాటను చెప్పడంలో సంక్షిప్తత లోపించిన కథ ఇది.

బాధ్యత లేని పక్కా మధ్యతరగతి పలాయనవాద స్నేహం, స్వార్థం, పశ్చాత్తాపం అతని అనుకూలానికి వాడుకునే దాసు కథే తంగిరాల మీరా సుబ్రహ్మణ్యం చచ్చిబతికిన మనిషి. దాసు స్వార్థం ముందు అతని పశ్చాత్తాపం ఓడిపోయింది. దాసుది దిద్దుకునే పొరపాటు కాదు. కానీ కథకురాలు దాన్ని దిద్ది అతడిని బతికించేందుకు చేసిన ప్రయత్నం మరింత convincing గా వుండాలి.

*

ఇది గుర్నూలు పూల కాలం.

ఇప్పుడు తెలుగు వాళ్ళు వినక తప్పని గాయ గేయం పేరు రాయలసీమ.

సీమ అనే మాట భాషా సౌలభ్య సూచిక. లేదా భౌగోళిక, నైసర్గిక, చారిత్రక, మాధ్యమాల దత్త పుత్రిక.

ఈ నవీన సీమ గానం మన చెవుల తుప్పులు దులిపేస్తుండగానే కాసేపు ఈ కర్నూలు కోరస్ విందాం.

ఇప్పుడు ఎవరి కష్టం వారి నోటివెంట వినడమూ వినోదమైపోయిందికదా. అందుకనయినా విందాం ఈ కర్నూలు మాట... పాట... కథ... ప్రేమగా... ఓపికగా. ఎందుకంటే ఆంధ్ర, తెలంగాణానంతర అనివార్య నిరసన గాయ గీతికలు ఈ కథలు కాబట్టి. అందుకే ఇవి మూడో పొద్దును కాస్తున్న అచ్చమైన, స్వచ్ఛమైన కర్నూలు గుర్నూలు పూలు.

**70365 29808**

# పొద్దు ముంగిట్లో...

యెనికపాటి కరుణాకర్

ఆధునికతను రూపంలో, సారంలో సంతరించుకున్న సీమకథ – అందులో భాగమైన కర్నూలు కథ – వయసులో మిగిలిన తెలుగు ప్రాంతాల కథలతో పోలిస్తే చాలా చిన్నది కావచ్చు. కానీ ఇంత తక్కువ కాలంలో అది పొందిన విస్తృతి, చూపిన పరిణతి మాత్రం తక్కువది కాదు.

నిజమే... ఇక్కడ ఊపేసిన ఉద్యమాల్లేవు. వ్యవస్థను కుదిపేసిన కొత్త సామాజిక శక్తుల్లేవు. అయినా ఇక్కడి కథకులు గుణాత్మక మార్పుకు దారి తీయగలిగిన పరిణామాలన్నిటినీ నమోదు చేస్తున్నారు. సమాజంలో ఒక స్పష్టమైన, గుర్తించదగిన సామాజిక సంఘర్షణ లేకుండా లోలోపలి చలనాలను పసిగట్టేందుకు చాలా నిశితదృష్టి కావాలి. దానిని ఒక కళారూపంగా, కథగా మలచడానికి నైపుణ్యాన్ని మించిన నిజాయితీ కావాలి. సీనియర్ రచయితలు కావచ్చు, చంద్రమౌళిని, స్వర్ణలత, మారుతి లాంటి ఇప్పుడిప్పుడు రాస్తున్నవారు కావచ్చు. కథారచనను బాధ్యతగా భావించి విడివిడిగా, సమిష్టిగా చేసిన కృషి వల్లనే ఈ కథలు మన ముందున్నాయి..

భౌగోళిక పరిమితుల సాకుతో రాజకీయ వివక్ష ఇక్కడి నీటివనరులను తరలించుకుపోయింది. ఒకవైపు కరువుగా,

మరోవైపు వరదగా వ్యక్తమైన ఈ మానవ కల్పిత వైపరీత్యం ఇక్కడి రైతు బతుకు పోరాటాన్ని దు:ఖమయం చేసింది.. ఒట్టి కన్నీటి వెతలు కాదు. ఫ్యాక్షన్ హింస మిగిల్చిన వేదన కాదు. వేలవేల కన్నీటి బొట్లు వాగై వంకై ప్రవాహమై సాగిపోతున్న తరతరాల దు:ఖాన్ని వీరగళ్ళై నిలువరించేందుకు గుమిగూడుతున్న వర్తమాన చైతన్యం ఇప్పుడిక్కడి కథా సందర్భం.

చైతన్యానికి చిరునామాగా ఉండాల్సిన యువత ఒకవైపు విషసంస్కృతి రగిల్చిన చిచ్చులో కాలి బూడిదవుతుంటే, మరోవైపు సకల రంగాలలో వ్యాపారీకరణ సృష్టించిన కృత్రిమ లక్ష్యాల సాధనలో ఏ స్పందనా లేని బోగస్ విలియాలుగా మిగులుతున్నది. అన్ని విలువలను కాలరాసి తానే ఒక విలువగా మారిన డబ్బు వేటలో కనీస మానవ విలువలను నిలబెట్టుకునేందుకు మనుషులిక్కడ చచ్చి బ్రతుకుతున్నారు. ఒకవైపు ఈ దేశవనరులన్నీ నిస్సిగ్గుగా సామ్రాజ్యవాదులకు అప్పగించి, వారికి ఊడిగం చేస్తూ మరోవైపు జాతీయతా రాగం ఆలపిస్తున్నారు కుహనా దేశభక్తులు. ఈ మొత్తం క్రమాన్ని ఇక్కడి రచయితలు అక్షరబద్ధం చేస్తూ అప్రమత్తం చేస్తున్నారు

అలాగని అన్ని మార్పులను ఒకే గాటనకట్టలేదు. పరస్పరం సంఘర్షించిన శక్తులలోంచి పుట్టిన కొత్త భావాలు ఎక్కడివైనా ఇక్కడి కిటికీలు తెరిచే ఉంచారు. కొత్త విలువల వెలుగులో పాతబంధాలను పునస్సమీక్షిస్తున్నారు. స్త్రీ పురుష సంబంధాలను అర్ధంచేసుకునేందుకు ఏకంగా సాగరమధనమే జరిపారు. నాక్కూడా శరీరమున్నది, మెదడున్నది, హృదయమున్నదంటూ స్త్రీ తన జీవితంపై ప్రకటిస్తున్న హక్కుకు మద్దతు ప్రకటిస్తున్నారు. కొత్త ఆదర్శాలను ఆచరణ రూపం తీసుకోవడాన్ని కలగంటున్నారు.

గుర్నాలు పూలంటే పొద్దుతిరుగుడు పూలు. పొద్దుతో పాటే తిరిగే పూలు. వెలుగుదారేదో ఎరిగిన పూలు. మీ చేతిలోని ఈ కథలు ఈ పూలలాంటివే. చిమ్మచీకటిలా కమ్ముకున్న నైరాశ్యాన్ని చీల్చి వెలుగుజాడను వెతికి చూపెడుతున్న కథలు. దశాబ్దాల జడత్వాన్ని వీడి,  తొలి కిరణాల కొసలందుకుని రేపటిలోకి తొంగిచూస్తున్న కథలు. కాలం వెంట కదలిపోతున్న కథలు. అన్ని కథలూ విమర్శకుల ప్రమాణాలు అందుకోలేక పోవచ్చు. ఉత్తమ కథల జాబితాల్లోకి రాకపోవచ్చు. కానీ ఖచ్చితంగా ఇవి మంచి కథలు. మంచేదో ఎరిగిన కథలు. మంచి వైపు నిలబడ్డ కథలు. అందుకే ఈ కర్నూలు కథలు గుర్నాలు  పూలు.

**96187 62076**

# లోపల...



94410 32212

# తరతరాల దుఃఖం

డా॥ ఎం. హరి కిషన్

“అన్నా... ఇన్ని రోజులు ఆగినావు. మరో సమ్మచ్చరమాగు. నువ్వే చూస్తా వున్నావు గదా... ఈసారి గూడా వానల్లేవు. పెట్టిన పెట్టుబడి గూడా మన్నులో కల్సిపోయేటట్లుంది'' నెమ్మదిగా తలొంచుకొని విచారంగా చెప్పినాడు నారాయణ.

“సూడు ఇట్లాగే మూడు సమ్మచ్చరాల నుంచీ రేపు రేపంటానే తిప్పుతా వున్నావు. వరుసకు దూరపు బంధువు అవుతావు. నేనూ రైతునే. అందుకే వడ్డీ గూడా వదిలేసి అసలిమ్మంటున్నా. ఈరోజు అటో యిటో తేలిపోవాల్సిందే. అవతల కూతురి పెండ్లుంది” తెగేసి చెప్పినాడు రాజన్న.

''అదికాదనా... సేతిలో దుడ్లుండి నేను వెనకడుగు యేయడంల్యా. నువ్వు తిట్టినా, తన్నినా, మొగమ్మీద వుమ్మేసినా... ఒక్క పైసా గూడా లేదు. ఇక నీ ఇష్టం” అన్నాడు నారాయణ వంచిన తల ఎత్తకుండా.

నెమ్మదిగా మాటా మాటా పెరిగింది. బంధుత్వాలు, మర్యాదలు పక్కకు పోయినాయి. అంగీ అంగీ పట్టుకునే దాకా వచ్చింది. దాంతో పంచాయితీ వూరి పెద్దల నడుమకు చేరింది.

“చూడు... నీకు నెలరోజులు గడువిస్తా వున్నాం. వున్నది కాస్తా అమ్ముకుంటావా లేక ఎవని కాళ్ళయినా పట్టుకుంటావా అనేది మాకనవసరం. రోషముంటే సరిపోదు. తీసుకున్నాక తల తాకట్టు

పెట్టయినా సరే తెచ్చి ఇయ్యాల్సిందే. అవతల మనిషి రాచ్చసుడేం గాదు. అసలు ఇయ్యమంటున్నాడంతే. ఈ భూమ్మీద ఇంతకన్నా ధర్మంగా ఎవడూ మాట్లాడ్డు. నీకు నెలరోజులు గడువిస్తా వున్నాం. అవతల ఆడకూతురి పెండ్లుంది. జాగ్రత్త" అంటూ పెద్దమనుషులు అందరిముందూ ఏలెత్తి హెచ్చరించినారు.

నారాయణకు తల కొట్టేసినట్లయింది. వీధిలో అందరూ నవ్వుతున్నట్లుగా వుంది. ఎలా ఇంటికి చేరాడో నారాయణకే తెలీదు. అట్లాగే మంచమ్మీద వాలిపోయినాడు. కళ్ళలోంచి ఆగకుండా నీళ్ళు కారుతూనే వున్నాయి. ఇంట్లో ఎవరూ లేరు. అమ్మా, వదిన పని యాడన్నా దొరుకుతుందేమోనని వెదుక్కుంటా పోయినారు.

వదిన గుర్తుకు రాగానే దుఃఖం మరింత పొంగింది. అన్న గోపాల్ గుర్తుకు వచ్చినాడు. ధూ... ధూ... అంతా వాని వల్లే... నడిసముద్రంలో వదిలేసి చెప్పా పెట్టకుండా మాయమైపోయినాడు. పది సమ్మచ్చరాలు అయింది. వెదకని వూరూ లేదు. అడగని మనిషీ లేదు. వదినకు నుదుట బొట్టు వుంచుకోవాల్నో తీసేయాల్నో గూడా తెలీదు. ఇద్దరు సన్నపిల్లల్ని, పెళ్ళాన్ని, ముసలితల్లిని అందరినీ వదిలేసి పన్నుకున్నోడు పన్నుకున్నట్టే మాయమైపోయినాడు. అంతే... ఒక్కసారిగా కలలన్నీ తలకిందులై పోయినాయి. ఎక్కడి చదువు అక్కన్నే వదిలేసి కాడి భుజమ్మీదకు ఎత్తుకోవాల్సి వచ్చింది.

ఇంగ నా సేతగాదు. గుత్తలు కట్టడానికే తలప్రాణం తోకకొస్తోంది. ఎవడూ కౌలుకి గూడా ఇవ్వడం లేదు. ఇంక అప్పెవడిస్తాడు. అదీ నెలరోజుల్లో ... అసాధ్యం. ఈ బదుకు బదకడం కన్నా సావడం మేలు. నెమ్మదిగా పైకి లేచినాడు. అటక మీదున్న పశువులను కట్టే తలుగు బైటకి తీసినాడు. పశువులు అమ్మేసినాక ఆ తాడుతో ఎప్పుడూ పనిబడక పైన పడేసినారు. దుమ్ము విదిలించి, గట్టిగా లాగి చూసి దాన్ని ఒక సంచీలో వేసుకున్నాడు.

కావ్య కళ్ళ ముందు మెదిలింది. "చేతగాని నాకొడకా... నీకెందుకురా ప్రేమ" అంటా 'ధూ' అని మొగాన వుమ్మేసినట్లనిపించింది.

తలెత్తి పైకి చూసినాడు. గోడ మీద వరుసగా ఒకదాని పక్కన ఒకటి మూడు ఫోటోలు వేలాడుతా వున్నాయి. రెండు నలుపుతెలుపుల్లో... ఒకటి రంగుల్లో... మొదటి ఫోటో చానా పాతది. చిన్న ఫోటోను పెద్దదిగా చేసి పెన్సిలుతో దిద్దినట్లుంది. మొదటి రెండింటికీ దండలు వేసి బొట్లు పెట్టినారు. మూడవది వాళ్ళన్న గోపాల్‌ది.

అన్న ఫోటోనే చూస్తా వున్నాడు. ఒక్కసారిగా జాలనిపించింది. నిజమే... ఎవనికి మాత్రం చాతనవుతాది ఇన్ని కష్టాలను భరించడం. ఈరోజు నేను చేయబోతున్నది గూడా అదే గదా. అన్న పడిన కష్టాలు, నిద్రపోని రాత్రుళ్ళు గుర్తుకొచ్చి కళ్ళు చెమ్మగిల్లినాయి.

రేపు... ఈ మూడు ఫోటోల పక్కన నా ఫోటో గూడా మెడలో దండతో, నుదుటన బొట్టుతో, అగరబత్తుల వాసనల నడుమ వేలాడబడుతాదా... లేక కోపంతో అన్నీ తీసుకోనిపోయి ఇసిరి మూలన పడేస్తారా..

అమ్మ, వదిన, అన్నపిల్లలు గుర్తుకు రాగానే మనసంతా బాధతో నిండిపోయింది. ఇంట్లో మొగోళ్లే లేకుండా వరుసగా అందరూ... ఒక్కొక్కరిగా... పాపం... ఎలా తట్టుకుంటారో... వద్దొద్దు. మళ్ళా ఆ ఆలోచనల్లో పడితే కాలు కదలదు. వద్దు... ఇక సాలు... ఈ పది సమ్మచ్చరాల్లో ఏపూటకాపూట అన్నట్లు బదకడమే గానీ ఒక అచ్చటా లేదు... ముచ్చటా లేదు.

కావ్య తోడుంటే... తెగించి పోరాడుతుంటినేమో... కానీ ఆ ఒక్క ఆశ గూడా సచ్చిపోయింది. ఏమన్నాడు వాళ్ళ నాన్న సంబంధం మాట్లాడ్డానికి తల్లితో కలిసి వెళితే...

"చూడమ్మా... మా పిల్లని అడుక్కుతినేటోనికన్నా ఇస్తానేమో గానీ మీ వోనికి మాత్రం ఇయ్యను. ఏం చూసి ఇవ్వమంటావు. కనీసం గజం భూమి గూడా లేనోనికి"

"అదిగాదన్నా... పిల్లలు ఒగరంటే ఒగరు ముచ్చట పడుతున్నారు. వరుస గూడా అవుతారు. ఆ కోరికేదో తీరిస్తే వాళ్ళ బదుకు వాళ్ళు బదుకుతారు గదా" నసిగింది నారాయణ తల్లి.

"ఓ .. బలే చెప్పొచ్చినావు లేమ్మా... పిల్లలకేముంది. ఆకాశంలో మొబ్బులని చూసి ఇంట్లో నీళ్ళు ఒలకబోసుకునే రకం. ప్రేమలు కూడు బెట్టవు గదా... నీ పెద్దకోడలు గతి ఏమయ్యిందో అందరికీ తెలుసు. చూసి చూసి నా కూతురి గొంతు కొయ్యలేను" అన్నాడు ఖరాఖండీగా.

ఆ తర్వాత నెల తిరిగే సరికల్లా టౌన్లో నుంచి ఒక సంబంధం తీసుకోనొచ్చి "చేసుకుంటావా... బాయిలో దూకి సావమంటావా" అని బెదిరించి కూతురికి పెండ్లి చేసి పంపిచ్చేసినాడు.

కావ్య ఆలోచనల్తో గుండె మరింత బరువెక్కింది. కొలిమిలో యేసి కాల్చినట్లనిపించింది. సంచీ చేతిలోనికి తీసుకొని తలుపు దగ్గరకేసి బైలుదేరినాడు. అది సంతరోజు. చుట్టుపక్కల వూళ్ళ నుంచి జనాలంతా నందికొట్కూరుకు చేరుకుంటున్నారు. ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. ఎవరూ ఎవరి గురించి పట్టించుకోవడం లేదు. మాటిమాటికీ తడవుతా వున్న కండ్లను తుడుచుకుంటా అట్లాగే ముందుకు సాగినాడు.

కావ్యా వాళ్ళ నాన్న "రేయ్... గజం భూమి గూడా లేదు. నీకెట్లా ఇస్తాంరా పిల్లను" అంటూ ఎగతాళిగా అన్నమాట పదే పదే గుర్తుకు రాసాగింది నారాయణకు.

"రేయ్... ఒగప్పుడు మేమూ భూమున్న రైతులమేరా... ఈ దేశం కోసం బలవంతంగా త్యాగం చేసి సర్వనాశనమై పోయినోళ్ళలో మేమూ ఒకళ్ళంరా" అంటా గట్టిగా దిక్కులు పిక్కటిల్లేలా అరవాలనిపించింది.

నారాయణకు పొలం గుర్తుకు వచ్చింది. జేజినాయన గుర్తుకు వచ్చినాడు. పుట్టిన వూరు గుర్తుకు వచ్చింది. ఇంట్లో గోడ మీద మసకమసకగా వేలాడుతోన్న జేజినాయన ఫోటో గుర్తుకు వచ్చింది.

జేజినాయన అప్పట్లో శంకర్రావు ఇంట్లో గాసం చేస్తా వుండేటోడు. శంకర్రావు అప్పట్లోనే 'లా' చేసి స్వాతంత్ర్య వుద్యమంలో చురుగ్గా తిరుగుతా ధర్నాలకు, ర్యాలీలకు మద్రాసుకు పోయేటోడు. కాంగ్రెస్ సమావేశాల్లో పాల్గొనేటోడు. శంకర్రావు ఎక్కడుంటే జేజినాయన అక్కన్నే. నమ్మినబంటు.

జేజినాయన ఒకసారి ఆడా ఈడా అప్పు తెచ్చి వూర్లో వున్న రెండెకరాలు అమ్మేసి వూరిబైట చానా దూరంగా వున్న పదెకరాల మెట్టభూమి కొన్నాడు. అది చూసి అందరూ "రేయ్... తొండలు గూడా గుడ్లు పెట్టని పనికిమాలిన భూములవి. అంతదూరం ఎందుకు కొంటా వున్నావు. పిచ్చిగాని తలకెక్కిందా" అని నెత్తీనోరూ కొట్టుకున్నారు. కానీ జేజినాయన నోరిప్పలేదు.

ఇంట్లో దాని గురించి రోజూ గొడవలే. పెండ్లాం బిడ్డల పోరు తట్టుకోలేక ఒక రోజు రాత్రి జొన్న సంగటి వూరగాయతో నంజుకోని తింటా "ఒసేవ్... నేనేం అంత తెలివి తక్కువోన్ని కాదు. ఏలికేస్తే కాలికి, కాలికేస్తే ఏలికి ఏసే శంకర్రావు ఈ నడుమ వూరిబైట నూటాయాభై ఎకరాలు కొన్నాడు. ఏమంటే దుడ్లు శానా వున్నాయి. భూముంటే ఎప్పుడో ఒగప్పుడు పనికొస్తాది గదా... అందుకే... అని పైకి అందరితో వగలుమాటలు మాట్లాడ్తున్నాడు గానీ నీడ లెక్క వెనకుండే నాకు తెలీదా అసలు సంగతి.

పైన కృష్ణాపెన్నా అని అదేదో ఒక ఆనకట్ట వస్తా వుందంట. అది గనుక కడితే కర్నూలు, కడప, నెల్లూరు, తమిళనాడుల్లో చానాభాగం పచ్చగా పైటేస్తాదంట. చూస్తుండండి... ఇప్పుడు నోట్లోకి నాలుగువేళ్ళు పోవడమే కష్టంగా వున్న మన ఇండ్లల్లో లచ్చిందేవి ఘల్లుఘల్లుమంటాది" అన్నాడు. అందరూ ఆని తెలివికి నోళ్ళు ఎళ్ళబెట్టినారు.

కొద్ది రోజులకు మద్రాసు నుంచి వచ్చిన బ్రిటిషోళ్ళ సర్వేలు మొదలయ్యేసరికి అందరికీ నెమ్మదిగా తెలిసిపోయింది. గోదావరి పల్లెల్లో నీళ్ళు పరవళ్ళు తొక్కినట్లు సీమలో గూడా మూడు పంటలు పండుతాయని కొందరు, ఒక్క పంటకు నీళ్ళొచ్చినా సాలు హాయిగా కాలు మీద కాలేసుకోని బతికేయొచ్చునని కొందరు... ఏ రైతు కళ్ళలో చూసినా పచ్చని పంటలే.. ఎవని నోట విన్నా నీళ్ళ గలగలలే.

కానీ ఆ సంబరం ఎంతో కాలం నిలబల్లేదు. అదిగో వచ్చ ఇదిగో వచ్చ అంటానే పదేళ్ళు గడిచిపోయింది. ఆ ప్రాజెక్టు పూర్తయితే తమిళనాడుకి కూడా నీళ్ళు పోతాయి. మన నీళ్ళు వాళ్ళకెందుకు ఇవ్వాల అంటా ఆ ప్రాజెక్టుకి పురిట్లోనే సంధి కొట్టేశారంట కొందరు కోస్తా

నాయకులు. ఇది ఇంకా జనాలకు తెలీనప్పుడే శంకర్రావు కూతురి పెండ్లి దగ్గర పడుతుందంటా తాను కొన్న నూటాయాభై ఎకరాలు మంచి ధరకు అమ్మేసినాడు.

"ఛూ... దీనెమ్మ. మన బతుకింతే" అనుకుంటా జనాలు మళ్ళా ఆకాశమొంక చూస్తా ఆ మట్టిలోనే తనకలాట మొదలు పెట్టినారు. జేజినాయన కన్న కలలన్నీ ఒక్కసారిగా కుప్పకూలిపోయినాయి. తొండలు గూడా గుడ్లు పెట్టని భూమి ఒకపక్క, అప్పులు మరోపక్క. ఆ బాధల్లో తాగుడుకి అలవాటు పడి తాగీ తాగీ ఒకరోజు ఆ పొలంలోనే పడి చచ్చిపోయినాడు. ఇంటి బాధ్యతలన్నీ వాళ్ళ నాయన శివయ్య నెత్తి మీద పన్నాయి. అప్పటికే తెల్లోళ్ళ పాలన పోయి నల్లోళ్ళ పాలన గూడా దేశంలో వచ్చేసింది.

శివయ్యది చిన్నప్పటి నుంచీ బాగా కష్టపడే ఒళ్ళు. ఎద్దయినా ఒక్కక్షణం ఆగుతుందేమోగానీ శివయ్య ఆగడు. వూరిబైటి పొలాన్ని సాగు చేయడం కన్నా కూలీకి పోవడం మేలు అనేటోడు జేజినాయన.

దాంతో ఆయనున్నంత వరకు ఆ పొలంకెళ్ళి ఎవరూ కన్నెత్తి గూడా చూడలేదు.

కానీ శివయ్యకు తనకంటూ ఒక పొలం వుండాలని ఒకటే కోరిక. దాంతో ఏది ఏమైనా సరే వూరిబైటి పొలాన్ని సాగులోనికి తెచ్చుకోవాలనుకున్నాడు. ఎప్పుడు తీరిక దొరికినా పొలానికి పోయి రాళ్ళు ఏరి, పెద్ద పెద్ద బండలు పగలగొట్టి, కంపచెట్లు మూలంతో బాటు పెకళించి... నెమ్మదిగా దాన్ని సాగులోనికి తెచ్చినాడు. వానికాళ్ళు వీనికాళ్ళు పట్టుకోని అప్పు తెచ్చిన డబ్బుల్తో బావి తవ్వించినాడు. దశ తిరిగి జల పొంగుకొచ్చింది. శివయ్యను చూసి అందరూ నక్కను తొక్కినావురా అని తెగ మెచ్చుకున్నారు. అప్పు నెత్తిమీదుంటే బ్రహ్మరాక్షసి నట్టింట్లో వున్నట్లే అనుకుంటా వచ్చింది వచ్చినట్లు అప్పు కట్టసాగినాడు. నాలుగు పంటలు పండేసరికి అంతా తీరిపోయింది. వాని కష్టం చూసి వూళ్ళో మర్యాద పెరిగింది. పంచాయితీలలో పెద్ద మనుష్యుల మధ్య చోటు దొరికింది. ఈసారి పంట వస్తే పాత మట్టి మిద్దె పీకి కొత్తగా రెండుగదులు వేయాలనుకున్నాడు.

కానీ అంతలో...

* * * * *

వూరిలో ఎవరిని కదిపినా దుఃఖమే. అందరి మొగాలు పాలిపోయి వున్నాయి. అందరి సమస్యా ఒక్కటే. కాళ్ళ కింద మట్టి తమది గాకుండా పోతోంది. పుట్టి, పెరిగి, మన్నులో మన్నులా కలిసి ఆనందాలు, విషాదాలు, జ్ఞాపకాలు, అనుబంధాలు కలగలసిన వూరు. ఒక్కసారిగా జలసమాధి అయిపోతా వుంది. ఎక్కడికి పోవాలి. అందరి కళ్ళ ముందు అదే ప్రశ్న. భయంతో ఒళ్ళు ఒణుకుతా వుంది.

కొత్త వూరిలో కొత్త మనుషులతో కలసిపోవడం ఎంత కష్టం. ఈ వూరిలో గడపగడపా తెలుసు, వాళ్ళు చేసే పనులు తెలుసు, మాట తీరు, మనసు తీరు, ఎవరితో ఎట్లా ప్రవర్తించాల, ఏ పనికి ఎవర్ని పిలవాల, ఏవి పాలు, ఏవి నీళ్ళు అన్నీ తెలుసు.

అధికారులు, పోలీసులు రోజూ వస్తున్నారు. శ్రీశైలం డ్యాం కింద మీ వూరు మునిగిపోతావుంది. ప్రభుత్వం మీకు వేరే చోట ఇండ్లు, పొలాలూ, నష్టపరిహారం అందజేస్తా వుంది. ఒక నెలకల్లా కదలకపోతే బలవంతంగానన్నా ఖాళీ చేయించాల్సొస్తాది. హెచ్చరికల మీద హెచ్చరికలు. ఎకరాకు మూడు నాలుగు వేలు ఇస్తున్నారు. అక్కడక్కడా చిన్న చిన్న గొడవలు జరిగినా "ఎవరూ త్యాగం చేయకపోతే అభివృద్ధి ఎట్లా సాధ్యం. మర్యాదగా ఖాళీ చేస్తారా... లేక... " అంటూ పోలీసులతో బెదిరిస్తున్నారు.

కొందరు చదువుకున్నోళ్ళు, డబ్బున్నోళ్ళు, తెలివైనోళ్ళు గుంపయినారు... "ఎవరూ సంతకాలు చేయకండి. మరీ ఇంత తక్కువనా ఇచ్చేది. త్యాగాలు మనం చేస్తే ఎక్కడో ఎవడో పంటలు పండించుకుంటాడంట. మన వాటా మనకు తేలాల్సిందే. ఇంటికో వుద్యోగం, న్యాయమైన పరిహారం కోసం కోర్టులో కేసు వేద్దాం" అంటున్నారు. కానీ చానామందికి ఇవేమీ అర్థం కావడం లేదు. చేతికందుతున్న ఈ పైసలు గూడా వదిలేస్తే మళ్ళా ఎప్పుడొస్తాయో ఏమో, అసలు వస్తాయో రావో... అన్న భయంతో ఎంత ఇస్తే అంత తీసుకోని... గూట్లో బతికిన పిట్టలు గుట్టల పాలైనట్లు కళ్ళల్లో నీళ్ళు దాచి పెట్టుకుంటా చెట్టుకొకరు పుట్టకొకరుగా చెదిరిపోతున్నారు.

శివయ్యకు కాలూసేయీ ఆడ్డం లేదు. కౌలుకుగానీ, కొనడానికి గానీ భూమెక్కడయినా దొరుకుతుందేమోనని చుట్టుపక్కల బంధువుల వూళ్ళకంతా పోయొచ్చినాడు. ఒక్కసారిగా తనలాగే చానామంది రైతులు ఎగబడడంతో ధరలు కొండెక్కి కూచున్నాయి. పోలవరం గిరిజనునికి అడవి తప్ప ఏమీ తెలీనట్లు శివయ్యకు వ్యవసాయం తప్ప ఏమీ తెలీదు. అక్షరం ముక్క రాదు. ఏమి చేయాలో వూపిరాడ్డం లేదు.

పక్కనున్న చాకలి రంగన్న గుడిసె వైపు చూసినాడు. తలుపులు ఖాళీగా బోసిపోయి వున్నాయి. మూడురోజుల కిందట రంగన్న అన్నమాటలు గుర్తుకు వచ్చినాయి. "సూడు మామా... మాతో పోల్చుకుంటే కొంతలో కొంత నీ పరిస్థితే మేలు. ఇండ్లు, భూములున్నాయి కాబట్టి సేతిలో ఎంతో కొంత దుడ్లన్నా పడతాయి. కానీ వృత్తి పనులు చేసుకుంటా వూరి మీద ఆధారపడి బతికే నాలాంటోళ్ళ పరిస్థితి ఏమి. ఏ వూరికి పోయినా ఎవరిండ్లు వాళ్ళకున్నాయి. నోటికాడ కూడు పంచుకోడానికి ఎవడిష్టపడతాడు సెప్పు. టౌనుకి పోయి కూలీలుగా మారడం తప్ప గతి లేదు. చెరువు నుంచి చేపను వేరు చేసినట్లుంది మా పరిస్థితి" అన్నాడు కండ్లనీళ్ళతో.

శివయ్యకు రంగన్నను తలచుకుంటే మనసు కళుక్కుమనింది. వూళ్ళో అందరూ తట్టాబుట్టా సర్దుకుంటున్నారు. ఒక్కొక్క ఇళ్ళే ఖాళీ అయిపోతా వుంది. ఏమి చేయాలో తోచక శివయ్య ప్రభుత్వమిచ్చిన ఆ అరకొర పరిహారం తీసుకోని పెళ్ళాం బిడ్డల్తో నందికొట్కూరులో అడుగు పెట్టినాడు. ఒక స్నేహితుని సలహాతో ఇంకొకనితో కలిసి నూనె గానుగ మొదలు పెట్టినాడు. మొదట్లో బాగానే జరిగింది. పదికి పది లాభమొచ్చింది. కానీ అది కొద్దినాళ్ళే. యాపారంలో అఆలు గూడా తెలియకపోవడంతో జరుగుతున్న మోసం అర్థం చేసుకునే లోపల, వున్నదంతా వూడ్సుకుపోయి కట్టుబట్టల్తో నడీధిలో నిలబడాల్సొచ్చింది.

శ్రీశైలం జలవిద్యుత్ డ్యాం పూర్తయి నీళ్ళు గలగలగల కిందికి దుంకినాయి. పచ్చని కోస్తాలో మరిన్ని పల్లెలు పచ్చగైనాయి. జలవిద్యుత్ డ్యాం కావడంతో గొంతు వరకూ నీళ్ళున్నా సీమకు ఒక్కచుక్క నోటికందడం లేదు. కేవలం నాగార్జునసాగర్‌కు ఓవర్‌హెడ్ ట్యాంకులాగా మారిపోయింది. బహుళార్థసాధక ప్రాజెక్టుగా మార్చి ఎండిన సీమగొంతు తడపాలని ఎన్నెన్నో గొడవలు.

ముంపు బాధితుల కష్టాలను ఎవరూ పట్టిచ్చుకోవడం లేదు. పరిహారం పెంచుతున్నారని, ఇంటికో వుద్యోగం వస్తుందని అప్పుడప్పుడు వార్తలు. కనీసం కొడుక్కి వుద్యోగం వచ్చినా కుటుంబం గట్టెక్కుతుందని శివయ్య ఎదురు చూసినాడు. రోజులు గడుస్తున్నకొద్దీ ఆశలు అడుగంటసాగినాయి. అప్పులు పెరిగిపోతా వున్నాయి. కొత్తగా ఎక్కడా అప్పులు పుట్టడం లేదు. దాంతో భవిష్యత్ భయంకరమై ఒకరోజు శివయ్య ఆ శ్రీశైలం డ్యాం పైకెక్కేసి అందులోకే దుంకేసినాడు. దాంతో ఇంటి బరువు పెద్దకొడుకు గోపాల్ మీద పడింది.

కొందరి నిరంతర పోరాటాలతో డ్యాం కట్టిన ముప్పయి ఏళ్ళకు అదీ తెలుగోడు ఆ ప్రాంతం నుంచి ప్రధానమంత్రిగా ఎన్నికయినాక మరికొంత పరిహారం అందింది గానీ... అప్పటికే చిన్న చిన్న కుటుంబాలన్నీ కోలుకోలేనంతగా చితికిపోయినాయి. అనేకమంది ఆచూకీ తేలలేదు. వున్నవాళ్ళలో చానామంది పేర్లు రికార్డుల్లో లేవు. గోపాల్ చేతికి కొంత డబ్బు అందింది గానీ అది అప్పటికే పెళ్ళీడు దాటుతా వున్న చెల్లెలి పెండ్లికి ఖర్చయిపోయింది.

* * * * *

నారాయణకు గాయాలన్నీ పచ్చిగానే సలుపుతావున్నాయి. గోడమీది ఫోటోలు గిర్రున తిరుగుతా వున్నాయి. బతుకు మీద విరక్తి అంతకంతకూ పెరిగిపోతా వుంది. సంచీ చేతబట్టుకోని బెరబెరా అడుగులు వేస్తా వున్నాడు.

వూరి చివర ఒక పాడుబన్న గుడి కనిపించింది. చివరిసారిగా దేవునికి మొక్కుకోవాలనిపించి లోపలికి అడుగు పెట్టినాడు. ఎవరూ లేరు. బీడుపడిన భూమిలా వుంది. మధ్యలో విగ్రహం పూజలు లేక, ఎవరూ పట్టించుకోక... ఒంటరిగా... దిక్కుతోచని రైతులా...

భక్తుల కోసం ఎదురుచూస్తా వుంది. నారాయణ పెదవులపై విరక్తితో చిరునవ్వు మెరిసింది. రెండు చేతులూ జోడించి "సామీ ... వచ్చే జన్మలోనన్నా ఈ సీమలో రైతుగా పుట్టించమాకు" అంటూ మొక్కుకున్నాడు. గుండె బాధతో బరువెక్కిపోతా వుంది. వెనక్కి తిరిగినాడు. ఎంత ఆపుకుందామన్నా దుఃఖం ఆగడం లేదు.

అంతవరకూ ఎర్రటి ఎండతో కాల్చేసిన ఆకాశం నెమ్మదిగా మబ్బులతో నిండిపోసాగింది. భూమంతా చిక్కటి నీడ ఆవరిస్తా వుంది. మబ్బులు ఒకదానితో ఒకటి కలిసిపోతా వున్నాయి. కాసేపటికి ఒక్కొక్క చినుకు భూమాతను హత్తుకొని ఐక్యం కాసాగింది. వాన నెమ్మది నెమ్మదిగా పెరగసాగింది.

నారాయణ అడుగుల వేగం మరింత పెరిగింది. కళ్ళలోంచి కారుతున్న నీళ్ళు వాననీళ్ళలో కలిసిపోసాగినాయి. వేల వేల కన్నీటి చుక్కలు ఒకదానితో ఒకటి కలిసి కాలువై వంకై వాగై ప్రవాహమై కృష్ణానదిలో కలసి శ్రీశైలంవైపు నిశ్శబ్దంగా సాగిపోతా వున్నాయి.





89850 34894

# రెండో వీరగల్లు

జి. వెంకట కృష్ణ

"ఈ వీరగల్లును సిద్ధేశ్వరం చేరిస్తే మన కష్టాలు తీరుతాయంట మా తాత చెప్పినాడు... యీ వీరగల్లును యేట్లోకేస్తాంరాండి" కనిపించిన వాళ్ళందరికీ చెప్తున్న పన్నెండేళ్ళ పూజారి వీరేశ్‌ను అందరూ వింతగా  చూస్తున్నారు.

"ఈ వీరగల్లును సిద్ధేశ్వరం చేరిస్తే, అలుగులా నిలబడి నీళ్ళన్నీ కిందికి పోనీకుండా ఆపుతాడంటా... అప్పుడు ఆ నీళ్లన్నీ మన పంటపొలాలకే... నిజంగా" అంటున్న ఆ పిల్లవాణ్ణి,

"అయ్యో యింత చిన్న వయసుకే యీ పిల్లోడు యిట్లా ఎట్లా అయినాడబ్బా, పూజారి నారాయణకు ఎంత కష్టమొచ్చ గదా" అనుకుంటున్నారు ఆ వూరివాళ్ళు.

పూజారి నారాయణక్కూడా అంతా అయోమయంగా వుంది.

"యేంది వీడిట్లా అయినాడు... లక్షణంగా చదువుకుంటున్నోడు, సుగ్గికి యెలవారిన్నాపొద్దున్నుంచీ విచిత్రంగా మాట్లడతా వుండాడే" అని యెదారు చేస్తున్నాడు.

నాలుగు రోజుల కిందట వుపాధి పనుల బిల్లుల కోసం మండలం ఆఫీసుకు పోతున్నప్పుడు నేనూ వస్తా, నేనూ వస్తా నంటూంటే, వచ్చి నువ్వేమి చేస్తావురా,అన్నా వినకుంటే, వీరేశ్‌నూ తోలకపోయినాడు నారాయణ.

"సార్ సుగ్గికి యెలవార్నామ్... వుపాధి బిల్లు యింకా పడ్లేదు... తొందరగా యిస్తే ఖర్చులకన్నా వస్తాయి..." ఏపీఓనూ టెక్నికల్ అసిస్టెంట్‌నూ అడుక్కొన్నాడు.

నారాయణనూ అతని వెంట వున్న వీరేశ్‌నూ వింతజీవుల్ని చూసినట్లు చూస్తూ, కొత్తగా వచ్చిన ఏపీఓ, ఫీల్డ్ అసిస్టెంట్‌ను, "సుగ్గికి పోవడమంటే ఏందని" అడిగాడు.

"సుగ్గికి పోవడమంటే, పంటలు బాగా పండే ప్రాంతానికో, పనులు దొరికే ప్రాంతానికో పోయి అయినకాడికి కూలి పనులతో అంతోయింతో సంపాదించుకొని వచ్చేది సార్..."

"ఏ ప్రాంతానికి పోతారు"

"గుంటూరు దిక్కు చానా మంది గుంపులు గుంపులు పోతారు సార్, మన ఆదోని ప్రాంతం నుంచీ యేటా పోతారు సార్. ఉగాది ముందు మూణ్ణెళ్ళు పోయొచ్చి, ఉగాదికి వూరికొచ్చి, పండగ చూసుకోని మళ్లా జూన్‌దంకా పోతారు సార్. బెంగుళూరు దిక్కు పోయేవాళ్లూ వుంటారు..."

"మరి మన ఉపాధిపనులు చేసుకోవచ్చు గదా... యిక్కడే పనులు పెడుతూన్నాం గదా..."

"సార్ మనం పనులు పెడుతూన్నాం గానీ, ఒక్కో జాబ్ కార్డు మీద నూరు దినాలే గదా పనిస్తాం... ఆ తరువాత ఖాళీగా యెందుకుండాలని అనుకుంటారు... యీ నారాయణ నూరు దినాలు చేసేసి, వేరే కార్డు మీదా కొన్ని రోజులు చేసి, యింగిప్పుడు సుగ్గికి పోతాన్నాడు... అంతే గదా నారాయణా"

"అవుగదా సార్... ఎన్ని దినాలు పని చేసినా నూరు, నూటిరవై మించి మీ దగ్గర కూలి పడుతుందా... అది గూడా యెనిమిది వారాలైనా బిల్లులియ్యలేదు... పోయిన సారి చానా ముందుగానే సుగ్గికి పోయింటిమి... యీ సారి మా యింటి దానికి పాణం బాగలాక లేటైపాయ... మళ్ల నా బిల్లులెప్పుడిస్తారు సారూ"

"యేమప్పా పూజారి నారాయణ, అమరావతి కట్టేకే దుడ్లులేవ్... నీకి వుపాధి దుడ్లు అంత ముఖ్యమైపాయెనా... రోంత వుండండీ తొక్కులాడొద్దండీ... మస్టర్లు యెక్కీనీకె కంప్యూటర్ ఆపరేటర్లు లేరు... రేయింబొగుళ్లూ ఎక్కిచ్చినా అయితా లేదు"

"అట్లంటేయెట్ల సారూ..." అని నారాయణ గడిబిడీ చేస్తూంటే, ఫీల్డ్ అసిస్టెంట్ వుశేన్ పీరా, నారాయణ భుజమ్మీద చెయ్యేసి, బయటకు తీసుకొచ్చినాడు. బంకు దగ్గర మూడు టీలు చెప్పి,వీరేశ్ చేతికి ఒక కప్పు అందించినాడు. నారాయణకు అవసరం వుంది, పీరాను మింగలేక కక్కలేక,మిర మిరా చూస్తూ. ఊదుకోని ఊదుకోని, టీ తాగుతూన్న కొడుకు నెత్తి మీద ఒకటిచ్చి, "యిట్లాజేస్తే యెట్లా పీరా సార్, సుగ్గికి పోవాల్నంటే, ఖర్చుకి లేవు" అన్నాడు.

"అయ్యో నారాయణన్నో నా మాటినూ, నన్ను నమ్మూ దుడ్లూ రిలీజ్ అయితా లేవన్నా, నువ్వు సుగ్గికి పోయి రాపో... నీ దుడ్లు ఎక్కడ పోవుగానీ..."

"ఆ హంద్రీ నీవా కాలువలో నీళ్ళొచ్చినట్లే వుంది సారూ మీరు దుడ్లు యిచ్చేది..లెట్రిన్లు కట్టుకోమంటిరి... పొలాల్లో గుంతలు పెట్టుకోమంటిరి... దుడ్లు మాత్రం అప్పుడొస్తాయి, యిప్పుడొస్తాయి అంటారు."

"మన హంద్రీనీవా పొంగి పొర్లుతుందిలేన్నా... ఆడ పట్టిసీమనో వట్టిసీమనో కట్టిండ్లా... యింగిప్పుడు కృష్ణ నీళ్లు ఎనిక్కెనిక్కి ఎక్కొచ్చి... శ్రీశైలం దాటుకోని మనూర్లకు వస్తాయిలేన్నా..." పకపకా నవ్వుతూ అంటున్నాడు పీరా.

"సుళ్లు కూతలొద్దు....నిజం చెప్పు సారూ... ఆడాడో వట్టిసీమ కడితే మనకు నీళ్లు వస్తాయంట గదా..."

"అయ్యో తిక్క మనిషీ, మీ బోయోళ్లంత ఆవేశం మనుషులు, అమాయకులు ఎవురూ లేరు. సూడూ... ఆడాడో కింద కడితే, పైకి నీళ్లెట్లా ఎక్కొస్తాయన్నా... శ్రీశైలం కాడ నీళ్లు కిందికి పోనీకుండా ఆపితే, 854 అడుగులు నీళ్ళు నిలబడితే అప్పుడు మనకు నీళ్లొస్తాయిగానీ... అయినా శ్రీశైలం కాడ నీళ్లాపితే కరెంటు ఎట్టా మనకు అని,కరెంటు కోసమే అన్నట్లు, నీళ్లను సాగర్‌కు తోలుకుంటారు. వాళ్ళ తెలివే తెలివి సూడీ... అయినా యిబ్బుడు తెలంగాణా వాళ్ళు రంగంలోకి దిగిరి గదా, వాళ్ళు వూరికే వుంటారేమి... మన పోతిరెడ్డిపాడు గేటుకు నీళ్ళు అందాలన్నా 840 అడుగులు నీళ్ళు వుండాలి"

"అంతేనంటావా... మన హంద్రీనీవా పారేది సుళ్లేనంటావా... మేము ఏటేటా సుగ్గికి పోక తప్పదంటావా... వానాలి వానెక్కా , నాకు రోజూ రెండు విచిత్రాలు కన్పిస్తాయి పీరా సారూ, మనూరి దిగువ దిక్కేమో హంద్రీ వంక పారుతుందా... వానాకాలంలో పొంగి నీళ్లను తుంగభద్రలో కలుపుతుంది. పైదిక్కేమో హంద్రీనీవా కాలువ అనంతపురం దిక్కు పోతుంటుందా.....రెండింట్లో యాదాంట్లో యిన్ని నీళ్లున్నా మన బతుకులు బాగుండు..."

"ఏమోలే నీ కొడుకు కాలానికన్నా బాగుపడతామేమోలే..."

"ఏమో ఏం బాగుపడతామో... ఎంత కొట్లాడితే వుపాధి దుడ్లు యిస్తున్నారు మీరు... దీనికే యింత కొట్లాడితే... హంద్రీనీవా పారాల్లంటే యింగెంత కొట్లాడల్లా..."

"హంద్రీనీవా పారాల్లంటే, పోతిరెడ్డి పాడుకు నీళ్ళు ఎక్కాలంటే సిద్ధేశ్వరం అలుగు కట్టాలన్నా... దాని కోసం కొట్లాడాలన్నా..."

"యీ జనాలు కొట్లాడలేరంటావా... పీరాసారూ..."

"కొట్లాడే కాలమొచ్చిందిలేన్నా... నీతో పాటు నీ కొడుకు కొట్లాడుతాడు... ఏరా కొట్లాడుతావా... జై రాయలసీమ అంటావా" వీరేశ్‌ను పట్టుకుని అడుగుతున్నాడు పీరా.

"పీరా సారూ మా ముత్తాత పత్తికొండ కోటకు కావలగాడంటా. మా ముత్తాత వీరేశ నాయకుడు, అందుకే వీనికి ఆ పేరు పెట్టినా... పేరైతే పెట్నాగానీ... వీణ్ణిగూడా యీసారి సుగ్గికి ఏసకపోతాన్నా..." నవ్వు ఏడుపూ కలగలసిన గొంతుతో చెప్తున్నాడు నారాయణ.

"వస్తాం సారూ... యాడన్నా దుడ్లు బుడుక్కోని, రాత్రికి రైలుకు యెలవారల్లా... మా వుపాధి దుడ్లు మా అకౌట్లోకి వేయిచ్చు మర్సిపోకుండా..." అని వీరేశ్ చేయి పట్టుకొని రారా పోదాం అంటూ వాడి మొఖంలోకి చూశాడు, వాడిలో యేదో తేడా కనిపించింది.

మధ్యాహ్నంకి ఎక్కడవక్కడ సర్ది, వెంట తీసుకుపోవాల్సినవి మూటకట్టి, రాత్రి రైల్లో తినడానికి సద్ది కట్టుకున్నారు. వూళ్ళో చెప్పాల్సిన వాళ్లకందరికీ చెప్పి వచ్చారు.

రాత్రి తొమ్మిదిన్నర లోపల ఆదోని చేరుకుంటే రైలు దొరుకుతుంది. అందులోనూ వూర్నుంచి ఆటోలో పత్తికొండ పోవాలా, ఆడ్నుంచీ బస్ ఎక్కాలా. ఆనీపూనీ ఆటో ఎక్కాలకు, మబ్బులు కమ్ముకున్నాయి. ఆటో హంద్రీ కాడికి వచ్చాళకు బీభత్సంగా గాలి పట్టుకుంది. యర్రదుమ్ము చుట్టుకుంది. ఆటో వూగి వూగి పోతోంది. పటా పటా యింతింత చినుకులు రాలబట్నాయి. గాలివాన హోరుగా కురవ సాగింది. తడసి ముద్దైపోయారు. కమ్ముకుంటున్న చీకటిలో దూరంగా పిడుగు పడి మెరిసింది... అంత వర్షంలో ఆటో ఆగిపోయింది... నారాయణ పెళ్ళాం బిడ్డలతో వంక గడ్డన పాత గుడి మండపంలో నిలబడినాడు.వంక మెల్లగా పారుతున్నది... ఆశ్చర్యంగా అప్పటికప్పుడే వేగం పెరుగుతోంది. ఎలాంటి వంక అది... ఒక్కసారిగా పొంగి వురుకులు పరుగులూ తీస్తుంది... దినం మధ్యాన్నానికి చుక్క నీళ్లు లేకుండా మాయమైపోతుంది... 'నంగనాచి జలతల్లి నిన్న రాత్రి ఎంతోటు పొంగెనన్నా, యిబ్బుడు సూడూ ఏమీ యెరగనట్టు వొట్టిపోయింది...' అనుకుంటారు జనాలు. నారాయణ తండ్రులు తాతలూ అలాంటి పొంగులకు సాక్షులుగా నిలబడినవారే. యిబ్బుడూ నిలబడే వున్నారు, తట్టాబుట్టా చేతబట్టుకొని, తడసి ముద్దైపోయి, సామాన్లు చెల్లాచెదురైన తమ వారసత్వాన్ని చూస్తూ...

నారాయణ కొడుకు వీరేశ్‌కు నీళ్లలో యేదో కదులుతున్నట్లు అనిపించింది. రెండు మూడు సార్లు ఆ కదలికను చూసాక...

"నాయనా నాయనా... ఆడసూడూ... నీళ్లమీద ఒగ తాత నడుస్తూన్నాడు. చేతిలో కత్తి వుంది నాయనా..." వెర్రిగా అరిచాడు. అరె యెవరన్నా మనీషి కొట్టుకొని పోతున్నాడా... అనే అనుమానంతో... యాడ్రా, యాడ్రా... అని నారాయణ ఆత్రంగా అడిగాడు, అయినా చేతిలో కత్తి ఎందుకుందబ్బా, అనుకుంటూ.

"అదిగో అక్కడ నాయనా..." అని వీరేశ్ చూపించిన వైపు నారాయణ చూశాడు. చీకటిలో గాలిలో, పల్లంలోకి దూసుకుపోతున్న నీటి ప్రవాహం మీద ఏమీ కనిపించడం లేదు.

ఆ రాత్రి ప్రయాణం ఆగిపోయింది. యింటికి చేరి, సంచులు యిప్పదీసి, సంసారాన్ని నేల మీద పరిచారు.

ఉదయం యింటి ముందు జనాలు చేస్తున్న సందడికి మెలుకువ వచ్చింది. యేందబ్బా అనుకుంటా వాకిలి తీస్తే... యింటి ముందర తమ మారెమ్మ గుడి కట్టకు జనాలు

ఎగబడివుండారు. ఈ మారెమ్మ గుడికి నారాయణ వాళ్ల బోయ కుటుంబాలే పూజారులు. జాతరలు జరిగినప్పుడు, మొక్కుబడులు చెల్లించేటప్పుడూ వీళ్ళే ఆ తంతులు జరిపించేది. వంశ పారంపర్యంగా వస్తున్న ఆనవాయితీ అది.

"ఏంది, ఏమైందన్నా , గుడిలో ఏమైంది, అంటూ నారాయణ జనాల్ని తోసుకుంటూ వెళ్తే... కనిపించింది... గుడి కట్టకు ఆనించి వుందది... నిగనిగలాడుతున్న నల్లని విగ్రహం. మందంగా వున్న నల్లని రాతి మీద చెక్కిన శిల్పం. బలమైన శరీరం, తీక్షణమైన కళ్లు, పురితిప్పిన మీసాలు, తలపాగా, చేతిలో కత్తితో, యింకో చేయి అభయముద్రతో... రాత్రి పొంగిన వంక దీన్ని తేల్చింది. ఇసుక తవ్వకానికి వెళ్లిన ట్రాక్టర్ వాళ్ళకి యిది కన్పించగా, పది మందితో మోపించుకొని యిక్కడికి చేర్చారు.

"యిలాటి వీరగళ్లులు వూరి వూరికీ వుండేవంటా, ఆ వూరి పాళెగాళ్లో, ఆ వూరికే చెందిన వీరుడో, వూరి కోసం పోరాడిన వాడి గుర్తుగా, యిట్లా విగ్రహాలు ఏర్పాటు చేసేవాళ్లంటా, కాలక్రమంలో కూలిపోయి, మట్టిలో కలిసిపోయి, ఏటి గట్టునో ఏట్లోనో పడివుంటాయి...' జనాలు చెప్పుకుంటున్నారు. వూరు వూరంతా వీరగళ్లును చూసి పోతున్నారు.

వీరేశ్ కూడా దాన్ని చూస్తూ... "నాయనా రాత్రి నేను చూసింది యీ తాతనే... నీళ్ల మీద నడిచింది యీ తాతనే..." అరుస్తూంటే,

"అరే తిక్కనాకొడకా, యీ బండ నీళ్లలో పొర్లింటుంది లేరా...' అన్నాడు నారాయణ.

"లేదు నాయనా కత్తి పట్టుకుని నీళ్ల మీద నడిచినాడు... నేను చూసినా...' వాదించాలని చూస్తూంటే, వాణి నెత్తి మీద ఒకటిచ్చి, యింట్లోకి పో" అని గెదురుకున్నాడు, నారాయణ.

"వీరేశ్ దాన్ని చూస్తూ యింట్లోకి పోయి, కిటికీ కాడ నిలబడి చూస్తూన్నాడు. ఆ పగలు వచ్చి చూసి పోయే జనాలతో వాళ్లింటి ముందు జాతర జరిగింది...

రాత్రి అన్నం తిని... వాళ్లక్క పక్కనే పడుకున్నాడు వీరేశ్. వాళ్ళక్కను కరచుకొని పడుకోవడం వాడికి అలవాటు. మంచి అర్ధరాత్రి మెలకువ వచ్చింది. వీరేశ్ లేచి కూచున్నాడు, అక్క, అమ్మ, నాయనా గురకలు పెడుతున్నారు. కిటికీ లోంచి చూస్తే, బయట వెన్నెల కురుస్తోంది... కిటికీ దగ్గరకు వెళ్లి వీరగళ్లును చూశాడు. ఆ శిలా విగ్రహం మీద వెన్నెల పడి మెరుస్తూన్నది. కాస్సేపటికి ఆ శిలలో కదలిక గమనించి, వీరేశ్ గుడి ముందుకు వచ్చాడు. మారెమ్మ గుడి వీరేశ్‌కు బాగా అలవాటు. వాడి ఆటపాటలన్నీ, రేయింబొగుళ్లూ, అక్కడే... వాళ్లమ్మకు వాడు యింట్లో కనపడకపోతే, గుడిలో వుంటాడులే అనుకుంటుంది.

అంతలో శిలలో నుండి వీరుడు బయటపడ్డాడు. వీరేశ్ అతన్ని గుర్తుపట్టి, చేతిలోని కత్తిని చూస్తూ, "నువ్వు ఎవురు తాత" అనడిగాడు...

"అరే మనవడా, నేను మీ ముత్తాతను రా... వీరేశనాయకుణ్ణి... మనం బోయ వీరులంరా..."

"ఎందుకు తాతా యిట్లయిపోయినావు...రాయిగా మారిపోయినావు..."

"మా కాలంలో ఈ వూరి మీద పడి దోచుకుంటున్న దొంగలగుంపును మేము తరిమికొట్టినప్పుడు, దొంగలగుంపు నాయకుడి తల తీసింది నేనేరా... నేను చనిపోయినెంక వీరగల్లును చేసి పూజించినారు... నా సంగతి సరే... మీరేమిరా యీ గతి పట్టినారు... బతికేదానికి కన్నగసాట్లు పడతాన్నారే..."

"అవును తాతా... మాకు పొలమున్నా నీళ్లులాక అది పండదు... మా నాయనకు పనుల్లేవు... మాకేమన్నా సాయంజేయి తాతా..." దీనంగా అడిగాడు.

"యీడ హంద్రీ నీళ్లన్నీ యేమై పోతున్నాయి, తుంగభద్రలో పారే నీళ్లన్నీ ఎక్కడ పోతున్నాయి, పత్తికొండ కాడ పెద్ద చెరువు వుండాల గదా అది యెండిపోయిందా..."

వీరేశ్, తనకు తెలిసిన కాడికి, పీరా సార్‌తో నారాయణ మాట్లాడిన మాటలు అర్థం అయిన కాడికి, తాతకు చెప్పి, సిద్ధేశ్వరం కాడ అలుగు కడితే మనకు నీళ్లు వస్తాయంట తాతా" అని చెప్పగలిగాడు.

"అయితే మనవడా నన్ను సిద్ధేశ్వరం చేరిస్తే... నాయట్లా వీరగల్లులను కలిపి కుప్పేసి, సిద్ధేశ్వరం అలుగై నిలిచి చుక్కనీళ్లు, కిందికి పోనీకుండా చేస్తా..." అన్నాడు.

"నువ్వు అట్లా చేస్తే ,అంతకంటే యింకేంగావల్లా తాతా... మా వూర్లల్లో రైతులందరూ బాగుపడతారు..." వీరేశ్ అంటూండగానే చంద్రుడు మబ్బుల చాటుకు పోవడంతో, వెన్నెల ఆరిపోయింది... వెన్నెల వెలుగు ఆరగానే, వీరగల్లు శిలగా మారింది. 'అయ్యో తాతా, తాతా' అంటూ అరుస్తూన్న వీరేశ్ అరుపులకు నారాయణ, అతని భార్య లేచొచ్చినారు.

"అరే యేందిరా... యింత రాత్రి పొద్దు, గుడిలోకొచ్చి అరుస్తున్నావు... కొంచెమన్నా భయం లేకుండా... తిక్క నాయలా" అంటే, "నాయనా యీ రాయిలో వుండేది, మన తాతనే నాయనా... నాతో యింతసేపూ మాట్లాడినాడు..." వీరేశ్ అంటుంటే, నారాయణకు కంపరం పట్టుకుని, "యేమే, వీణికేమో తిక్క పట్టినట్లుందే... యింట్లోకి తీసకపోయే ముందు..." భార్యతో అన్నాడు.

"లేదు నాయనా... నిజంగా యీ విగ్రహం తాతదే... తాతది గూడా నా పేరే... వీరగల్లు అయినాడంటా... తాతను సిద్ధేశ్వరం చేరిస్తే, డ్యామ్లో నుంచి నీళ్లు కిందికి పోనీకుండా కావలి కాస్తాడంటా... నాతో చెప్పినాడు... తాతను సిద్ధేశ్వరం చేరిస్తే మనకు పంటలు పండుతాయి నాయనా..." వున్మాదంగా చెప్తున్న వీరేశ్‌ను నారాయణ ఆందోళనగా చూసాడు.

కొడుక్కు యేమో అయ్యిందనే భయంతో వణికిపోయాడు. వీరేశ్‌ను భుజం మీదికి యెత్తుకున్నాడు... వీరేశ్ వొళ్ళు వేడిగా అనిపించింది. కర్నూల్ ఆసుపత్రికి తీసకపోవాల్సి వస్తుందేమో, అనుకుంటా సతమతమై పోయాడు.

రాత్రి గడిచింది. వుదయం వీరేశ్‌కు నిజంగానే జ్వరం పట్టుకుంది... తాతను కలవరిస్తున్నాడు... వీరగల్లును సిద్ధేశ్వరం చేర్చాలని నారాయణను అడుగుతూనే వున్నాడు... ఆ కలవరింతలతో నారాయణకు మరింత భయం పట్టుకుంది.

అది మొదలు పూజారి వీరేశ్ వెన్నెల కోసం ఎదురు చూసాడు... వెన్నెల్లో తాత శిలనుంచీ బయటకు వస్తాడనీ... తాతతో మాట్లాడాలనీ, నాయనకూ తాతను చూపించాలనీ... అనుకుంటున్నాడు. ఇప్పుడు వీరేశ్ మీద యింట్లో అందరూ నిఘా పెట్టినారు. వాడు అలా కదలగానే, అక్కో, అమ్మో, నాయనో లేచి కూచుంటారు... నీకు మాత్రమే కన్పిస్తానని, తాత చెప్పిన మాట మరచిపోయి అందరికీ తాతను చూపాలని వీరేశ్ తెగ తాపత్రయపడి, నిరాశ మిగిలించుకుంటున్నాడు.

ఇక ఆ తర్వాత వూళ్ళో కన్పించినోళ్లందరికీ యీ వీరగల్లును సిద్ధేశ్వరంకు చేరిస్తే మా తాత అలుగై నిలబడి చుక్కనీళ్లు కిందికి పోనీడని చెప్తున్నాడు.

ఇవన్నీ విని ఆ వూరి వాళ్ళు, యింత చిన్న పిల్లోనికే యీ పిచ్చి పట్టుకుందే... అనుకుంటున్నారు.

"యేం నారాయణ నీ కొడుకు యింత లేడు... అబ్బుడే రాయలసీమ పిచ్చి పట్టుకుందే... పెద్ద పెద్దోళ్లే చాతగాక సళ్లుకుండారే... సిద్ధేశ్వరం కాడ అలుగు కట్టనీకె యెవురి చాతనైతాదన్నా..." అంటున్నారు.

వీరేశ్ యిప్పుడు నిస్సందేహంగా ఒకటే అనుకుంటున్నాడు... వీరగల్లును తను స్వంతంగానైనా సిద్ధేశ్వరం చేర్చాలని... తాను పెరిగి పెద్దగయ్యే కాలం కోసం ఎదురు చూస్తున్నాడు.





95500 79473

# నాక్కూడా

కాశీభట్ల వేణుగోపాల్

సౌందర్యపు సెలయేటి నీటి దప్పిక ఎప్పుడూ ఆరదూ తీరదూ... ఇప్పుడు మందు మీద మత్ప్రియురాలి దర్శనకాంక్ష తీవ్రంగా... గేట్‌ను బండితోనే తోసుకు లోపలికి, నా లోపలికి... పగిలిన సాంధ్య వర్ణాలను చప్పరిస్తూన్నప్పుడు, అప్పుడప్పుడే విడివడ్తూన్న రేరాణీ పరిమళాల్తో... ఆ మధుగంధ మిళితమై... బహుమను తే నునుతే 'తవ' తను సంగత పవన చలిత... పిండా కూడూ, నిర్వికారంగా తిరుగుతూన్న ఫ్యాను...

కింద మోజుపడి పరిపించుకున్న మార్బుల్ ఐసురింక్ మీద చక్కర్లు కొడుతున్న ఉల్లిపొట్టు బ్యాలే... నిశ్శబ్దంగా గిరగిరగాం భ్రమణం... దివాను మీద ఆరి మడతలు పడ్డానికి ఓపిగ్గా ఒకదాన్నొకటి కావలించుకొని గుట్టగా బట్టలు. లోపలెక్కడో తన పరిమళం ... ఎక్కడున్నా గుర్తిస్తా ... ధీర సమీరే యమునా తీరే ... ఎండిపోయిన తుంగభద్ర... ఒడ్డు పబ్లిక్ పాయిఖానా...

ఒకప్పటి శృంగార భావన్లు నిర్లజ్జగా పల్లేరు కాయలల్లే కరుచుకునే వున్నాయి. నలభైఏడేళ్ళుగా నా మీంచీ కర్కశంగా నడుచుకుంటూ వెళ్లిపోయిన కాలం గుర్తులు ... తెల్లబారిన గడ్డమ్మీసాలు, స్టాంపు ముద్రలు... ఏదో దేశానికి సిల్క్ ముద్రలున్నాయట.

"బండి అక్కడే పారేసి ఆటోలో ఏడ్వొచ్చుగా... ఎక్కడైనా గుద్దితే...? ఎవ్రీడే ఈజ్నాటే సండే..."

"ప్రియే... వారాంతం... నల్గురం కలిసాం మధువన్లో, కేవలం రెండే... యిదో యింకో మూడు జోబులో... క్వార్టరంతే..."

"నిజమే ఆ ఏడుపేదో ఇంట్లో ఏడ్వొచ్చుగా, చిన్నది నువ్వొచ్చే వరకూ అన్నం తిననని అట్టాగే పడుకుండిపోయింది..."

చున్నీలేని జారిన గుండెల్తో మత్ప్రియురాలు. కొండేపూడి కవిత్వం 'హృదయానికి బహువచనం' అనుకుంటా, రొమ్ముల గురించి మంచి కవిత్వం... చివరికింతేనా...

'రసవర్జురికి తెరవేస్తూ రాజీకి జీవరాహిత్యానికి తాంబూలమిస్తున్నట్టు పరచిన ఆకుల మీద వక్కల్లాగా అంతేనా... అంతేనా మత్ప్రియురాలా!

బట్టలగుట్ట మీద ఒకప్పుడు స్నిగ్ధకోమలంగా వుండిన హస్తద్వయం ఎన్నివేల కోట్ల మాట్లు... సిగరెట్ వేడితో పొగతో నల్లబారిన నా మొరటు పెదాల్తో... అయ్యో నిజం యింత నిష్ఠూరంగా వుండాలా...?!

డై చేసిన ముంగురుల మధ్య నుంచీ కారి జారిన చెమట చుక్క ఒకప్పటి పాలరాతి ముక్కలాంటి నుదుటి మీద...

"వేడిగా వుంది... నే మదుస్తాలే, నువ్వెళ్ళి స్నానం చేసిరా..." కొద్దిగా ముడతలు పడ్తూన్న చేతుల మీద చెయ్యేసి అన్నా...

"ఏం చెమట్లు కక్కుతున్నాననా... ఎన్నిసార్లు, అయ్యొయ్యో ఖండశర్కర కరిగి జారిపోతోందంటూ నాకలా?"

పువ్వులా నవ్వకే నా ఎంకీ, గువ్వలా ఎగిరిపోయిన కాలాన్ని చూసీ ...ఈ క్షణానికి నే నండూరిని మరి...

"ఛీ, నువ్వెళ్ళు ముందు. సిగరెట్లూ మందూ ఆ బార్ వాసనా ఉదయాన్నే కొట్టుకున్న స్ప్రే కల్సి కంపుకొడ్తూన్నావ్..."

పెద్దది గదిలోంచొచ్చి...

"వచ్చావా... నా బండి సంగతేం చేసావ్? ఎవరో అడిగారన్నావే... లేకపోతే ఎక్స్చేంజ్లో తీసుకుందాం వూరకనే నాన్నా వూరికే సతాయిస్తోందదీ" దాందగ్గరికెళ్ళి ఆ బూరె బుగ్గల్ని తడిమి చుపుక్కుమని శబ్దం చేస్తూ, "ఓ కే ఓకే కే..."

"రేపు నేనూ మా కల్సెళ్తాం నీకు చెప్తన్నానంతే" అల్టిమేటం ... ఓ కుసుమ కోమలి నియంత... నీలిపువ్వుల తెల్లనైటీ హాలంతా తిరుగుతూ నైటీ ఉల్లిపొట్టు పందెం ... దివాన్కిందికి దూరి నిశ్శబ్దంగా నవ్విన ఉల్లిపొట్టు వెకిలి నవ్వు...

"ఈ టేబుల్మీద కూరగాయలు తరక్కు మా... దో బండి, యింకా మందు పూర్తిగా ఎక్కలేదు కాబట్టిప్పుడే చెబ్తున్నా..." గదిలోకి మాయమైన నైటీ... తల్లీతండ్రితో ఒకే వాక్యంతో సంభాషించి... వ్యాకరణవేత్తలారా, కర్తలారా... యిదేం సెంటెన్సూ?

“వెళ్ళమన్చెప్పానా, త్వరగా రా, నేనెళ్ళాలి... లేపోతే బైట బాత్రూంలోకి దూరు, మాట్లాడాలి నీతోటి”

మళ్ళీ యిదేం సెంటెన్సూ? ఏమో! నిత్య పరిణామ కాంక్ష యీ భాషకు..

నన్ను నేను కడుక్కుని, తెల్లని పైజమా టీషర్ట్లోకి మెటం సైకోసిస్... కరెక్టేనా? ట్రాన్స్ మైగ్రేషన్ని అదే కదా అంటారూ? మళ్లీ భాష...

సీసాలో సిల్క్ ... గ్లాసులోకి... ఫ్రిజ్ సీసాలో పన్నీరు గ్లాసులోని సిల్క్ తో ... పాత సింథాల్ పరిమళం గది నిండా...

హా హా మత్ప్రియురాలు... ఎన్నియుగాలుగా?

“రేపుదయాన్నే లేచే పన్లేదని నిండా తాగేకు... కాస్సేపు నీతో మాట్లాడాలన్నానా” అన్నానా? భామని

ఏమని?

అరవిరిసిన పూలలోన

తర్వాతేమో ... మాట వరసకెపుడైనా...

సముద్రాల అన్నాడా? అరవై ఏళ్ళ క్రితం అపుడెపుడో అన్నాడా?

“వినపడిందా?” తల మీంచి జారిన నిశావసనం... నైటీ...

“టాక్టుమీ మై డాలింగ్”

“చిన్నదాన్ని లేపొస్తా... కాస్తాగు”

నాకు తోడుగా గదిలో పరిమళాన్నొదిలి తను బైటికెళ్ళింది ...

కుషన్డ్ ఈజీ చైయిర్లో అనీజీగా నేను ...

నే... ను... నేనూ? ఎవర్నీ? ఎవరీ నేను?

శుద్ధ చైతన్యధృతి, ఆలోచన కృతి... జగద్యోని...

కోహమ్

కోహమ్

సోహమ్

సోహమ్

తత్త్వమసి... ఫిలోసొఫీ... ఏడాదికి పన్నెండు లక్షలు...

మత్ప్రియురాలి ప్రియుడు... ప్రియుడేనా?

ఇద్దరందగత్తెల అస్తిత్వానికి రెండు కారణాల్లో ఓటి...

నీతో మాట్లాడాలన్నానా?

భామిని... ఏమని? మాటవరసకెపుడైనా... ఎపుడైనా సరే...

కాదన్నానా? పాతికేళ్ళుగా మాట్లాడ్తూనే వున్నాం... ఫుల్‌స్టాప్ లేని అతిదీర్ఘ వ్యాక్యం... ఇద్దరం కల్సి ఇద్దరం నాన్ స్టాప్‌గా సంభాషించుకుంటూనే వున్నాం... రెండు పాత్రలు కలసిపోయి మోనో యాక్షన్... బ్భే భలేవుందే... రెండు పాత్రలు ఒకే యాక్షన్... ఆరు పాత్రలు కల్సి రచయిత కోసం అన్వేషణ లూక్జీ నాటిక ... అప్పుడు అట్టర్ ఫ్లాఫ్ యిపుడు అతిగొప్ప ప్రయోగం... మా యిద్దరిదీ నాటకం కాదే. అవసరార్థం ఒకర్నించొకరం దాక్కుంటాం గానీ...

"పెద్దది దాన్ని లేపి అన్నం పెడ్తోంది" వసంత తిరోగమనం...

"అవునూ, మందుకేమీ తెచ్చుకోలేదా ... వట్టి చన్నీళ్లతో తాగుతున్నావ్?" మళ్ళీ అంది...

"నిన్నడుగుదామనుకునేంతలో వెళిపోయావ్"

అక్యూజింగ్ గా అన్నా...

"నారాయణా మిక్చ్సరుంది తేనా? అయినా నేన్నీతో మాట్లాడాలన్నా కదా... అసలు పిల్లల గురించి నువ్వేమనుకుంటున్నావ్... మిక్స్చర్ తెస్తా ఆగు..." మళ్లీ మాయమయింది మత్ప్రియురాలు...

మిక్స్చర్తో వున్న స్టీల్ బౌల్ పక్కన పెట్టి "చెప్పు" అంది.

"హ్హా హ్హా హ్హో వాళ్ళు నా... సారీ మన పిల్లలు... అంతే" అన్నా. "నీకూ నాకూ పిల్లలే సామి... పెద్దదానికి ఇరవై ఓటి... ఎట్లా ఎదుగుతోందో చూసావా? శరీరం కాదు వాళ్ళ చెవుల మజ్జ గుజ్జు కూడా చాలా బాగా వృద్ధి చెందింది... అది... అదీ గమనించావా... దానికి సొంతలోకం తయారయ్యింది... అది మన కూతురే కాదనేందుకు ఈ ప్రపంచానికే మీ హక్కు లేదు... కానీ అదో పూర్తి ఆడదైంది. షి యీజ కంప్లీట్ ఉమన్ బై హర్సెల్ఫ్... డిడ్యూ నోటీస్దాట్? అదీ చెప్పు" తలగడ వొళ్లోకి లాక్కొని పరుప్మీద వికసించిన పద్మంలా...

"వాడ్డూయూ వాంట్మీ టుడూ, సీ... అయ్ లవ్ హర్ యాజయ్ వాజ్లవింగ్గర్ బిఫోర్షివాజ్ బార్న్... ఇప్పు... ఇప్పుడెందుకడిగావ్..." ఇంకా మాట్లాడబోతున్నా...

"మా" పెద్దగా అరిచినట్టుగా పిలిచింది మా సంభాషణ కారణం... గభాల్న లేచి బైటికి వెళ్లింది తను, దాదాపుగా పరిగెత్తినట్టు. బైట హాల్లో ఏవో హడావుడి సంభాషణలు... సగం తెర్చిన తలుపుల్లోంచీ నా భార్య పృష్ఠభాగం కనబడ్తోంది... అప్రయత్నంగా ఎరోటిక్ ఫీలింగ్... భాస్వరత్స్రోణి శోభాజిత స్వర్ణభూభృత్తలే ఘన నితంబ... గగనజఘన

తుఫానులా మళ్ళీ లోపలికి తన్నుకొచ్చింది ...

"లే... త్వరగా వెంకోబరావు యింట్లోకి ... అతనేదో చేసుకున్నట్టున్నాడు... క్విక్... ఫాస్ట్" ఇప్పుడే కదా నాతోపాటు యింటికొచ్చాడు వెంకోబా... అంతలో ఏమై వుంటుందీ... అరగంటలోపే... దాదాపు పరిగెత్తా వెంకోబా యింటికి... నా వెనకే తనూ... తన వెంట పెద్దదీ. వెంకోబరావ్ మంచమ్మీద పడుకునున్నాడు... వాడి భార్య మీనాక్షి ఏడుస్తోంది గట్టిగానే...

వెంకోబుడి కూతురు కన్నీళ్లు కారుస్తూ "నానా! నానా! ప్లీజ్ లే నానా, నువ్ చెప్పినట్టు వింటా ప్లీజ్ నానా... మాయా ప్లీజ్, నాన చాలా పిల్స్ మింగేసాడు యిప్పుడే ... ఎన్నో తెలీదు"

పెద్దది వన్నాటెయిట్కి ఫోన్జేసేసింది ... హాస్పటల్ చాల్దగ్గిర ...

వెంకోబుడ్ని లేపడానికి ప్రయత్నం చేసా, ముఖాన నీళ్లు కొట్టా. కొద్దిగా కదుల్తున్నాడుగానీ... మగత కమ్మేసింది... అంబులెన్స్ వచ్చేసింది.

"అమ్మాయిని చూసుకో" అని వెంకోబరావ్ కూతుర్ని తనకప్పజెప్పి, మీనాక్షితో కల్సి యాంబులెన్సెక్కి పోతూండగా, పెద్దది నా వ్యాలెట్ తెచ్చిచ్చింది...

ఎంత ప్రెజెన్సాఫ్ మైండ్ దీనికి! ఓ క్షణం ఆశ్చర్యపడి, తలాడించి మీనాక్షి పక్కన కూచున్నా... యాంబులెన్స్ లోంచే డాక్టర్కి ఫోన్చేసి విషయం చెప్పేసా... నర్సింగ్హోమ్ దగ్గరే వుంటాడు... తను బాగా తెలిసిన వాడే ...

వెంకోబరావ్ పరిస్థితి దాదాపు అర్థమయిపోయింది... తండ్రీ కూతురూ గొడవ పడ్డారు. ఏ విషయమో వూహించడం కష్టం కాదు. ఆ అమ్మాయికి ఇరవై నాలుగు, ఇరవై ఐదేళ్ళుంటాయి.. బెంగుళూర్లో పన్జేస్తుంది. ఓ ఎమ్మెన్సీలో చాలా మంచి జీతం...

పక్కనున్న మీనాక్షి వైపు చూసా..

భర్త మీద ఓ చెయ్యేసి నిశ్శబ్దంగా రోదిస్తోంది. సౌందర్యాన్ని ఏరి పట్టుకోవడం నీకో వ్యసనంగా పరిణమించిందన్న మత్ప్రియురాలి మాట గుర్తొచ్చింది. దాదాపు చావు బతుకుల్లో వున్న వెంకోబరావు భార్యలో ఘనీభవించిన సౌందర్యం ముగ్ధ విషాదంగా గోచరిస్తోంది నాకు. బుద్ధికి సమయాసమయాలుంటాయా? నా బుద్ధికి మాత్రం లేవుగాక లేవు...

దాదాపు మృత్యుకౌగిల్లో వెంకోబరావు ... మృత్యువును తాకుతూ మీనాక్షి సౌందర్యం... ఇదేం బుద్ధి? ఇదేం ఆలోచన?

వెంకోబను క్యాజువాల్టీకి తీసుకెళ్ళగానే అప్పటికే వచ్చేసిన డాక్టరు ఇమ్మీడియేట్గా స్టమక్ వాష్కు ఆర్డర్ వేసాడు... డాక్టర్ గారి పక్కన్చూచుని "సర్"? అని నేనే ఓ పెద్ద ప్రశ్నార్థకంగా ముడుచుకున్నా...

"చాల్త్వరగా తెచ్చారు... హిమస్ట్ కమవుట్... విల్బీ ..." డాక్టర్ వెంకోబరావు దగ్గరికెళ్లిపోతూ

"ఇప్పుడే కేషీట్ రాయకండి..." అని నర్సుకు చెప్పాడు.

నెన్చెప్పాలనుకున్నదదే... లేనిపోని పెంట... డాక్టరీజ నైస్ రీజనబుల్ మ్యాన్' అనుకున్నా... రూల్స్ కు వ్యతిరేకంగా వెళ్ళడంలో సోషల్ జస్టిస్. ఓ గంట తర్వాత డాక్టర్,

"అతనికి టాబ్లెట్స్ ఎక్కువ దొరికినట్టు లేదు లెండి. దట్టూ హీ సీమ్స్ టు హ్యావ్ త్రెటెన్డ్ హిజ్ ఫామిలీ... లుకిన్టు ఇట్... కానీ, ట్వన్టీఫోరవర్స్ అబ్జర్వేషన్లో వుంచాలి..." అన్నాడు.

వెంకోబుణ్ణి గదికి షిఫ్ట్ చేసారు.

"ఐసీయూ అవసరం లేదు లెండి. అయినా వి విల్నాట్ మేకిట్ పబ్లిక్... అర్థమయిందిగా..." డ్యూటీ డాక్టర్‌కు అన్నీ చెప్పి డాక్టర్ వెళ్ళిపోయాడు. గది నిశ్శబ్దంలో నేనూ... డీలా పడిన సౌందర్యం మిగిలాం... దీర్ఘంగా శ్వాసిస్తున్న వెంకోబుడితో ...

వాడు ఎవర్ని బెదిరించాలనుకున్నాడో అర్థం కావడానికి నేనో ఐన్‌స్టీన్ కానక్కర్లేదు... కూతురు. 'షీ ఈజ కంప్లీట్ ఉమన్ బై హర్సెల్ఫ్, డిడ్యూ నోటీస్ దాట్?' నా సగం జీవితమడిగిన ప్రశ్న గుర్తొచ్చింది. వీడు తన కూతురు మీద వున్న హక్కును దొహరాయించడానికి వ్యర్థ ప్రయత్నం చేసాడు...

అదో పరిపూర్ణ స్త్రీ. దాని జీవితం పట్ల దానికున్న హక్కును అది ప్రకటించి వుంటుంది, వీడిట్లా సమాధానం చెప్పాడు. వీడు చక్రం తిప్పుతూంటే చెరుగ్గడల్లా నలుగుతున్నది మాత్రం వేరెవ్వరో...

జీవితం దానంతట వుంటుంది. కానీ జీవితం... నా జీవితంలోని వ్యక్తుల జీవితం ఇట్లాగే వుండాలి అని అనుకున్నాడు వెంకోబుడు... జీవితానికి పర్యాయాలూ, ఎన్నికలూ, వీడు కోరిన స్వాతంత్ర్యం, వీడు కోరిన విలువలూ, హక్కులూ... మట్టిగడ్డా వీడు నిర్ణయించేసుకున్నాడు. వీడి కూతురు దాని ప్రకారం అది నిర్ణయం ప్రకటించింది. పర్యవసానం, వైరుధ్యం... రగడ... చిన్న రచ్చ...

నా గదిలో కుషన్డ్ ఈజీ చైయిర్లో నా అస్తిత్వం... ఇరవైమూడ్లో ఏసీ... మెదుడు రకరకాల ఆలోచన్లు విడదీయడానికి ప్రయత్నం చేస్తోంది...

"నానా " మెత్తగా పువ్విడిగినట్టు పక్కన కూచున్న, ముడుచుకున్న వసంతం... కళ్లు తెరిచి చూసి... దాని తల మీద చెయ్యేసి "చెప్పరా" అన్నా.

"ఆర్యూ ఆల్ రైట్?" ఇంకా దగ్గరికి జరుగుతూ అడిగింది.

"యా బెస్ట్" అన్నా.

"బండీ ...?" నసిగింది.

గట్టిగా నవ్వా, కళ్ళలో నీళ్లు తిరిగాయి. కారణాలు రెండు.."

"నీ ప్రయాణం నీ ఇష్టంరా" వంగి దాని తల మీద ముద్దు పెట్టుకొని అన్నా.





98498 02521

# నేను - నా దేశము

జి. ఉమామహేశ్వర్

మధ్యాహ్నం మూడవుతోంది. అర్జెంటుగా బాస్, కాన్ఫరెన్స్ రూమ్‌కి రమ్మంటే బయలుదేరాను. ఇంకో రెండు గంటల్లో పని పూర్తి చేసుకుని బయటపడాలి. ఆ ఆలోచన రాగానే అప్రయత్నంగా మొబైల్ తీసి, రాజశేఖర్ పంపిన మెసేజ్ మళ్ళీ ఇంకోసారి చదివాను. “మన వాసు పదేళ్ళ తరువాత హైదరాబాద్ వస్తున్నాడు, మనమంతా రేపు సాయంత్రం యాత్రినివాస్ హోటల్లో కలుద్దాం, తప్పకుండా రండి. ఎంజాయ్ చేద్దాం.” నిన్న ప్రారంభించిన ఈ సందేశాలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి. విదేశాల నుండి మా మిత్రుల్లో ఎవరు ఇండియాకు వస్తున్నా రాజశేఖర్‌కు ఒక మెయిల్ పెడితే చాలు, అందర్నీ కలిపే బాధ్యత నెత్తినేస్కుని తతంగమంతా నడిపిస్తాడు.

ఇలాంటి సమావేశాలు దాదాపు ప్రతి రెండు మూడు నెలలకొకసారైనా జరుగుతూనే వుంటాయి. విక్రమ్, శ్రీధర్, ఆనంద్, వెంకట్రావ్ ఇలా మిత్రులంతా కలవడం, మరోమారు ఇరవై యేళ్ళ వెనక్కి వెళ్ళి కాలేజీ జ్ఞాపకాలు తడుముకుని ఆనందించడం పరిపాటి. ఈసారి ఆ అవకాశం వాసు వల్ల కలుగుతోంది. వాసు నాకు హైస్కూల్ నుండి పరిచయం. ఎనిమిదో తరగతి వరకూ ఇద్దరం కలిసే చదివాము. ఆ తరువాత వాళ్ల నాన్నగారికి ఉద్యోగరీత్యా బదిలీ అవడంతో విడిపోయాము. మళ్లీ నాలుగేళ్ళ తరువాత ఇంజనీరింగ్‌లో కలుసుకున్నాము. వాసు వాళ్ల అన్న ఆర్ఎస్ఎస్ వాలంటీర్‌గా

ఉండేవాడు. వాళ్ళ ఇంటి నిండా వివేకానంద, శివాజీ, హెడ్గేవార్, భారతమాతల క్యాలెండర్లు, ఫోటోలు దర్శనమిచ్చేవి. ఆ ప్రభావం వాసు మీద పుష్కలంగా వుండేది. తను గూడా వారాంతాల్లో ఖాకీ నిక్కర్, తెల్లచొక్కా, టోపీ, చేతిలో కర్రతో శిక్షణకు బయలుదేరేవాడు.

ఎనిమిదో తరగతిలో స్వాతంత్ర్య దినోత్సవానికి మా తరగతి పిల్లలతో 'వీర శివాజీ' నాటకం వేయించాడు. తను శివాజీ వేషం వేసి ఔరంగజేబ్ ముందు నిలబడి దేశమాత గురించి చెప్పిన సంభాషణలు మొత్తం నాటకానికే తలమానికంగా నిలిచి పెద్దవాళ్ళ ప్రశంసలు అందుకున్నాయి. ఇదంతా ఒక ఎత్తయితే, శివాజీ తినుబండారాల బుట్టలో దాక్కుని పారిపోయే సన్నివేశం ఒక ఎత్తు. వాసు నిండుగా, గుండుగా, బొద్దుగా వుండేవాడు. రిహార్సల్స్‌లో మాకు అంత పెద్ద బుట్ట దొరకలేదు. నేరుగా నాటకం రోజున బుట్ట ఎత్తుతుంటే భుజాలు వాచిపోయే బరువున్నాడు. వాణ్ని మోయలేక చచ్చాం. ఆ తరువాత సరదాగా నవ్వుకుంటూ ఆ విషయం ప్రస్తావిస్తే, "నేనైతే లోపల దాక్కొని మీరెక్కడ మోయలేక కింద పడేస్తారేమోనని భయపడి చచ్చాను" అని తానూ నవ్వేశాడు. ఈ సంఘటన చాలాసార్లు గుర్తు చేసుకుని నవ్వుకున్నాం.

ఆలోచనల్లోనే సమావేశ మందిరానికి చేరుకున్నాము.

"రా, కూర్చో" అంటూ మా బాసు తన పక్కనే కుర్చీ చూపించాడు. మహమ్మదాలీగారు ఫోన్‌లో మాట్లాడుతన్నందువల్ల ఎవరూ నోరు విప్పకుండా ఆయన సంభాషణకు ప్రచ్ఛన్న శ్రోతలౌతున్నారు. చుట్టూ చూశాను. మా బాస్‌తో పాటు మా డైరెక్టర్‌గారు, మిగతా ల్యాబుల డైరెక్టర్లు, సెంటర్ హెడ్‌గారు కూడా వున్నారు. మహమ్మదాలీగారు ఇంతకుముందు సెంటర్ హెడ్‌గా చేసి, అటు తరువాత సైంటిఫిక్ అడ్వైజర్‌గా చేసి ప్రస్తుతం మా రక్షణ పరిశోధనాలయానికే కాక దాదాపు దేశంలోని అన్ని రక్షణ శాఖ సంస్థలకు గౌరవ సలహాదారుగా వున్నారు.

ఐదు నిముషాల తరువాత, ఆయన అందరి వైపు చూస్తూ, "మిత్రులారా, మనకొక చిన్న సమస్య వచ్చి పడింది. సమస్య చిన్నదే కానీ, అది చుట్టుకున్న తీరే కొంచెం ఇబ్బంది పెడుతోంది. విషయమేమిటంటే, పోయిన సంవత్సరం సంస్థ కోసం మనమొక చిన్న పరికరాన్ని కొనుగోలు చేశాము. దాని విలువ చాలా తక్కువే. మహా అయితే నలభై లక్షలుంటుంది. కానీ ఆ యంత్రాన్ని మనలాంటి రక్షణ పరిశోధనాలయాలకు సరఫరా చేయగూడదని ఆ కంపెనీ మీద, వాళ్ళ ప్రభుత్వం ఆంక్షలు విధించింది. మనకు ఈ పరికరాన్ని అమ్మిన సంస్థ ఆ విషయాన్ని వక్రీకరించి మనకు అంటగట్టేసింది. ఇప్పుడు ఆ ఉత్పత్తిదారుడికి ఈ విషయం ఎలా తెలిసిందో తెలిసిపోయింది. మనం నియమనిబంధనలను వుల్లంఘించామని మన పైన అభియోగం మోపుతూ పోయిన నెలలో రక్షణశాఖకు పెద్ద వుత్తరం వ్రాశాడు." అందరివైపూ ఒకసారి పరికించి చూసి మళ్లీ "మనతో గానీ, మిగతా రక్షణసంస్థలతో గానీ ఈ విషయాన్ని ధృవీకరించుకోకుండా మన పెద్దవాళ్ళు అలాంటివేమీ జరగలేదంటూ బదులు వ్రాసేశారు. తరువాతైనా కనీసం అందరితో

ఈ విషయాన్ని చర్చించారా అంటే అదీ లేదు. ఇప్పుడు ఉన్నఫళంగా ఫోన్ చేసి రేపు ఆ ఉత్పత్తిదారు కంపెనీ తన అధికారిని దర్యాప్తు నిమిత్తం పంపుతోంది. వాళ్లకు సహకరించండి అని సూచనలిస్తున్నారు. దానికి తోడు వాడు చెప్పినట్టు ఆడుతూ మన సెక్యూరిటీని అప్రమత్తంగా ఉండమని సిఐఎస్ఎఫ్ వాళ్లతో ఫోను చేయించారు."

ఒక్క నిముషం వెనక్కి వాలి తల అడ్డంగా ఊపుతూ తిరిగి నిటారుగా కూర్చుని,

"మనం తెలిసి తప్పు చేయలేదు. కానీ తప్పు జరిగిపోయింది. కానీ మనవాళ్లేమో తప్పే జరగలేదని నిర్ధారించారు. మన తప్పు బయటపడగూడదు. మన పెద్దవాళ్ళ మాట తప్పవగూడదు. అదీ మన సమస్య..."

డైరెక్టరుగారు కల్పించుకుని, "ఆ పరికరం కొనడం మనం చేసిన తప్పయితే, విషయం తెలుసుకోకుండా కొనలేదని బుకాయించడం మన పెద్దవాళ్ళ తప్పు. రేపటి దర్యాప్తులో మనం ఈ విపత్తు నుండి బయటపడాలి. లేకపోతే, మన పరువు మన దేశంలో, మన దేశం పరువు ప్రపంచవ్యాప్తంగా కొట్టుకుపోతాయి. మనం ఈ పరిస్థితి నుండి ఎలా బయటపడగలమో ఆలోచించడానికే మిమ్మల్ని పిలిపించింది" అని ముగించాడు. అందరూ మౌనంగా ఆలోచిస్తున్నారు. అసలా పరికరం ఏమిటో, ఎవరు కొన్నారో, ఎందుకు కొన్నారో అని ఆలోచిస్తుండగానే, మా బాస్ నా చెవి దగ్గరకొచ్చి "ఈ సబ్జెక్టు మనదే, ఆ పరికరం మనం కొన్న ఆరెస్ 750" అన్నాడు.

నాకు ఆశ్చర్యమనిపించింది. ఆరెస్ 750 ఒక ప్రత్యేకమైన కంప్యూటర్ లాంటిది. అదేమీ రహస్యంగా కొనాల్సిన వస్తువేమీ కాదు. దానిపైన ఆంక్షలెందుకు? నా అమాయకత్వం కొద్దీ ఈ ప్రశ్నను బయటకే అన్నాను.

అందరికీ అది వినిపించిందో లేదో తెలియదుగానీ, మహమ్మదాలీగారికి వినిపించింది. ఆయన నా వైపు సరదాగా చూస్తూ.

"ఎందుకంటే నువ్వు కొంటున్నది నీ పరిశోధనాలయానికి కాబట్టి. నీది రక్షణ పరిశోధనా సంస్థ కాబట్టి. అదే నీ యింటి కోసం కొంటానంటే ఇందులో ముప్పావు ధరకే నీకు అమ్మగలరు. వాళ్ళ భయమేమిటంటే, వాళ్ళ పరికరాలు ఉపయోగించి ఏ క్షిపణులో తయారు చేశావనుకో అది ప్రపంచశాంతికి విఘాతం కదా, అందుకే అమ్మరు. కానీ అవే పరికరాలు ఉపయోగించి వాళ్లు తయారుచేసిన క్షిపణులు కావాలంటే మాత్రం ఎన్నడిగినా సరఫరా చేస్తారు" వివరిస్తున్నట్టు చెప్పినా అందులో వ్యంగ్యం ఎవరికీ అర్థం కాకుండా పోలేదు.

"కలాంగారు పని చేసిన రోజుల్లో ఒకసారి ఇలాగే మనదేశం నుండి దిగుమతి చేసుకున్న మైకాతో చేసిన ఒక విడిభాగాన్ని మనకు అమ్మడానికి నిరాకరించారు. ఎన్ని విజ్ఞప్తులు చేసినా సడలలేదు. అంతమాత్రానికే మన పరిశోధనలు ఆగవు కదా! రెండు నెలల్లో రివర్స్ ఇంజనీరింగ్

చేసి దాన్ని మనమే తయారు చేయగలిగాము. కాకపోతే, ఇలాంటి చికాకుల వల్ల మనం పెట్టుకున్న లక్ష్యాలను సకాలంలో పూర్తి చేయలేక పోతాం" సతీష్ గారు చెప్పారు. ఆయన ఇంకో ప్రాజెక్టు డైరెక్టర్.

మహమ్మదాలీ గారు కుర్చీలోంచి ముందుకు వంగి అరచేతులు రుద్దుకుంటూ చెప్పారు. "ప్రసాద్... మీరు మీ టీంతో ఆలోచించండి. నాకు మీ మీద పూర్తి నమ్మకం వుంది. మీకు రేపటిలోగా ఎటువంటి సహాయం కావలసి వచ్చినా నన్నుగానీ, డైరెక్టర్‌గారినిగానీ కలవడానికి, కాల్ చేయడానికి సందేహించకండి. ఓకే డన్" అంటూ బొటనవేలు పైకెత్తి చూపిస్తూ చిరునవ్వు నవ్వారు. మా సబ్జెక్ట్ అయిపోయింది. వాళ్ళు అజెండాలోని వేరే విషయాన్ని గురించి చర్చించడం మొదలు పెట్టారు. మేం బయటికి నడిచాము.

ఆ పరికరం కొన్నది మా విభాగమే కాబట్టి, ఈ సమస్య నుండి బయటపడే మార్గం ఆలోచించే బాధ్యత కూడా మా మీదే వుంది. రెండు నిముషాల్లో మా ల్యాబ్‌కు చేరుకున్నాక మా బాస్ టీంనంతా పిలచి అందరికీ మా ముందున్న సమస్యను, దాని తీవ్రతను, మాకున్న తక్కువ సమయాన్ని, సమిష్టి కృషి అవసరాన్ని గూర్చి వివరంగా చెప్పాడు.

అందరూ ముందుగా ఇంత చిన్న విషయానికి ఆ కంపెనీ ఎందుకు ఇంత 'అతి' చేస్తుందో అని ముక్తకంఠంతో తమ నిరసనలను తెలిపి, తరువాత వాళ్ళ వాళ్ళ ఆలోచనలను బయట పెట్టసాగారు. "ఆ సిస్టమ్‌ని ఉన్నఫళంగా డిస్కనెక్ట్ చేసి బయటకు పంపించేస్తే?"

"సిఐఎస్ఎఫ్ సెక్యూరిటీ ప్రతి వాహనాన్ని చెక్ చేస్తారు. ప్రతి ఎంట్రీని ఎగ్జిట్‌ని రికార్డ్ చేస్తారు. రేపు వాళ్ళు రికార్డ్స్ పరిశీలిస్తే అడ్డంగా దొరికిపోతాం."

"మనకు ఈ సిస్టమ్‌ని అమ్మిన వాళ్ళ మీద కేసెయ్యాలి."

"ఆ పని మళ్ళీ చేయొచ్చు. ప్రస్తుతం దాని వల్ల ఉపయోగమేమీ లేదు కదా"

"డిస్కనెక్ట్ చేసేసి, మన స్టోర్‌లో దాచేస్తే?"

"స్టోర్‌లో దాచేయడం బాగానే వుంటుంది. కానీ డిస్కనెక్ట్ చేస్తే మొత్తం మన నెట్వర్క్ అంతా పని చేయడం మానేస్తుంది. మనకిప్పటికిప్పుడు దానికి సమానమైన ఇంకో సిస్టమ్ దొరకడం కష్టం. అంతే కాదు ఈ రోజు వరకూ పని చేసిన నెట్వర్క్ ఇవాల్టి నుండే పని చేయడం లేదంటే వాళ్ళ అనుమానం మరింత బలపడుతుంది. దానికితోడు, మన ఎంప్లాయిస్ అందరికీ నెట్వర్క్ లేకపోవడం అసౌకర్యం కదా!"

"ఇంకా నయం. మన డిఫెన్స్ ల్యాబ్ అన్నింటిలో ఇంటర్నెట్, ఇంట్రానెట్ విడిగా వుంటాయి గాబట్టి సరిపోయింది. లేకపోతే, ఆ కంపెనీ ఈ పాటికి, సిస్టమ్ యొక్క మ్యాక్ అడ్రస్‌తో అవలీలగా ట్రాక్ చేసి ఉండేది."

"మన పక్క ల్యాబ్ సిస్టమ్‌తో మార్చేస్తే? ఓహ్, మళ్ళీ ఈ సెక్యూరిటీ సమస్య ఒకటుంది కదా!" ఉన్నట్టుండి అమృతరావ్ గట్టిగా అరచినట్టు చెప్పాడు.

"సార్, రెండేళ్ళ క్రితం మనం రెండు సిస్టమ్స్ కొన్నాం. చాలా వాటికి ఉపయోగపడుతుందని లోకల్ వాటినే ఎంచుకున్నాం. అవి స్టోర్స్‌లోనే స్పేర్‌గా పడివున్నాయి. వాటిలో ఒకదానితో రీప్లేస్ చేస్తే, నెట్వర్క్ నడుస్తుంది, సమస్య పరిష్కారమవుతుంది."

"గుడ్, గుడ్ ఐడియా, కానీ మనం ఈ మార్పులు చేసిన విషయం ఎన్మెమ్మెస్‌లో వుంటుంది. వాళ్ళు రిపోర్ట్ ఇమ్మంటే అక్కడ దొరికిపోతామ్" బాస్ అన్నారు. " ఎన్మెమ్మెస్ లేదని చెబుదాము సార్. దానికి సంబంధించిన సర్వర్లు, అన్నీ పక్కన పెట్టేద్దాం".

"ఓకే, సత్యం ... మీరు మొత్తం ప్లాన్ తయారుచేయండి. అమృతరావు, శంకర్ మొత్తం సిస్టమ్‌ని రీప్లేస్ చేసి దీన్ని స్టోర్స్‌లో పడేసెయ్యండి. రేపటికల్లా ఎలాంటి ఆధారం లేకుండా చేయాలి. ఇది ఆషామాషీ వ్యవహారం కాదు. నేషనల్ ప్రెస్టేజ్. మీకు తెలుసు గదా" అని నా వైపు చూస్తూ జాగ్రత్తలు చెప్పి బాస్ వెళ్లిపోయాడు.

ఎవరి పనులలో వాళ్ళు బిజీ అయిపోయాము. అమృతరావు వాళ్ల పని ఆఫీసులో అందరూ వెళ్ళిపోయిన తరువాత గానీ ప్రారంభం కాదు. నేను నా పనిలో పడ్డాను.

అర్ధగంటలో నా పని పూర్తయింది. ఏమైనా సమస్యలొస్తే తప్పకుండా పిలవమని, ఏ సమయంలోనైనా రావడానికి వెనుకాడనని భరోసా ఇచ్చి, కారు తీసుకుని రోడ్డెక్కే పాటికి ఏడయింది.

నేను బేగంపేట చేరేపాటికి ఎంత లేదన్నా ఎనిమిదవుతుంది. ఎఫ్ఎం ఆన్ చేశాను.

"నా జన్మభూమి ఎంత అందమైన దేశము, నా ఇల్లు అందులోన కమ్మనీ ప్రదేశము... నా సామిరంగా... హై హై నా సామిరంగా..." అరె, ఎంత యాదృచ్ఛికం!

ఈ పాట కాలేజీరోజుల్లో వాసు పాడే పాటల్లో ఒకటి. వాడు అన్ని పోటీల్లో పాల్గొనేవాడు. వాడికి పాటలు పెద్దగా నప్పవు. ఎప్పుడూ బహుమతులొచ్చిన దాఖలాలూ లేవు. అయినా వాడి పాలసీ ఒకటే – ఇలాంటి అవకాశాలను దేశభక్తి గేయాల ప్రచారానికి వాడుకోవచ్చని చెప్పేవాడు. పాడవోయి భారతీయుడా లాంటి ఘంటసాల పాటలు, మనోజ్‌కుమార్ హిందీ పాటలు, మన్నాడే మధుర గీతాలు వాడికి పిలిస్తే పలుకుతూ గొంతులోనే కొలువుండేవి.

వాసు వాళ్ళ అన్న మాకు మూడేళ్ళ సీనియర్. అతని దేశభక్తి గురించి ఒక కథ ప్రచారంలో వుండేది. ఆగష్టు 16, జనవరి 27 తేదీలలో, మెస్సులో, వాళ్ళ అన్న కూర్చున్న టేబుల్‌లో, అతని పక్కన ఎవరినీ కూర్చోవద్దని చెప్పేవారు కొందరు సీనియర్లు. వాళ్ళు చెప్పే మాటలు చాలా వ్యంగ్యంగా వుండేవి. "నువ్వు కూర్చున్నావనుకో, వాడడుగుతాడు – నిన్న కాలేజ్‌కి వచ్చావా? అని. తొంభై శాతం మందిమి మనం ఏ సెకండ్ షో చూసో, రూముల్లో కూర్చుని సొల్లు వేసుకునో, ఎప్పుడో రెండుకో మూడుకో పడుకునుంటాం. పొద్దునే లేచి 8 గంటలకి కాలేజీలో జెండా వందనానికి వచ్చే మొహాలేనా మనవి? మనం 'లేదు' అంటాం. అంతే !

నువ్వు దొరికిపోయావే వాడికి. దేశభక్తి పేరు చెప్పి నిన్ను కరకరా నమిలి మింగేస్తాడు. శ్రీశ్రీ చెప్పిన పుట్టు వృద్ధుడు నువ్వే అంటాడు. భారతమాత నిన్ను కన్నందుకు సిగ్గుతో తల వంచుకుంటుంది అంటాడు. నీలాంటి యువకుల రక్తం వృధా పోవడం వివేకానందుడు సహించడు అని నీ మీద నీకే విరక్తి కలిగేలా క్లాస్ పీకుతాడు. నువ్వు పొరపాట్న నోట్లో ముద్ద పెట్టావనుకో, నీకు అన్నం ఎలా తినాలనిపిస్తుంది అని వాడు ఎదురుప్రశ్న వేస్తాడు? దాంతో నువ్వు తినడమా, మానడమా అర్థంగాక గిలగిలలాడి ఆకలితో నకనకలాడతావ్".

ఈ సంఘటన ఎప్పుడు తలచుకున్నా నవ్వాగదు.

కారు వాలెట్ పార్కింగ్‌కిచ్చి రెస్టారెంట్‌లోకెళ్ళాను.

హాయ్‌లు, హలోలు ముగిశాయి.

వాసు బాగా మారిపోయాడు. చిన్నప్పుడే బొద్దుగా వుండేవాడు. ఇప్పుడింకా ఊబకాయం వచ్చింది. జుట్టు చాలాభాగం రాలినట్టు తెలుస్తోంది. వాడి చొక్కా జేబు మీద ఒక సిగ్నేచర్‌లా కనబడే భారత జాతీయ పతాకపు ఎంబ్లమ్ ఇప్పుడు కనబడడం లేదు. వేషభాషలు ఎలాగూ మారాయి.

కాలేజీలో స్నేహితుడైన వాసులాగే ఇప్పటి వాసు ఉండాలని నేను కోరుకోలేదు గానీ, ఎందుకో చూడగానే కొంత పరాయి వాసన కొడుతున్నాడు. నా రాకకు ముందు మాట్లాడుతున్న విషయం కాబోలు, మళ్ళీ కొనసాగించాడు వాసు.

"నేనెలాగూ ఇండియా రాక మూడేళ్ళవుతోంది. ప్లాన్ చేసుకునే టైమ్‌కు ఈ ఆడిట్ పని ఒకటి ఇండియాలో వుందని తెలిసింది. స్వామి కార్యం, స్వకార్యం రెండూ అవుతాయి కదాని బయలుదేరాను".

"నువ్వు టెక్నికల్ సైడ్ కదా, నీకు ఆడిట్ ఏంటి" అమాయకంగా ప్రశ్నించాడు శివ.

ఇక్కడ ఆడిట్ అంటే వెరిఫికేషన్ అన్నమాట. ఇందాక చెప్పాను కదా, ఒక డిఫెన్స్‌లాబ్ వాళ్ళు మా ఎక్విప్‌మెంట్ కొనగూడదని తెలిసినా కొన్నారని. దాన్ని నిర్ధారించడమే నా పని".

"డిఫెన్స్ వాళ్ళా?" ఆశ్చర్యంగా అడిగాను నేను ఏదో సంశయం మనసులో తొలుస్తుంటే.

"అవున్రోయ్, సత్యంగాడు డిఫెన్సే గదా, వాడినడుగు" రాజశేఖర్ అన్నాడు.

"డిఫెన్స్‌లో చాలా ల్యాబ్స్ ఉన్నాయి. ఇంతకీ వీడు వెళ్ళాల్సింది ఏ ల్యాబ్‌కో?" అన్నాను నేను అనుమానాస్పదంగా... వాసు తను వెళ్ళాల్సిన ల్యాబ్ పేరు చెప్పాడు.

పక్కలో బాంబ్ పడినట్టయింది నాకు. నా అనుమానం నిజమైంది. అది మా ల్యాబే. అంటే... మేం రేపు ఎదుర్కోబోయే శత్రువులాంటి వ్యక్తి వాసుగాడా? నమ్మబుద్ధి కాలేదు. పైగా మాకొచ్చిన పేర్లలో వాసు పేరు లేదు కదా!

"ఏంట్రా ? అంత షాక్ తిన్నావ్? నీ ల్యాబ్ కంచన్‌బాగ్ కదా?" రాజశేఖర్ అడిగాడు. నాకు కంచన్‌బాగ్ నుండి చాంద్రాయణగుట్ట బదిలీ అయిన విషయం తెలీక రాజశేఖర్ అడిగిన ప్రశ్నకు నేను కొంచెం తికమకలో, కొంచెం సమయస్ఫూర్తితో...

"అవును, కాదు, అవును" అంటూ బదులిచ్చి, ఇప్పుడే వస్తానని పక్కకెళ్లి అమృతరావుకు ఫోన్ చేశాను. ఫోన్ తీయట్లేదు. నాకు శరీరమంతా తిమ్మిర్లు కమ్ముతున్నాయి. జపాన్‌లో జరిగే భూకంపాలు తలచుకోగానే నా కాళ్ళ కింద భూమి కదలినట్టు, చెన్నైలోని సునామీని గుర్తు చేసుకోగానే అది నన్ను ముంచేసినట్టు, ఏమీ తెలియని అయోమయంలో కూరుకుపోతున్నాను. నా ఫోన్ రింగయింది. ఆఫీస్ నుండి అమృతరావ్. "అమృత్, రేపు ఆడిట్‌కి వస్తున్న వాళ్ల పేర్లు చెప్పు."

"ఇద్దరున్నారు సర్, ఒకటి హెన్రీస్మిత్, రెండో పేరు – ఎస్‌వి కల్లం."

థ్యాంక్స్ అని ఫోన్ పెట్టేశాను. ఎస్‌వి కల్లం... కల్లం శ్రీనివాస్ అంటే, మా వాసుగాడేనని అర్థం కావడానికి అట్టే సమయం పట్టలేదు. ఏ అమెరికా వాడినో, జర్మన్నో ఊహించుకుంటున్న నాకు, నా తోటి సైంటిస్టు మిత్రులందరికి ఈ సంఘటన గొప్ప షాక్ అవబోతోంది. నేను ఈ పాత్రలో వాసును అస్సలు ఊహించుకోలేక పోతున్నా. వాసు ఏంటి, వాడి దేశభక్తి ఏంటి? వాసుగాడు అలాంటి పని చెయ్యడు. నామ్ కె వాస్తే ఇన్స్పెక్షన్ చేసి, ఇక్కడ అలాంటిదేమీ లేదని రిపోర్ట్ ఇచ్చేస్తాడేమో? హెన్రీస్మిత్‌ను కౌంటర్ చేయడానికే మావాడు వచ్చిండొచ్చు. ఈ ఆలోచన రాగానే నా మనసు తేలిక పడింది. అభినవ శివాజీ జీతేరహో! అని మనసులోనే అనుకుని మళ్ళీ సీట్ దగ్గరికొచ్చాను. టాపిక్ మారిపోయింది.

స్టాక్ మార్కెట్ల చర్చ జరుగుతోంది. రూపాయి పతనం పట్ల జాలి, మదుపరుల తెలివితేటల పట్ల గౌరవం, దేశభవిష్యత్తుపై అనిశ్చితి, మందుల బ్రాండ్లు – వాటి రుచులు, హాలీవుడ్‌తో మిగతావుడ్‌ల పోలికలు... డ్రింక్స్ సెషన్ పూర్తయింది. భోజనం ఆర్డర్ చేశాము.

శివ టేబుల్ పైన పరచివున్న వాసుగాడి గాడ్జెట్స్ వైపు చూస్తూ, అన్నిటినీ గుర్తించే ప్రయత్నం చేస్తున్నట్టున్నాడు. రెండు మొబైల్స్, ఒక ఐ పాడ్, గాగుల్ బాక్స్... వీటితో పాటు మరో చిన్న టార్చ్ లాంటి వస్తువును చూస్తూ...

"ఇదేంట్రా, టార్చా? ఇదెందుకు నీకు? చాలా మామూలుగా అడిగాడు శివ.

"ఓ, ఇదా, ఇది ఆర్ ఎఫ్ ఇంజెక్టర్. నేను చెప్పాను కదా, మేమొక ల్యాబ్‌కి ఆడిట్‌కి వెళుతున్నామని. అక్కడ ఎవరైనా ఆ వస్తువును దాచిపెట్టే ప్రయత్నం చేస్తే దీని సాయంతో కనిపెట్టొచ్చు. మా వస్తువులన్నిటిలో ఆర్‌ఎఫ్ టాగ్ మదర్‌బోర్డ్ మీదే ఫ్యాబ్రికేట్ చేయబడి వుంటుంది. ఇది చాలా శక్తివంతమైన కిరణాలను ప్రసారం చేయడం ద్వారా ఆ వస్తువు ఎంత మూలనున్నా కనిపెట్టగలుగుతుంది..." ఇంకా ఏమో చెబుతున్నాడు. నాకు ఏమీ బోధపడడం

లేదు. నా మనసంతా ఇప్పుడు మా ల్యాబ్‌లో వుంది. ఆలోచనలన్నీ అమృతరావ్ చుట్టూ తిరుగుతున్నాయి. రేపటి చిత్రం ఈ రోజు కళ్ళముందు కనబడుతోంది.

మా బాస్, నేను, అమృత్ అండ్ టీం అందరి ముందూ, స్టోర్‌లోకొచ్చి వాసుగాడు ఈ గాడ్జెట్‌ని ఆన్ చేయగానే, ఒక మూల నుండి ఆరెస్ 750 కుయ్యో కుయ్యోమంటూ అరచి అది దొరికిపోతూ, మమ్మల్ని పట్టిస్తుంది. అప్పుడు వాసుగాడు– సినిమాల్లో హీరో కుటుంబాన్ని కిడ్నాప్ చేసిన తరువాత, హీరో నిస్సహాయతని హేళన చేస్తూ విలన్ చూసే చూపొకటి మా వైపు ప్రసరిస్తూ " ఇదేనా మీ పరిశోధన? మమ్మల్నే బోల్తా కొట్టించగలమనుకుంటున్నారా?" అంటూ నోటికొచ్చిన మాటలు మాట్లాడుతూ...

ఇప్పుడెలా? ఏం చేయాలి? అమృత్‌కి ఫోన్ చేసి, స్టోర్ ఐడియా మానుకోమని చెప్పాలి. మరింక ఎక్కడ దాయాలి? ఎక్కడ దాచినా దొరికిపోతాం. మా బాస్‌కి ఫోన్ చేసి చెప్పాలా? నీకెలా తెలుసు అనడిగితే? నా స్నేహితుడే అని చెబితే... మా ల్యాబ్‌కి విలన్ నా స్నేహితుడే అవడం నేను జీర్ణించుకోలేక పోతున్నా.. పోనీ వాసూని పక్కకు పిల్చుకెళ్ళి విషయం మొత్తం చెబితే... మా ప్రమేయం ఏమీ లేదని అర్థం చేయించుకోగలిగితే...

శివ తన ప్రశ్నల వర్షం కురిపిస్తూనే ఉన్నాడు. " అంత పెద్ద క్యాంపస్‌లో ఒక చిన్న వస్తువు వున్నదీ, లేనిదీ ఎలా గుర్తిస్తారు? అసలు మీరొస్తున్నారని తెలిసి వాళ్ళు ఆ వస్తువును ఎక్కడైనా దాచేస్తే? లోపలైతే ఈ గాడ్జెట్‌తో కనుక్కుంటావు. ఈ పాటికే బయటకు పంపించి వుంటే?"

వాసుగాడు పెద్దగా నవ్వుతూ, "వస్తువును కొని వాడే వాళ్ళకే అన్ని తెలివితేటలుంటే, దాన్ని డిజైన్ చేసి తయారుచేసే మాకు ఇంకెన్ని తెలివితేటలుండాలి. వాళ్ళ సెక్యూరిటీ దగ్గర రికార్డ్స్‌లో దొరికిపోతారు. వాళ్ళ నెట్వర్క్‌లో లాగినయి మా దగ్గరున్న నెట్వర్క్ టూల్స్‌తో లాగ్స్ పరిశీలిస్తాము. లోపలే ఉందంటే ఇదిగో ఈ ఆర్ ఎఫ్ ఇంజెక్టర్‌తో పట్టేస్తాము." అంటూ అభినయించి చెబుతున్నాడు.

అంత చల్లటి ఏసీ హాల్లో నాకు ముచ్చెమటలు పోస్తున్నాయి. మేమసలు లాగ్ ఫైల్స్ గురించి ఆలోచించనే లేదు. ఎన్నెమ్మెస్ తీసేస్తే సరిపోతుందనుకున్నాము. పైగా ఇంత తీవ్రమైన పరీక్షను మేము ఊహించలేదు. నేను ఎంత వుదాసీనంగా అమృత్‌కి బాధ్యత అప్పగించి వచ్చేశాను? అది నిజం కాదేమో, ఒకవేళ నేను రాకపోయి వుంటే నాకీ విషయాలు తెలిసే అవకాశం కూడా వుండేది కాదు. అయినా ఇప్పుడు తెలిసీ చేయగలిగింది ఏముంది. ఉన్న సమయం చాలా తక్కువ. శత్రువు ఏ అవకాశము ఇవ్వకూడదని నిశ్చయించుకుని వచ్చేశాడు. ఈ స్థాయిలో పరీక్ష ఉంటుందని మేము అంచనా వేయలేక పోయాము.

నేను రేపు ఆఫీస్‌కి వెళ్ళడమా, మానడమా? రేపు జరగబోయే సంఘటన, దాని

పర్యవసానం నా స్థానాన్ని మరింత దిగజారుస్తాయి. ఇలాంటి పరిస్థితిలో నా గురించి ఆలోచించడమా? ఆఫీస్ గురించి ఆలోచించడమా? 'ఇలాంటి పని చేశారేంట్రా' అని వీడి ముందు ఒక అవమానం. 'ఇలాంటి వాడు నీ ఫ్రెండా' అని మా కొలీగ్స్ ఛీత్కారం...

పోనీ, నేనే వాసుతో అన్నీ వివరించి చెప్పి, సహాయం చేయమంటే? వాడికి చేసే ఉద్దేశ్యముంటే ఫరవాలేదు. ఒకవేళ వాడి ఆలోచనలు వేరేగా వుంటే అనవసరంగా నేనే చేతులిచ్చి కట్టించుకున్నట్లుంటుంది. పోనీ చూచాయగా వాడి మనసులో మాట గ్రహించగల్గితే? కానీ ఎలా? లెట్ మీ ఆస్క్.

"అవును వాసూ, నాకో డౌటు – ఆ ల్యాబు వాళ్లు కొనగూడదని తెలియక కొని వుంటే? – మీరేం చేస్తారు?"

"నా ఎంక్వయిరీలో నేను పట్టుకున్న కష్టమర్లలో తొంభై శాతం మంది అలాగే చెబుతారు. తెలిసి కొన్నా తెలియక కొన్నా తప్పు తప్పే కదా? తెలియక కొన్నామని ప్రూవ్ చేయగలరా? చేయలేరు. అందుకే చివరి అస్త్రంగా తెలియక కొన్నామని బుకాయిస్తారు. అంతెందుకు రేపు నేను వెళ్లబోయే ల్యాబులో కూడా ఇదే సీన్ రిపీట్ అవుతుంది చూస్తుండు."

అయిపోయింది.

దింపుడు కళ్ళెం ఆశ కూడా చచ్చిపోయింది. వీడు కరడు కట్టిన కార్పోరేట్ ఉద్యోగి అని అర్థమైపోయింది. రేపు మమ్మల్ని నలుగురి ముందూ నవ్వులపాలు చేయడానికి కంకణం కట్టుకుని వచ్చినట్టున్నాడు. ఇప్పుడు అర్జెంటుగా అమృత్‌తో మాట్లాడాలి. తను ఈ పాటికి ఆరెస్ 750 ని డిస్కనెక్ట్ చేసి, స్టోర్స్‌లో పెట్టి ఉంటాడు. ఇప్పుడెలా?

"సత్యం, వాసుని మారియట్ హోటల్‌లో డ్రాప్ చేసి పోగూడదా?" రాజశేఖర్ అభ్యర్థన. నేనీలోకంలోకొచ్చాను. "ష్యూర్, తప్పకుండా."

అందరి దగ్గర వీడ్కోలు తీసుకుని నేను, వాసు బయలుదేరాము.

కారు ప్యారడైజ్ సర్కిల్ దాటింది.

వాసు చెబుతున్నాడు. "నీకు తెలుసుగదరా, చిన్నప్పటి నుండి మన దేశమంటే ఎంత ఇష్టపడేవాడినో, మేమేమో అక్కడ, 'ప్రపంచానికి వెలుగు చూపించిన దేశం' అని పొగడుతూ చెప్పుకుంటాం. కానీ ఇక్కడ చూస్తే ఇలాంటి పైరసీలు. అక్కడ బతికేవాళ్ళం ఇవన్నీ తట్టుకుని పని చేయడం, సమర్థించుకోవడం చాలా కష్టమైపోతుందిరా! ఇక్కడ జరిగే ప్రతి సంఘటనకు మేము స్పందిస్తూనే వుంటాము. నీకు తెలుసా – మొన్న అన్నాహజారే ఉద్యమానికి మేము కూడా మా సంఘీభావం వ్యక్తం చేశాము. వెయ్యి మంది తలా వంద కొవ్వొత్తులు వెలిగించి లక్ష కొవ్వొత్తుల ప్రదర్శన నిర్వహించాము. టివి9 కూడా ఆ ప్రోగ్రామ్ కవర్ చేసిందనుకో! విషయమదికాదు – ఇక్కడి హద్దు మీరిన అవినీతి రూపు మాపేందుకు మా వంతు..." ఇంకా

ఏమేమో దేశం గురించి సంస్కృతి గురించి మాట్లాడుతున్నాడు. నేనిప్పుడు వాడితో వాగ్వివాదానికి దిగదలచుకోలేదు. అలా అని నేను వాడితో ఏకీభవిస్తున్నట్టు కాదు.

మారియట్ వచ్చింది. వాసు గుడ్‌నైట్ చెప్పి దిగిపోయాడు.

కానీ వాసు వదలిన భావావేశం మాత్రం ఇంకా కార్లోనే వుంది.

ఆరెస్ లాంటి కంపెనీలు, మన దేశంలో తయారైన మానవవనరులను ఉపయోగించి కొన్ని సాంకేతిక పరికరాలు తయారు చేసి తిరిగి మనకే అత్యధిక ధరలకు అమ్మడం నీకు అర్థమౌతుందా వాసూ? మీ తెలివితేటలతో, అంటే ఈ దేశవాసుల తెలివితో తయారైన పరికరాలను ఇక్కడ అమ్మడానికి కూడా ఆంక్షలు విధిస్తున్నారంటే ఇందులో మీ పరోక్ష దేశద్రోహం లేదా? కనీసం ఇలాంటి విషయాలు మీ దృష్టికి వస్తున్నాయా? వచ్చినా చూడనట్టు నటిస్తున్నారా? ఈ మనుషులతో కలసి జీవించడమే ఈ దేశాన్ని అనుభవించడమంటే, ఈ దేశాన్ని పలవరించడమంటే... స్వీయానుభూతికి, సహానుభూతికి చాలా వ్యత్యాసముంటుందిరా...

ఇల్లొచ్చింది. కార్ పార్క్ చేసి టైమ్ చూశాను.

పదకొండయింది.

ఇంట్లోకెళ్ళాలనిపించలేదు. ఫోన్ తీసి అమృతరావ్‌కి కాల్ చేశాను. అటు నుండి ఉత్సాహంగా.

"సత్యం గారూ, మొత్తం ఏ మాత్రం అనుమానం రాకుండా సిస్టమ్, కేబుల్స్ అన్నీ చక్కగా మార్చేసాం. ఎన్విరాన్మెంట్స్ పూర్తిగా ఆనవాలు లేకుండా జాగ్రత్తపడ్డాం. ఈ సిస్టంని కూడా స్టోర్‌లో బాగా మూలనున్న ప్రదేశంలో పెట్టాము."

రాత్రి పదకొండు గంటలైనా ఇంకా అమితోత్సాహంతో మాట్లాడుతున్న అమృతరావ్‌కి మనసులోనే అభినందనలు చెప్పుకుని – ఇంత ఉత్సాహంలో ఉన్న వ్యక్తిని ఇప్పుడు నిరుత్సాహపర్చడమా, లేక ఏమవుతుందో అదే కానిమ్మని మౌనం వహించడమా అన్న మీమాంసలోపడి నిముషం గడిచాక –

"అమృత్, నీతో ఒక ముఖ్యమైన విషయం చెబుతాను. నీకు, శంకర్‌కి తప్ప ఈ విషయం ఎవరికీ తెలియనియ్యకు" అంటూ – ఈ నాలుగు గంటలలో జరిగిన విషయాలన్నీ క్లుప్తంగా వివరించాను. ఆర్ఎఫ్ టాగ్ అమర్చబడి వున్న ఆ సిస్టమ్ మమ్మల్ని ఏమార్చిందని చెప్పాను. వాళ్ళ దగ్గరున్న నెట్వర్క్ టూల్స్‌తో మనం ఈ రోజు సిస్టమ్ మార్చిన విషయం కనిపెట్టేస్తారని చెప్పాను.

అమృతరావ్ ముందు ఆశ్చర్యపోయాడు. ముందుగా విషయం తెలిసినందుకు ఆనందపడ్డాడు. తరువాత ఏం చేయాలనే ఆలోచనలో పడ్డాడు.

"అమృత్, ఏదైనా మార్గాంతరం దొరికితే వెంటనే ఫోన్ చెయ్యి. ఇప్పుడు నేను అంతదూరం వస్తే, సెక్యూరిటీకి సమాధానం చెప్పుకోవాలి. పొరపాటున రేప్పొద్దున ఆ రికార్డ్స్‌లో నా పేరు ఉండటం ఇవన్నీ అనవసరంగా అనుమానాలు రేకెత్తిస్తాయి. నేను రేపు ఆఫీస్‌కి కూడా రాదలచుకోలేదు. నాకేదైనా తోస్తే నీకు కాల్ చేస్తాను."

ఫోన్ పెట్టేశాను.

కార్లో కూర్చునే కళ్లు మూసుకున్నాను. నిద్ర దరిదాపుల్లో లేదు. ఎలా తెల్లవారుతుందో, ఏమి జరుగుతుందో ఒకటే ఉత్కంఠ. గజిబిజి ఆలోచనలు. చిన్నప్పటి వాసు, ఇప్పటి వాసు, మార్చి మార్చి కళ్ళకు కడుతున్నారు. మనదేశంలో తయారైన నీలిమందు, పత్తి ఉపయోగించి ఫ్యాక్టరీలో బట్టలు తయారు చేసి మనకే అమ్మిన పరతంత్ర కాలానికి, మన వనరులు ఉపయోగించి సాఫ్ట్‌వేర్ తయారు చేసి మనకే అమ్ముతున్న స్వాతంత్ర్య కాలానికి మధ్య మనమేం సాధించాం? గ్లోబలైజేషన్ చక్రాల కింద నలిగిపోవలసిందేనా? స్వావలంబన, స్థానికీయత వట్టి గాలి కబుర్లేనా?

వాసూగాడికి హై ఫీవర్ వచ్చి రేపు రాలేనంటే? పోనీ మనమే వాసూగాడిని రాకుండా చేస్తే?

ఛ, ఛ ఏంటీ ఆలోచనలు?

ఇంతకీ హెన్రీగాడు ఏమయ్యాడు? వాడు వస్తున్నాడా, లేదా?

వాసుకు ఎవరితోనైనా ఫోన్ చేయించి... ఈ ఆలోచనల మధ్య మగత నిద్ర, మెలకువ, నిద్ర.

ఫోన్ మోగుతోంది. అమృత్ !

"సార్, ఒక ప్లాన్ తట్టింది. వినండి. అతను వాడబోయే నెట్వర్క్ టూల్ మనం సిస్టమ్ మార్చిన విషయం కనిపెట్టేస్తుంది. మీకు గుర్తుందా మన దగ్గర స్పేర్‌గా రెండు సిస్టమ్‌లు ఉన్నాయి. నేనేం చేయబోతున్నానంటే ఒక దానిని మనం వాడుతున్నట్టు, అందులో ప్రాబ్లం వచ్చినందుకుగాను దానిని రెండో దానితో మార్చినట్లుగా చిత్రించబోతున్నాము. మార్చిన విషయాల్ని అలా సమర్థించుకోవచ్చు."

"మరి ఆరెస్ 750 ని ఎలా తప్పిస్తున్నావు?"

"అది కూడా ప్లాన్ చేశాను సార్ " అంటూ పది నిముషాలు తన ప్రణాళికను వివరించాడు.

"అది చాలా రిస్కు కదా" అన్నాను.

"అంతకంటే మార్గం లేదు సార్. అయితే డైరెక్టరుగారికి ఎలాంటి మాట రాకుండా చూసుకునే బాధ్యత నాది. సార్, ఈ విషయం ప్రసాద్‌గారికి అప్పుడే చెప్పొద్దు. మొత్తం ప్లాన్ అమలు జరిగాక చెబుదాము. డోంట్ వర్రీ సార్, మహా అయితే ఒక మెమో వస్తుంది. ప్రమోషన్ కాస్త లేటవుతుంది. అంతే కదా! గుడ్‌నైట్, ఓహ్ సారీ గుడ్ మార్నింగ్! అప్పుడే రెండవుతోంది. రేపు ఈవెనింగ్ మీకు శుభవార్త చెబుతాను" పెట్టేశాడు.

అమృతరావ్ మీద నమ్మకంతో, చేస్తున్న పని మీద విశ్వాసంతో అలాగే నిద్రలోకి జారుకున్నాను.

* * * * *

సాయంత్రమైంది.

నేను ఎయిర్‌పోర్టు దగ్గర వాసు కోసం ఎదురు చూస్తున్నాను.

ఇందాకే అమృత్ ఫోన్ చేశాడు. విజయోత్సాహాన్ని పంచుకున్నాడు. సంతోషంతో ఉక్కిరి బిక్కిరవుతున్నాడు.

"మీ వాసుగారు మనమనుకున్న దానికన్నా చాలా తెలివైనవారు సార్. నెట్వర్క్ రూమ్‌లోకి రాగానే, సిస్టమ్ మార్చినట్టున్నారే అన్నారు. అవునని, పాతది నిన్న రాత్రి పాడవడంతో రాత్రంతా కూర్చుని మార్చాల్సి వచ్చిందని నేను చెబుతుంటే ఎంత కొంటెగా చూశారని!! పక్కన తన కొలీగ్ హెన్రీతో చెబుతున్నాడు.

"మనమెక్కువ కష్టపడనక్కరలేదు. నిన్న రాత్రే మార్చారంటే ఈ చుట్టుపక్కలే ఎక్కడో ఉంటుంది. మనం సెక్యూరిటీ దగ్గర కూడా ఎక్కువ రోజుల రికార్డ్స్ వెదకాల్సిన అవసరం లేదు" అంటూ మధ్యాహ్నం వరకూ చాలా ఉత్సాహంగా కనిపించారు.

ఆ తరువాత వాళ్ళ వెహికల్ మన ప్లాన్ ప్రకారం గాలి తగ్గిపోయి క్యాంపస్‌లో మిగతా ప్రదేశాలు తిరగడానికి పనికిరాకుండా పోయింది. దాంతో మన ప్లాన్ ప్రకారమే, డైరెక్టర్ గారి వెహికల్ తీసుకుని లోపలంతా తిరిగాము. అన్ని ల్యాబ్స్ చెక్ చేశారు. స్టోర్స్, మెస్, గోడౌన్, టాయిలెట్స్, కంప్యూటర్ సెంటర్ అన్నీ వెదికారు. దొరకలేదు. వాసుగారు చాలా నీరసపడిపోయారు. ఆ తరువాత డైరెక్టర్ గారిని కలిసి కలిగించిన అసౌకర్యానికి క్షమాపణలు చెప్పి సెలవు తీసుకున్నారు. కానీ చివరిసారి క్యాంపస్ వదిలి వెళుతున్నప్పుడు కూడా ఇంకా అనుమానాస్పదంగా, గాయపడ్డ పులిలాగా చూస్కుంటూ వెళ్ళారు."

బహుశా ఇంకో పది నిముషాల్లో వాసు వస్తుండొచ్చు నేను చెప్పే మాటలని ఎలా రిసీవ్ చేసుకుంటాడో? అసలు చెప్పాలా, వద్దా అన్న డోలాయమాన పరిస్థితిని దాటి చెప్పడానికే నిర్ణయించుకున్నాను. కనీసం నా మనసు క్షాళన జరిగినట్లవుతుంది.

వాసు వచ్చాడు.

వాడి మొహం బాగా వాడిపోయి వుంది. ఓటమిని భరించలేనితనం మొహంలో కొట్టొచ్చినట్టు తెలుస్తోంది.

"ఏదో మోసం జరిగిందిరా! తప్పించుకున్నారు. మొట్టమొదటిసారి – నేను ఇలా వట్టి చేతులతో పోతున్నాను. ఎక్కడో వాళ్ళకు వుప్పందింది" తన బాగ్‌ని ట్రాలీలో పెడుతూ అన్నాడు. వాడు చాలా షార్ప్.

ఎయిర్‌పోర్ట్ వాతావరణం కోలాహలంగా వుంది. టాక్సీ కోసం వెదికే వాళ్లు, టాక్సీలో నుండి దిగేవాళ్ళు, ఎదురు చూపుల వాళ్ళు, ఎవరూ రాని వాళ్లు, షాపుల బయట కాఫీ తాగుతూ, సెండాఫ్ ఇవ్వడానికి వచ్చిన బంధుమిత్రులతో నవ్వుతూ తుళ్ళుతూ...

నేను ఎంతో ఉద్వేగాన్ని అదుపు చేసుకుంటూ, మాటలు ఒక్కొక్కటి కూడబలుక్కుంటూ

“వాసూ, నీతో ఒక విషయం చెప్పాలి. ఒక్క నిముషం... ప్రశాంతంగా... విను.”

ఆగాడు.

మళ్ళీ ఒకసారి గుండె నిండా ఊపిరి తీసుకుని

“ఈ రోజంతా నువ్వు వెదుకుతున్న ఆరెస్ 750 ఇందాకటి వరకూ నీతోనే వుంది. మీ కార్ డిక్కీలో నీతో కలసి ప్రయాణించింది.”

వాడి మొహంలో తలెత్తుతున్న అనేక సందేహాలను పటాపంచలు చేసే నిమిత్తంతో–

“డైరెక్టర్ గారి కార్ కాబట్టి సెక్యూరిటీ చెక్ క్యాంపస్ లోపల ఉండదు. ఆ కార్‌కి యాంటీ జామింగ్ వుంది కాబట్టి నీ ఆర్ఎఫ్ ఇంజెక్టర్ పని చేయదు. ఈ విషయం డైరెక్టర్ గారికి తెలిస్తే ఆయన ఒప్పుకోరు కాబట్టి ఆయనకు తెలియకుండా ఆ ల్యాబ్ వాళ్ళు వేసిన స్కెచ్ ఇది” తల మీద నుండి పెద్ద భారం తొలగించుకున్నట్టు చెప్పేసి ఊపిరి తీసుకున్నాను.

వాసు ముఖం మాడిపోయింది. ఒక చిన్న అనుమానపు విత్తనం కొద్ది క్షణాల్లోనే మొక్కై, ఎదిగి ఎదిగి వటవృక్షమవుతుండగా, కళ్ళు చిన్నవి చేసి, చూపుడు వేలు నా వైపు చూపుతూ...

“ఇదంతా నీకెలా తెలుసు? అంటే... నువ్వు... అదే ల్యాబ్‌లో ... అవునా?

‘అవును’ అని తల వూపుతుంటే, వాసుగాడి మొహం ఉక్రోషంతో, కోపంతో ఎర్రబారిపోయింది. పట్టుకున్న ట్రాలీ హ్యాండిల్ పైన చేతులు గట్టిగా బిగిస్తూ – గొంతులో జీరని ఆపుకుంటూ...

“మా కార్‌లో గాలి తీసేసి, మమ్మల్ని డైరెక్టర్ కార్‌లో తీసుకెళ్ళినప్పుడే అనుకున్నా, ఏదో జరుగుతోందని, చీటింగ్! మిత్రద్రోహం” కసికొద్దీ తిట్టి, కొద్ది లోగొంతుకతో “ఇప్పుడు నాకు మా కంపెనీలో జరగబోయే అవమానం ఎలా వుంటుందో తెలుసా? అది ఎలాంటి నరకమో అనుభవించేవాళ్ళకు తెలుస్తుంది” అన్నాడు.

మాట్లాడుతుంటే మనిషి అవమాన తీవ్రతతో వణికిపోతున్నాడు. శరీరం కంపిస్తోంది.

నేను వీలైనంత నెమ్మదిగా “పర్సనల్‌గా క్షమాపణలు చెబుతున్నాను. కానీ అది దొరికి ఉంటే మా అందరికీ... ఈ దేశానికంతటికీ తలవంపులై వుండేది. కాదా?” అన్నాను.

నా వైపు వ్యంగ్యంగా చూస్తూ...

“అన్యాయంగా, మోసం చేసి తప్పించుకోవడం దేశభక్తి అనుకుంటున్నావా?” అన్నాడు.

“మిఠాయి బుట్టలో దాక్కొని తప్పించుకున్న శివాజీ దేశభక్తుడైనప్పుడు, కార్ డిక్కీలో ఆ వస్తువుని తప్పించడం...”

నామాటలు పూర్తి కాకముందే, నన్ను పై నుండి కిందికి ఒకసారి పురుగును చూసినట్టు చూసి, ఒక తృణీకారపు నిట్టూర్పు విడచి విసవిసా నడుచుకుంటూ సెక్యూరిటీ గేట్ వైపు వెళ్ళాడు వాసు.

# వొక్క వరద

94942 24338

చంద్రశేఖర్

తలుపులు తెరవాలని జేబులో చేయి పెట్టి తాళం చెవుల కోసం చూస్తూ ఆశ్చర్యపోయాను. తలుపు తెరిచే ఉంది. మెల్లగా తలుపు తోసుకుని హాలులోకొచ్చాను. అలికిడి లేదు. తలుపుల తాళాలు ఎవరు తీశారో ! బెడ్రూము వైపు నడవబోయి ఆగిపోయాను. రీడింగ్ రూంలో లైటు వెలుగుతోంది. మెల్లిగా రీడింగ్ రూం తలుపు దగ్గరికి వచ్చి లోపలికి తొంగి చూశాను. ఎవరో అందమయిన అమ్మాయి చిరాగ్గా ఉంది. టేబుల్ చిందరవందరగా ఉంది. టేబుల్ సొరగుల్లోకి చూస్తూ దేన్నో వెతుకుతున్నట్లుంది ఆమె.

ఎవరీమె? ఈ రాత్రివేళ నా ఇంట్లోకి వచ్చి నా రీడింగ్ రూమ్‌లో వెతకడమేమిటి? చూస్తే దొంగలా కనిపించడం లేదు. ఉన్నట్లుండి సొరుగులు వెతకడం ఆపి నా డెస్కుటాపు స్విచ్చాన్ చేసింది. విండోస్ స్టార్ట్ అయి పాస్వర్డ్ అడుగుతోంది డెస్కుటాప్. తను తల పట్టుకుని డెస్కుటాప్ ముందు కూచుంది. ఏం కావాలీ అమ్మాయికి? తలుపు తోసుకుని లోపలికొచ్చాను. అలికిడి విని ఇటు తిరిగింది. హఠాత్తుగా లేచి చేతులు జోడించి "రండి సార్ " అంది. ఆ పిలుపులో, ముఖకవళికలో సహజత్వం కనబడలేదు నాకు. కొంచెం వ్యంగ్యంగా ఉందా?

"మీరూ" సంశయంగా అడిగాను.

"అప్పుడే మర్చిపోయారా! ఇంకా పూర్తయినా కాలేదు."

"పూర్తి కావడమేమిటి?" నాలో నేను గొణుక్కున్నట్లు అడిగాను.

"అవునవును, మీకెన్ని పాత్రలో! బోడి ఈ ఒక్క పాత్ర గుర్తుంచుకోదగ్గ గొప్పదేమీ కాదు గదా."

"ఆకాంక్షా"

"అవున్నేనే" దాదాపు ఏడుస్తున్న గొంతుతో అంది.

వొక్క క్షణం కళ్ళకు మబ్బుతెరలు అడ్డు వచ్చినట్లైంది. తమాయించుకోడానికి కుర్చీ రెక్కలు పట్టుకున్నాను.

"అమ్మానాన్నల వూరు మార్చారు. వాళ్ళు ఎక్కడున్నారో తెలియదు. శేఖర్ ఉనికి కనిపించట్లేదు. నేనేమో నా చేతుల్తో ఇప్పటికి ముగ్గుర్ని చంపాను. ఎక్కడికైనా పారిపోదామన్నా వీల్లేని స్థితి. తరువాతి క్షణం ఏం చేస్తానో ఏమవుతానో అర్థం కాక పిచ్చెక్కిపోతోంది."

"ఆకాంక్షా", అర్థం కాని అయోమయంలో ఉన్నాను.

"నా భవిష్యత్తు గురించి తెలుసుకోడానికొచ్చాను. నా తరువాత జీవితం ఏమిటో నాకు తెలియాలి."

టేబుల్ పక్కనున్న స్టూల్‌పై కూలబడ్డాను. గొంతులోంచి మాట పెగలడం లేదు.

పక్కనున్న బాటిల్ ఓపెన్ చేసి ఇచ్చింది. గటగటా తాగేశాను.

వచ్చి నా ఎదురుగా కూచుంది. "తరువాత ఏం చెయ్యబోతున్నారో చెప్పండి. శేఖర్ ఎక్కడున్నాడు. మా నాన్నగారు ఎక్కడున్నారు? సరళ ఏమైంది? "ఎస్" నాపై ఎందుకు దాడి చేశాడు? వాడిప్పుడు నన్ను చంపాలంటూ నా వెంట పడుతున్నాడు. వాడి తమ్ముడిని నేను చంపానని వాడనుకుంటున్నాడా? చెప్పండి ప్లీజ్. టెన్షన్ భరించలేక పోతున్నాను." వొళ్ళో పడి ఏడుస్తోంది.

"ఆకాంక్షా! ఆకాంక్షా!" మెల్లగా పిలుస్తూ ఉండిపోయాను. ఆశ్చర్యం నుంచి ఇంకా కోలుకోలేదు. ఏం చెయ్యాలిప్పుడు? ఇలా జరుగుతుందని ఊహించనైనా లేదు. అయినా నా చేతుల్లో ఏముంది. ఈ ప్రపంచంలోని ఏ పాత్రైనా వాటి విధిని అవి నిర్వహించాలి. ముందుగా తెలుసుకోవడమే సాధ్యమైతే ఇన్ని మారణ హోమాలెందుకూ, ఇంత రక్తపాతమెందుకూ?

ఈ భూమి రక్తంతో తడిసిన ప్రతిసారీ కన్నీళ్లు భూమిపైన రక్తపు మరకల్ని కడగడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాయి. రక్తపు రుచి మరిగిన విత్తనాలు భూమిలోంచి మళ్ళీ విరుచుకుని పైకి లేస్తూనే ఉన్నాయి. మహా వృక్షాలై భూమిని కబలించాలని చూస్తూనే ఉన్నాయి. ఇక్కడ ప్రతి ఒక్కరూ కన్నీటితోనో రక్తంతోనో ముడిపడే ఉన్నారు. ఆకాంక్షా ఇందుకు మినహాయింపు కాదు. కానీ ఇప్పుడు తను ఉన్న స్థితిలో ఇది ఆమెకు అర్థం కాదు. నేను జ్యోస్యుడిని కాను. తన భవిష్యత్తు తెలుసుకోవడం కోసం ఆమె నా పరిసరాలను వెతుకుతోంది. ఆమెకెలా చెప్పాలి? తను నా నుండి బయటికొచ్చిన ఒక పాత్ర మాత్రమే. నేనొక వాహికను, సృష్టికర్తను కాదు.

కళ్ళు తుడుచుకుంటూ పైకి లేచింది. "ఏమిటి నా సంగతి?" మళ్ళీ అడిగింది.

"నువ్వు నా ప్రాణానివిరా" అన్నాను.

"ఐతే నేనిప్పుడే అంతమైపోతా!" రౌద్రం.

"నేను సృష్టికర్తను కాదు. నీ జీవితం నా చేతుల్లో లేదు, భవిష్యత్తు మనకు తెలియదు."

"నీకు తెలుసు"

"నన్ను నమ్మురా"

"నేనెవర్నీ నమ్మను. నేనేంటో నాకు తెలియాలి", తెల్లటి అందమైన చెక్కిళ్ళు కోపంతో ఎర్రబడి తన బరువైన శ్వాసతో అదురుతున్నాయి. నేనొక అద్భుతాన్ని చూస్తున్నా.

దభాలున శబ్దం. కళ్ళు తెరిచి చూసేసరికి నేల మీద పడి ఉన్నా. తల దిమ్మెక్కినట్లు అయింది. నిదానంగా ఒళ్ళు సవరించుకొని లేచి నా గది పరిసరాలు చూశాను. నేను బయటి నుండి తెచ్చిన బ్యాగు లేదిక్కడ. తను నా బ్యాగు తీసుకొని పోయిందా? అందులో తన భవిష్యత్తు ఉందనుకుందేమో. అవును ఉంది. కానీ అది ఇంకా రాయబడనిది. తెల్ల కాయితాల రూపంలో.

తలుపు తట్టిన శబ్దం. వెళ్లి తలుపు తీశా. ఎదురుగా హరి. "ఇంటికి పోతా వుంటే లైటున్నిగదా చూద్దామని ఇట్లొస్తి." అన్నాడు.

"లోపలికిరా" అన్నాను.

"మాయాద్వీపం పిల్లల కథల పుస్తకం రేపొస్తుంది."

"వర్కైపోయిందా".

"పోయిన వారానికి అంతా రెడీ అయిపోయింది. బైండింగ్ కాడ లేటైంది."

"ఈ రోజు అక్కడే ఉన్నావా?"

"ఆ, నీ కొత్త కథ ఎంతవరకొచ్చింది."

"ఆకాంక్ష  నాపై దాడి చేసింది."

"ముగ్గుర్ని చంపిన క్యారెక్టర్", నవ్వాడు.

"ఈ రాత్రికెలాగైనా పూర్తి చెయ్యాలి."

"వూర్లో పెద్ద వాన, వాగులన్నీ నిండి పారుతున్నె."

"కరెంట్  ఉంటుందా"

"నమ్మకం లేదు."

తెరిచిన తలుపులోంచి చల్లని వానగాలి విసురుగా.

"వాన పెరుగుతుందేమో, నేనొస్త."

"సరే పద", హరిని పంపించి తలుపు వేశాను. నా బ్యాగెలా పోయింది?

ఫ్రిడ్జ్ తెరిచి అందులో ఉన్న తిండి కాస్త బైటికి తీశాను. తినాలనిపించలేదు. అనూహ్యమైన ఆకాంక్ష దాడి అర్థం కావడం లేదు. జీవితానికీ రచనకీ తేడా ఉండదా?

కాఫీ కలుపుకుందామని పాలు బైట పెట్టాను. కాఫీ మరుగుతుండగా కరెంటు పోయింది. బయట వాన ఉధృతి పెరిగింది. స్టౌ వెలుగులో కాఫీ కప్పులోకి వొంపుకున్నా. కింద రూముల్లో ఉండాలనిపించలేదు. మెట్లెక్కి పై గది వరండాలోకి చేరుకున్నా. నాన్న ఇష్టపడి చేయించుకున్న ఈజీ చైర్లో వాలిపోయా. ఆలోచన్లు తెమలవు వొక పట్టాన.

* * * * *

బయటంతా కేకలు. కలకలం. ఉలిక్కిపడి ఈజీ చైర్లో నుండి లేచా. అందులోనే నిద్ర పోయినట్లున్నా. పక్కింటి వాళ్ళ అరుపులు వినబడి కిటికీ తెరిచి చూశా. కిందంతా జలమయం. వరండాలోంచి కింది హాలులోకి చూశా. చీకట్లో కనబడలేదు గానీ మెరుపు వెలుగులో మా హాల్లో స్విమ్మింగ్ పూల్. కుర్చీలూ, సోఫాలూ నీళ్ళల్లో తేలుతున్నాయి. కంప్యూటర్ ఏమైందో? కిందికి దిగబోతుండగా పక్కింటి శ్రీనివాస్ అరిచాడు.

"దిగకండి సార్, నీళ్ళు పెరుగుతున్నై."

మా ఇల్లు, మా కాలనీ, మా కనుచూపు మేరంతా నీళ్ళే. నా గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

"వాన పెరుగుతా వుంది మీ ఇంట్లోకొస్తం" అరిచాడు శ్రీనివాస్. వొకమూలగా ఉన్న నిచ్చెన వాళ్ళ ఇంటికీ మా ఇంటికీ వారధిగా వేశాం. శ్రీనివాస్ కుటుంబంతో పాటు ఇంకొందరు వచ్చారు.

"వరద నీళ్ళల్లో పాములుగూడా వస్తున్నై" ఎవరో అన్నారు.

"నా సైకిల్ కొట్టుకుపోయింటదా" ఒక పిల్లగాడు ఏడుపు గొంతుతో అన్నాడు.

మా ఇంటి ముందాగుండాల్సిన నా కారు కొంచెం దూరంలో గుబురుగా ఉన్న పొదల్లో ఉన్నట్లుంది. ఈ వరదల్లో ఎంత మంది ఆస్తులెన్ని కరిగిపోతాయో!

"మీ కంప్యూటర్, టీవీ ఏమైనా పైకి తెచ్చుకుంటారా"

ప్రశ్న వచ్చినవైపోనవ్వు నవ్వా. నా నవ్వు నాకే వెర్రిగా అనిపించింది. చుట్టూ నీటి హోరు. ఆ హోరును మించడానికి పోటీ పడుతూ మనుషుల మాటలూ, అరుపులూ, ఏడుపులూ....

"ఫోన్లు పని చేస్తున్నాయా?" అడిగాను.

"సెల్ఫోన్లు కూడా పని చెయ్యడం లేదు" అన్నాడు శ్రీనివాస్.

రాత్రంతా జాగారం. రాత్రి రెండున్నర వేళ మెల్లగా నీరు తగ్గుతున్నట్లు కనుక్కున్నారెవరో. వాన ఉధృతి తగ్గుతోంది. నిమిషాలు దొర్లుతున్న కొద్దీ నీళ్ళలో మునిగిన వస్తువులొకటొకటి ద్వీపాల్లా బయట పడుతున్నాయి. చీకటి మలిగేసరికి నీరు పూర్తిగా తీసింది గానీ వరద తెచ్చిన వొండు మాత్రం అలాగే ఉన్నట్లుంది. దిగుతున్న నన్ను మళ్ళీ వారించారెవరో.

"ఆ వొండులో ముళ్ళు ఉండొచ్చు సార్"

తెల్లవారుతుండగా ప్రారంభమైంది శోకం.

ప్రేమతో, సెంటిమెంట్‌తో, అక్కరతో, అవసరంతో, అక్కసుతో, ముందుచూపుతో సేకరించుకున్న వస్తు సంచయమంతా ఒక్క తుఫాను గాలికి, ఒక్క వరద ఉధృతికి కకావికలమైతే, కనుమరుగైతే, బురద భూయిష్టమైతే, ఆకృతి హీనమైతే మనసులోంచి కట్టలు తెంచుకున్న వేదన వరదలై పారి వస్తు శూన్యతను పూరింప జూస్తున్నట్లున్నది.

అగ్నిమాపక దళాలొచ్చాయి. ఏనుగు తొండాల్లాంటి పైపులతో పేరుకున్న బురదను కడిగేందుకు ప్రయత్నిస్తున్నాయి. పసితనం నుంచి వృద్ధ జ్ఞానం వరకు అంతా బురదను కడిగేసుకోవాలని ఆరాటం.

ఆకాంక్షా, నా చిన్ని బంగారు లోకమా! ఎలా వ్యాపించావు నువ్వు. ఇదేనా నేను దాచిన నీ భవిష్యత్తు?

అంతా యుద్ధ వాతావరణమ్లాగుంది.

పసికందుల చిరు పిడికిళ్ళు కూడా క్రమంలో ఉండాలన్న తల్లుల ఆరాటానికి చేతులవుతున్నాయి.

వొక్క తుఫాను.

వొక్క వరద.

పోగేసుకున్న జ్ఞానాన్నీ, జ్ఞాపకాన్నీ, వస్తు వ్యాపకాన్నీ.

వొక్క వరద.....





94908 83299

# చచ్చి బ్రతికిన మనిషి

డా॥ తంగిరాల మీరా సుబ్రహ్మణ్యం

దాసు కళ్ళు ఎర్రగా వున్నాయి. రక్తాశ్రువులు రాల్తాయేమో అనేంత ఎర్రగా! కంటి మీద రెప్ప పడడం లేదు.

మొండెం నుండి తెగిన తల... అంత దూరానికి ఎగిరి పడిన మొండెం...

తల తెగిపోగానే మొండెం కాళ్ళు చేతులు టపటప కొట్టుకుని వుంటాయా?

సరిగ్గా మెడ మీద నుండి రైలు చక్రాలు పోయేలా పడుకోవడానికి ఎంత ధైర్యం కావాలి?

'ఎంత పని చేశావు రమణా! ఎందుకిలా చేశావు? నా మీద నమ్మకం లేకే కదూ? నా చేతకానితనం వలననే కదూ?'

దాసు గుండె ఎక్స్‌ప్రెస్ రైలులా దబదబ కొట్టుకుంటోంది. మండుతున్న కళ్ళ నుండి జారుతున్న అశ్రువులు.

గుండె పిండేస్తున్న బాధ... ఆ బాధ వెనుకనే మరేదో రిలీఫ్... మనసును నెమ్మదిగా కమ్ముకుంటున్న నిశ్చింత. రాక్షస సంతోషమా ఇది !

నిజానికి రమణ ఆదుకోకపోతే రైలు పట్టాల మీద పడివున్న తల తనది కావలసింది.

ముఖం నిండా చిందిన రక్తం. ఒక కన్ను చితికి పోయింది. ఇంకో కన్ను భీకరంగా తెరచుకుని కనుగుడ్డు బయటకు పొడుచుకు

వచ్చింది. ఆ కంటి వైపు చూస్తే రమణ తననే చూస్తున్నట్లు అనిపించి గుండె గుభిల్లుమంది దాసుకి.

'చూశావా దాసూ ! నీ మూలాన నాకే గతి పట్టిందో?' తెగిపడిన రమణ తల మాట్లాడింది.

చెవులు మూసుకుంటూ వెనక్కి నడిచాడు.

'నాదేం తప్పు లేదు. ఎంతో ప్రయత్నించాను' దాసు మనసు గొణుగుతోంది.

నిన్న సాయంత్రమే కదూ రమణని ఇరానీ హోటల్లో కలిసింది.

తెల్లని లాల్చీ, పైజామా, తెలుపు నలుపు కలగలుపు జుత్తు, ఎన్ని కష్టాలున్నా తొణకని మనిషి... ఏమైంది ఆ ధైర్యం? తనలాగే వాడికీ చుట్టూ అప్పులే. అవన్నీ ఆఫీసు లోన్ల వరకే.... చచ్చినా బయట నుండి అప్పు చేయడు.

వాడికి తనలా 'కట్నం బాకీ తీర్చకపోతే పుట్టింటికి పంపేస్తార్ట... ఏదో ఒకటి చేయాలి అన్నయ్యా' అని ఏడ్చే చెల్లెలు లేదు.

'తాకట్టులో వున్న పుస్తెలతాడు విడిపించి తెస్తావా ఉరి పోసుకు చావమన్నావా' అని బెదిరించే భార్య లేదు.

ఎందుకంటే ఆవిడ రెండేళ్ళ క్రిందటే క్యాన్సర్‌తో పోయింది. ఆమె చికిత్స కోసం ఆఫీసులో దొరికినన్ని లోన్లు తీసుకున్నాడు. ఆవిడ ఒంటిమీదున్న కాస్త బంగారం అమ్మేశాడు.

వాడికి పెళ్ళి కావాల్సిన కూతురుంది. తనలాగే... ముత్యంలాంటి పిల్ల. వాలంటరీ రిటైర్మెంటు తీసుకుని పెళ్ళి చేయాలనుకున్నాడు. ఇంతలోనే ఈ అర్ధాంతరం చావు.

'నా కూతురి మానాన్ని కాపాడరా...' అరుస్తోంది ముందుకు పొడుచుకు వచ్చిన కన్ను.

దాసు వెనక్కి వెనక్కి అడుగులు వేస్తున్నాడు. కడుపులో వికారంగా తిప్పేస్తోంది. ప్రొద్దున తిన్న ఫలహారం బయటకు తన్నుకొస్తోంది. లుంగలు చుట్టుకొస్తున్న దుఃఖం. గొంతులో నొప్పి...

'ఎందుకింత తొందరపడ్డావు రమణా?' దుఃఖంతో బాటుగా గుండెలో ఒక మూల నుండి కదులుతున్న సంతోషం లాంటి భావం. సంకెళ్ళు తెగినప్పటి నిశ్చింత.

'రమణ చావుతో తనకేం సంబంధం లేదు. వున్నా ఎవరికీ తెలియదు...'

'సారీ రమణా... క్షమించు...'

జనం మూగుతున్నారు ఈగల్లా. కర్చీఫులు ముక్కుకు అడ్డం పెట్టుకుని... ఒంగి ఒంగి... తొంగి తొంగి చూస్తూ. "ఎంత ఘోరం! ఏం కష్టం వచ్చిందో? చిన్న వయసే పాపం ! ప్రాణం ఎంత కొట్టుకుందో శరీరాన్ని వదలి పోయే ముందు. ఇలాంటి చావు పగవాళ్ళకి కూడా వద్దు బాబూ."

ఆ బాధ తెలిసినట్టే... అనుభవం వున్నట్టు మాటలు... సానుభూతి.

'పగవాడు కాదు రమణ... నా స్నేహితుడు, నా కోసం ప్రాణమిచ్చే స్నేహితుడు' దాసు మనసు అరుస్తోంది.

కుతూహలంగా ముందుకు ముందుకు త్రోసుకుంటూ వచ్చి, చూసి, 'అబ్బ చూడలేం బాబూ...!' అంటూ జనం.

పోలీసులు, అంబులెన్స్, జనాన్ని నెట్టేసే లాఠీలు...

ముత్యమంటి పరిమళ... రమణ పద్దెనిమిదేళ్ళ కూతురు... నాన్న చావు గురించి తెలిసి పరిగెత్తుకు వస్తుంటుంది.

చూస్తే 'అంకుల్' అని మీద పడి ఏడుస్తుంది. పోస్ట్‌మార్టమ్... పోలీసులు... ప్రశ్నలు... దహనక్రియలు... వద్దు... వద్దు... తప్పుకో... తప్పించుకో... మనసు తొందర...

పగలే చీకటిగా వుండే బారు సేద తీరుస్తానంటూ పిలిచింది.

'రమణా... రమణా... నిన్ను చంపుకున్నానురా...' త్రాగుతూ ఏడుస్తూ...

'మా అమ్మ చచ్చిపోయినప్పుడు తాగానురా... మళ్ళీ ఇవాళ నీ చావు చూసి తట్టుకోలేక తాగుతున్నాను... నిజం.. నీకూ నాకూ మాత్రమే తెలిసిన నిజం. నీతోనే చచ్చిపోయిందన్న సంతోషంతో కాదు రమణా...'

మనసులో చోటు చేసుకుంటున్న పెనుభారం తీరినప్పటి రిలీఫ్‌తో బాటు నిలవనీయని గిల్టీ కాన్షియస్... తనని తాను మోసగించుకుంటూ... మనసుకు నచ్చచెప్పుకుంటూ... త్రాగుతూ...

'సార్ ఇప్పటికే ఎక్కువయింది' బేరర్ లేవదీశాడు.

మనసులో చీకటికి తోడు బయట కూడా చీకటి ముసురుకుంటోంది.

ఇంటి ముందు ఆటో దిగి గట్టిగా కేక పెట్టాడు. 'సావిత్రీ' అంటూ.

పరిగెత్తుకు వచ్చింది సావిత్రి.

"ఈ ఘోరం విన్నారా? మీ స్నేహితుడు రమణ రైలు కింద పడి ఆత్మహత్య చేసుకున్నాట్ట. వాళ్ళ ఇంటికి వెళ్ళి వచ్చాను. పరిమళ ఆస్పత్రికి వెళ్ళింది పాపం!" ఎర్రబడిన కళ్ళతో తూలుతున్న మొగుడి వాలకం గమనించి నోటి మీద చెయ్యేసుకుంది.

మొగుడికి చెయ్యి ఆసరా ఇచ్చి లోపలికి నడిపించింది. 'ఊళ్ళో పెత్తనాలన్నీ నీకే కావాలి. నువ్వెందుకు తగలబడ్డావ్ అక్కడికి?' కసురుకున్నాడు.

'నాన్నా! పరిమళ వాళ్ళ నాన్న చచ్చిపోయార్ట' తండ్రిని చూడగానే ఏడుపు గొంతుతో అంది అపర్ణ.

'ఎందుకా ఏడుపు? మీ నాన్న చావలేదుగా' ఆ పిల్లని అరచి, గదిలోకి వచ్చి మంచం మీద అడ్డంగా పడ్డాడు.

'ఎన్నడూ లేనిది ఏమైంది? ఈ తాగుడేమిటి?' గదిలోకి వచ్చి గొంతు తగ్గించి దబాయించింది సావిత్రి.

"నోరుముయ్యి... తలుపులు వేసి తగలడండి. రేపు నువ్వు గానీ, నీ కూతురు గానీ ఆ

ఇంటికేసి చూస్తే చంపేస్తాను. నేను చావమన్నానా వాడిని?" అరుపులు గొణుగులుగా మారి మత్తుగా వాలిపోయాడు.

ఇక ఆ రాత్రికి అన్నం తినడని అర్థమై, తానూ గ్లాసు మజ్జిగ తాగి వచ్చి పడుకుంది సావిత్రి.

అర్ధరాత్రి వేళ మెలకువ వచ్చి, చీకట్లో పక్కన తడిమితే దాసుకు పెళ్ళాం ఒళ్ళు మెత్తగా తగిలింది. ఒళ్ళంతా నిమిరి దగ్గరకు లాక్కున్నాడు.

"పక్క గదిలో పెళ్ళీడు పిల్లని పెట్టుకుని ఏమిటీ ఆగడం?" మొగుడి చెయ్యి తోసేసి, దూరం జరిగి పక్కకు తిరిగి పడుకుంది సావిత్రి.

దాసు రెండు చేతులతో ఆమెను చుట్టేశాడు. పాపం రమణ ఆస్పత్రిలో మార్చురీలో మంచుగడ్డలా పడి వుంటాడు. వాడి శరీరం కోసి, చూసి, కుట్టేసి, అక్కడ పడేసి వుంటారు. నేను నీ పక్కన వెచ్చగా... ఏడుస్తూనే, తోసేస్తున్న పెళ్ళాన్ని పశుబలంతో లొంగదీసుకున్నాడు.

మళ్ళీ నిద్రలోకి జారగానే....

ఒక కన్ను చితికిపోయి, మరో కంటి గుడ్డు బయటకు పొడుచుకు వచ్చి భయంకరంగా కనబడుతోంది. మొండెం లేని తల...

"నాన్నా ! నాన్నా" ఏడుస్తోంది అపర్ణ.

"ఎందుకింత అఘాయిత్యం తలపెట్టారండీ?" తల బాదుకుంటోంది సావిత్రి.

ఆ చితికిపోయిన ముఖం... మొండెం నుండి తెగి దూరంగా పడిన తల తనదే.

దిగ్గున లేచాడు దాసు.

ఒళ్ళంతా చెమటలు. పక్కన అలసిపోయి నిద్రపోతున్న సావిత్రి.

తనేం చేశాడో గభాలున గుర్తొచ్చింది. రమణ మార్చురీలో శవమై పడి వుంటే తను పెళ్ళాంతో.. ఛీ... సిగ్గుతో అతని మనసు చితికిపోతోంది.

కలలో కనిపించిన చితికిపోయి, కనుగుడ్డు ముందుకు పొడుచుకు వచ్చిన తన ముఖం గుర్తొచ్చింది.

"రమణా నేనురా చావాల్సింది. నువ్వు కాదు..." చేతుల్లో ముఖం కప్పుకుని ఏడ్చాడు నిశ్శబ్దంగా.

ఆర్నెల్లుగా ఒంటి మీద చెయ్యి వేయనివ్వని సావిత్రిని మందు మత్తులో బలవంతంగా... ఛీ... "సిగ్గు లేదూ? పెళ్ళాం మెళ్ళోని పుస్తెలతాడు తాకట్టు పెట్టిననాడే ఒట్టు పెట్టుకున్నా. అది విడిపించి తెచ్చిన రోజునే నా ఒంటి మీద చెయ్యి వేయండి" అని ఛీత్కరించిన సావిత్రి....

పక్క గదిలో వున్న కూతురికి రభస వినబడకూడదని ఒట్టు పక్కన పెట్టి ఒళ్ళప్పగించింది.... 'సారీ సావిత్రీ' గొణుక్కున్నాడు.

మళ్ళీ మత్తుగా నిద్ర ఒళ్ళోకి లాక్కుంది.

"అన్నయ్యా కట్నం బాకీ లక్షరూపాయలు ఈ వారం లోపు ఇవ్వకపోతే నన్ను పొమ్మంటున్నారు. పుట్టింట్లో మీ అన్న దగ్గరే పడి వుండు... అంటూ వాతలు..." ఫోనులో చెల్లెలి ఏడుపు.

"అన్నమాట ప్రకారం బాకీ తీర్చకపోతే వాళ్ళు యమదూతల్లా వచ్చి నా ప్రాణం తీస్తారు దాసూ... నీకోసం ... నీమీద నమ్మకంతో ధైర్యంగా అప్పు తీసుకుని ఇస్తున్నాను..." రమణ హెచ్చరిక.

"నాన్నా! నాన్నా! వీళ్ళెవరో నా చీర లాగేస్తున్నారు. నా బట్టలు చింపేస్తున్నారు..." అపర్ణ ఏడుస్తోంది.

చున్నీ గొంతుకు బిగించుకుని ఫ్యానుకు వేళాడుతోంది అపర్ణ. నాలుక వెళ్ళుకొచ్చి, కళ్ళు ముందుకొచ్చి శవమై....

కాదు కాదు అపర్ణ కాదు... పరిమళ. రమణ కూతురు పరిమళ.

"ఆ రౌడీలు అన్నంత పని చేశారా తల్లీ... అందుకే ప్రాణం తీసుకున్నావా?"

"రేపు సాయంత్రం లోగా కచ్చితంగా బాకీ మొత్తం తీర్చకపోతే నా కూతుర్ని నడివీధిలోకి లాగి గుడ్డలిప్పదీస్తామని అందరి ముందు బెదిరించి పోయారు దాసూ... నీ చెల్లెలి కాపురం కోసం అప్పు చేసి ఇచ్చాను. నా కూతురి మానం కాపాడు..."

"అమ్మా పరిమళా.." దిగ్గున లేచి కూర్చున్నాడు.

"చేసిన నిర్వాకం చాలు. అర్ధరాత్రి అంకమ్మ శివాలేంటి? పడుకోండి!" సావిత్రి నీరసంగా గొణిగింది.

దాసు కళ్ళు మూసుకుని పడుకున్నాడు. కలలో ఫ్యానుకి వేలాడుతున్న శవం కళ్ళ ముందు కదుల్తోంది.

అది పరిమళ ముఖమే. అపర్ణది కాదు. రమణ రైలు కింద పడి చచ్చిపోయాడు. తను బ్రతికే వున్నాడు.

నిజంగా బ్రతికే వున్నాడా? రమణ చావుతో, వాడు నోటు, పత్రం లేకుండా తనకిచ్చిన లక్ష రూపాయల అప్పు మాఫీ అయిపోయిందని సంతోషంగా నిశ్చింత చెందినప్పుడే తనూ చచ్చిపోయాడు.

"క్షమించు రమణా" నిద్రలో ఏడుస్తున్నాడు దాసు.

"నేను నోటు రాసిస్తాను రమణా, తీర్చకపోతే ఆ యమదూతలను నామీదకు పంపు".

"నోటెందుకు దాసూ? నీ మాటే సత్యం!"

అమ్మ పద్యం నేర్పుతోంది. "మాటకు ప్రాణము సత్యము, కోటకు ప్రాణము సుభట కోటి ధరిత్రిన్, బోటికి ప్రాణము మానము... చీటికి ప్రాణంబు వ్రాలు..."

"అమ్మా పరిమళ చచ్చిపోతోంది."

"ఆడదాని వుసురు వంశ నాశనం రా... నీకూ కూతురుంది."

"అమ్మా !" దాసుకు మెలకువ వచ్చింది.

"అమ్మ పెట్టెలో వెండి రూపాయలున్నాయి. వాటితో బాటు అమ్మవారి ముఖం చెక్కిన బిళ్ళ, బంగారుపూతతో పచ్చగా... పదహారు కళల అమ్మవారి ముఖం. అచ్చం అపర్ణ ముఖంలా... పరిమళ ముఖంలా.. వెండి కూడా ఖరీదే... ప్రాణమొక్కటే చవక... తాకట్టులో వున్న పుస్తెలతాడు అమ్మితే..." లేచి కూర్చున్నాడు దాసు.

చీకట్లో తడుముకుంటూ టార్చిలైటు వేసి మంచం క్రింద వున్న చెక్క పెట్టెను బయటకు మెల్లిగా లాగి తెరిచాడు.

అమ్మ పెట్టె... విరిగిపోయిన కళ్ళద్దాలు, చిరుగు పట్టిన పుల్లేటి కుర్రు చీరలు రెండు, అట్ట వూడిపోయిన లలితా సహస్రనామావళి పుస్తకం...అడుగున నాలుగో ఆరో వెండి రూపాయలు... అమ్మ పూజలో పెట్టినవి. కుంకుమ మెత్తుకుని... వాటితో బాటు అమ్మవారి ముఖం వున్న పచ్చని బిళ్ళ... అన్నీ చేతిలోకి తీసుకున్నాడు.

అమ్మవారిని చూస్తే అమ్మను చూసినట్టుగా... అమ్మ నేర్పిన పద్యం... రాత్రే కదూ చదివింది అమ్మ, 'మాటకు ప్రాణము సత్యము...'

తెల్లారగానే ప్యాంటు షర్టు తొడుక్కుని బయట పడ్డాడు.

మైలు దూరంలో వుంది రైలుకట్ట. రమణ మొండెం, తల పడిన చోట నల్లబడిన రక్తం మరకలు కనపడుతున్నాయి.

"రమణా! నా కోసం అప్పు చేసి, నేను తీర్చకపోతే నీ కూతురికి అవమానం జరుగుతుందని చచ్చిపోయావు. నన్ను క్షమించు" పట్టాల వెంబడి నడుస్తున్నాడు.

పది గంటలు దాటినట్లుంది. బజార్లో జనం గుంపులుగా సాగుతున్నారు.

షరాఫు బజారు దారి పట్టాడు. పుస్తెలతాడు తాకట్టు పెట్టిన షాపు అదిగో. సెట్టి చేతిలో వెండి రూపాయలు పోశాడు. "ఏమొస్తుంది సార్ వీటికి? మహా అయితే పన్నెండు వందలు అంతే..." డబ్బాలోకి విసిరాడు.

"అమ్మా క్షమించు. అమ్మవారిని అమ్మేస్తున్నా పరిమళ కోసం..." గొణుక్కుంటూ ఆ బిళ్ళనూ శెట్టికి ఇచ్చాడు. పూత బంగారానికి ఎంతిస్తాడు?

దానిని చూడగానే శెట్టి ముఖం వెలిగింది. గీటురాయి మీద గీసి చూశాడు. బిళ్ళను కళ్ళకద్దుకున్నాడు. "అపరంజి సార్.. మూడు తులాలు వుంటుంది" అన్నాడు.

"పుస్తెలతాడుకీ, దీనికీ కలిపి ఎంతొస్తుందీ?" దాసు గొంతు కంపించింది. "ఒక్కరోజు ముందు ఈ బిళ్ళ బంగారుదని తెలిసి వుంటే రమణ చచ్చిపోయేవాడు కాదు."

"పొద్దున్నే బోణీ బేరమని చెప్తున్నా... లక్ష కంటే రూపాయి కూడా రాదు.." రానున్న పదివేల లాభం కళ్ళ ముందు కదలుతుండగా పెదవి విరిచాడు శెట్టి.

"తీసుకున్న ఇరవై వేల మీద వడ్డీ కూడా కట్టలే."

"లక్ష... రమణా నీ బాకీ తీర్చేస్తాను. నీ కూతుర్ని ఎవరూ పల్లెత్తుమాట అనరు.."

డబ్బు జేబులో వేసుకున్నాడు. స్పృహ తప్పుతున్నట్టు వుంది. వెండి బిళ్ళ అనుకుని వెండి రూపాయలతో బాటు అమ్మ పెట్టెలో పడేసి వుంచాడు. అవమానం ఎదుర్కోలేక రమణ చచ్చిపోయాడు.

నోటు లేకుండా అప్పు ఇచ్చిన రమణ చావడంతో బాకీ మాసిపోయిందనుకుంటూ తనూ చచ్చిపోయాడు.

"అమ్మ సహాయంతో నీ అప్పు తీరుస్తున్నాను రమణా... చచ్చిపోయిన నేను బ్రతికాను.."

దాసు కళ్ళల్లో నీళ్ళొస్తున్నాయి. మనసు తేలికగా వుంది. తిన్నగా ఇంటికొచ్చి సావిత్రినీ, అపర్ణనీ వెంటబెట్టుకుని రమణ ఇంటికి వెళ్ళాడు.

పరిమళ ఏడుస్తూ దగ్గరకు వచ్చింది.

"అప్పులవాళ్ళెవరో వచ్చి బెదిరించి పోయారు అంకుల్" వెక్కుతోంది.

"వాళ్ళ సంగతి నేను చూసుకుంటాను తల్లీ... నువ్వు ధైర్యంగా వుండు. నాన్నకు రావాల్సిన డబ్బు ఆఫీసు నుండి వచ్చేలా చూస్తాను. నీకు ఫ్యామిలీ పెన్షను వస్తుంది. ఏదో ఒక ఉద్యోగం కూడా ఇస్తారు. భయపడకు" పరిమళ తల నిమిరాడు.

చివరి ప్రయాణానికి సిద్ధంగా వున్న రమణ వైపు చూశాడు.

రమణ రెండు కళ్ళూ మూసి వున్నాయి. ముఖం తుడిచి శుభ్రం చేసినట్టున్నారు. రమణ ముఖం ప్రశాంతంగా వున్నట్టు కనపడింది. 'నాకు తెల్సురా... నువ్వు నా స్నేహితుడివని' అంటున్నట్టు... దాసు మనసు కాస్త కుదుటపడింది.

అపర్ణ, సావిత్రి దాసు వైపు ఆశ్చర్యంగా చూస్తున్నారు. కొత్త మనిషిని చూసినట్టు.





90597 79289

# సాగర మథనం

రంగనాథ రామచంద్రరావు

'వెలుగు చీకట్ల భ్రమణంలో రోజు మరో రోజుకు గతమౌతూ కాలగతిలో అంతరించిపోతుంది కదా! గతానికి ఆనవాళ్ళు కూడా దొరకవు... ఒకోసారి' అని అనిపించింది-అప్పుడప్పుడే చీకటి దుప్పటిలోంచి బయటపడిన మా ఊరి అర్ధనగ్న రూపాన్ని చూస్తూ నెమ్రూ రోడ్డులో నడుస్తున్న నాకు.

ఎన్నో ఏళ్ళ క్రితం దూరమైపోయిన ఈ పరిసరాలను పరిచయం చేసుకుంటూ మెల్లమెల్లగా నడుస్తూ ఉంటే నాలోనూ ఏవేవో నడవసాగాయి.

ఈవాళ నన్ను చూసి నానమ్మ ఎంతగా సంతోషపడుతుందో? తలుచుకుంటూ ఉంటేనే ఎంతో ఆనందంగా ఉంది. అయితే నాన్న!? ఏమంటాడో? నాన్న గుర్తు రాగానే...

లోలోపల సన్నగా వొణుకు పుట్టుకొస్తున్నట్టుగా ఉంది.

అప్పుడప్పుడు గతం గుర్తుకు తెచ్చుకుంటే వర్ణించలేని భయం గుండెలోంచి తన్నుకు వచ్చేది. అయినా అందర్నీ ఒకసారి చూసి పోవాలనిపించింది. పద్నాలుగేళ్ళు ఒంటరిగా, ప్రేమానురాగాలకు, మమతానుబంధాలకు దూరంగా వెలివేసినవాడిలా రాతి గోడల మధ్య బ్రతకటంతో విసిగి వేసారి పోయిందీ ప్రాణం. అందుకనే తిట్టినా తిట్టనీ, కొట్టినా కొట్టనీ ఏది ఏమైనా కానీ అని ఇక్కడికి బయలుదేరాను నేను.

నా ఆలోచనకు అంతరాయంగా గణగణ శబ్దంతో ప్రక్కనుంచి సైకిల్ రిక్షా సర్రున జారిపోయింది. ఎందుకైనా మంచిదనుకుని ఫుట్‌పాత్ మీదుగా నడవసాగాను. నాతో పాటు ఆలోచనలు...

ఫుట్‌పాత్ మీద పడుకున్న కుక్కపిల్ల తోక తొక్కానేమో కుయ్యోమంటూ లేచింది. చటుక్కున వో గెంతు గెంతాను. చిన్నప్పటి నుంచీ నాకు కుక్కలంటే చాలా భయం. వాటిని చూస్తే అటు నుంచి అటే పరుగు తీసేవాణ్ణి. అప్పుడు...

"అరే ఆగు, ఆగమంటుంటే. అంత వేగంగా పరుగెడితే నేనెలా నిన్నందుకునేది. ఆగు ఆగు" అంటూ మాధవి కేకలు పెడుతూ నా వెనకాలే పరిగెత్తుకుంటూ వస్తుండేది. ఆ వీధి దాటి మరో వీధిలోకి అడుగు పెట్టాక కానీ ఆగేవాడిని కాను. ఆగి వెనక్కి తిరిగి చూస్తే పాతిక గజాల దూరంలో పరికిణీ ఎత్తి పట్టుకుని పరిగెట్టుకుంటూ వచ్చే మాధవి కనిపించేది. అందాల నా చిన్ని స్నేహితురాలిని చూసేసరికి నాలో పేరుకున్న కుక్క భయం మెల్లమెల్లగా కరిగిపోయేది. ఆ తరువాత ఇద్దరం కలిసి ఇళ్ళకు వెళ్ళిపోయేవాళ్ళం.

మళ్ళీ పొద్దు పొడిస్తే చాలు ! చద్దన్నం తినటం, పుస్తకాల సంచి భుజానికి తగిలించుకుని మాధవి వాళ్ళింటికి పరుగెత్తడం, నేను చేసే తొందరకు సగం అన్నంలోనే చేయి కడిగేసుకుని వాళ్ళమ్మగారు కేకలేస్తున్నా నా వెంబడి పరుగుతీసేది. బడికి వెళుతూ 'మారెమ్మ గుడి' వెనకాల ఉన్న బంకపళ్ళ చెట్టెక్కి కావలసినన్ని పళ్ళు కోసుకుని బడికి బయలుదేరేవాళ్ళం. దారిలో ఎవరైనా ముసలాళ్ళు మా కళ్ళబడితే మాకు పండుగే. తింటున్న బంక పళ్ళ విత్తనాన్ని చప్పుడు కాకుండా ఊసేవాణ్ణి. అవి సద్దు కాకుండా వాళ్ళు తొడుక్కున్న బట్టలకు అతుక్కుపోయి, అది వాళ్ళు గమనించకుండానే వెళ్ళిపోతూ ఉంటే ఏదో రాజ్యాన్ని గెలుచుకున్నంత సంతోషంతో మాధవిని గిల్లి ఆ దృశ్యాన్ని చూపిస్తూ కిసుక్కున నవ్వేవాడిని. నేను గిల్లినందుకు కోపం వచ్చినా ఆ దృశ్యాన్ని చూసి పకపకా నవ్వేసేది.

అబ్బా! అదంతా ఇప్పుడు తలుచుకుంటూ ఉంటే వొళ్ళంతా కితకితలు పెట్టినట్టుగా ఉంది. ఎంత మధురమైనవా గడియలు! మళ్ళీ ఆ సమయం తిరిగి వస్తుందా? ఇప్పుడు మాధవి ఎలా ఉందో? నన్ను... నన్ను గుర్తుపడుతుందా? పలకరిస్తుందా? బంకపళ్ళు కోసిస్తే తీసుకుంటుందా? అలా కాక తన పెద్దపెద్ద కళ్ళల్లో నాపై కోపాన్ని, అసహ్యాన్ని నింపుకుని చూస్తుందా? ఒకవేళ అలాంటి పరిస్థితి ఎదురైతే ఎలా?...

నా దగ్గర జవాబు లేని ప్రశ్న.

మనస్సు బాధగా మూల్గింది.

నడుస్తూ ఎం.జి. బ్రదర్స్ వర్క్‌షాప్ దగ్గరికి వచ్చాను.

అయితే అక్కడ ఆ వర్క్‌షాప్ స్థానంలో 'భీమాస్ రెసిడెన్సీ' పేరున్న ఓ పెద్ద భవనం

ఠీవిగా నుంచోనుంది. ఎడమ వేపున చూస్తే 'బెంగళూర్ అయ్యంగార్ బేకరి' బోర్డు కనిపించింది. చిన్నప్పుడు నేను పాలు పోయించుకుందుకు ఇక్కడికి వస్తున్నప్పుడు చూసిన బోర్డులా లేదు. అప్పుడు అక్కడ ఏదో హోటల్ ఉండేది.

ఆలోచించాను.

గుర్తుకు రాలే.

అయితే అప్పుడు ఆ హోటల్ ప్రక్కన సన్నగా ప్రవహిస్తున్న కాలువ మాత్రం ఇంత విశాలంగా ఉన్నట్టు లేదు. ఇప్పుడు కొంచెం విశాలంగా మారినట్టు ఆ కాలువలోంచి వచ్చే వాసనను పీలుస్తూ వాటి అలలపై సంచరిస్తూ ప్రాణాల్ని నిలబెట్టుకుంటున్న ఈగలు, దోమలు అరచి అరచి చెబుతున్నట్టుగా అనిపించింది.

ఆ ప్రక్కనే ఉన్న సందులో నేను అఆలు దిద్దుకున్న బడి ఉన్నట్టు గుర్తుకొచ్చింది. నిలబడి అటువేపు చూశాను. బడి గోడలు ఎక్కడికక్కడ పడిపోయి దిగులుగా నావేపు చూశాయి. సానుభుతిగా చూసి మళ్ళీ ముందుకు అడుగులు వేయసాగాను.

'వెంకన్నబావి' దగ్గరవుతుంటే ఎందుకనో ఓ విధమైన ఉత్సాహం పొంగుకు వచ్చింది.

ఎవరో వెంకన్న పంతులు అనే ఆయన ఈ బావిని కట్టించాడట. ఇందులో ఏడు చిన్నచిన్న బావులు ఉన్నాయని పిల్లలం అనుకుంటూ ఉండేవాళ్లం. ఓ సారి బావి పూడుకుపోయినపుడు మునిసిపాలిటీవారు బావిలోంచి పూడిక తీయిస్తున్నప్పుడు, అందులోంచి తీసివేస్తున్న బురదలో ఏమైనా దొరుకుతాయేమోనని పిల్లలంతా బురదలోపడి వెతికేవాళ్లం. నాకు ఓ చిన్న ఇత్తడి శివలింగం దొరికితే గప్‌చిప్‌గా వెళ్ళి నాన్నకు ఇస్తే –'అప్పుడెప్పుడో చాలా ఏళ్ళ క్రితం హిందువులు ముసల్మానులు కొట్టుకుని వాళ్ళ వస్తువులు వీళ్ళు, వీళ్ళ వస్తువులు వాళ్ళు ఇందులో పారవేసుకున్నారని; ఈ శివలింగం అందులోనిదే కావచ్చు'అని నానమ్మ నాన్నతో అనటం లీలగా గుర్తుకు వస్తూ ఉంది.

చిన్న సందు.

తిరగాలి.

తిరిగాను.

సగానికి పడిపోయిన గోడ.

ఆ చిన్ని మొండి గోడ మీద చిన్న బాల్చిలో తులసి.

అది బ్రాహ్మణుల ఇల్లు. ఆ ఇంటికి ఎదురుగా పెద్ద గుమ్మం. ఆ గుమ్మంలోంచే వెళ్ళాలి. నాలుగు ఇళ్ళ లోగిలి. ముందు భాగంలో ముసల్మానులు ఉండేవారు. వెనుక భాగంలో మేముండేవాళ్లం. పక్కన ఉన్న రెండు భాగాల్లో ఒకదాన్లో మరాఠీ కుటుంబం, మరో భాగంలో దర్జీవాళ్ళ కుటుంబం ఉండేది.

పెద్ద గుమ్మం దాటి అడుగు లోపలికి పెడుతూ ఉంటే భయం, ఆరాటం, ఆశ్చర్యం, ఉత్సాహం కలగాపులగంగా నన్ను చుట్టుముట్టసాగాయి. మూకుమ్మడిగా నా మీద దాడి చేస్తున్న ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరవ్వసాగాను.

ముసల్మానులు ఉండే ఇంటిని సమీపిస్తుంటే అస్పష్టమైన రూపాలేవో కళ్ళ ముందుకు తోసుకురావటానికి విఫల ప్రయత్న చేశాయి. ఓ క్షణం అక్కడే నిలబడి ఆ ఇంటి వేపు చూశాను. మట్టి మొండిగోడ ప్రక్కన అంట్లు తోముతున్నామె తలెత్తి నావేపు ప్రశ్నార్థకంగా చూసింది. నేనేమీ మాట్లాడలే. ఏదో గుర్తుకు తెచ్చుకోవటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాను. ఎవరో గుర్తుకు రాలే. మాట్లాడకండా ప్రక్కకు తిరిగి ముందుకు నడిచాను.

ఆ ఇల్లు దగ్గరవుతుంటే ఎందుకో నా గుండె మరింత వేగంగా కొట్టుకోసాగింది. ఒంట్లో ఏదో చెప్పలేని వొణుకు.

కళ్ళ నిప్పులు రాల్చుతూ నుంచున్న నాన్న, భయంతో, దిగ్భ్రాంతితో చూసే పిన్ని, మూలలో ఏడుస్తున్న నాన్నమ్మ...

కళ్ళు చించుకుని చూశాను. కళ్ళు బైర్లు కమ్మినట్టయ్యింది.

అక్కడ ఎవరూ లేరు. అంతా నా భ్రమ!

ముందు గోడలే కనిపించలే. ఎదురుగ్గా ఓ పాక!

అడుగు ముందుకు వేశాను. సందేహం లేదు– గోడల్లేని ఆ పాకలో పశువులను కట్టివేశారు.

నా కాళ్ళ కింద భూమి గిర్రున తిరుగుతున్నట్టు అనిపించింది.

నా కళ్ళు చూసేది నిజమేనా? నా కళ్ళకేం కనిపిస్తోంది? నేనేమి చూస్తున్నాను? ఆ ఇల్లేమైంది? ఆ ఇంట్లో నివసించే వాళ్ళు ఎక్కడికి పోయారు? ఏమైపోయారు? ఇది ఎందుకిలా ఉంది? ఈ విధంగా మారిపోవటానికి ఎవరు కారకులు? ఒకవేళ నేనే ఇందుకు కారకుడినా?

ముందుకు ఆలోచించడానికి చేతకాని మనస్సుతో భారంగా నిట్టూర్పు విడుస్తూ వెనక్కి తిరిగాను.

నాకు నేనే భారమౌతున్నట్టుగా ఉంది. అడుగులు ఎత్తెత్తి వేస్తున్నాను. నా మీద దాడి చేస్తున్న ప్రశ్నలను అడ్డుకునే శక్తి నాకు లేదు. వాటికి సమాధానాలు నా దగ్గర లేవు.

అంట్లు తోముతున్న సద్దును దాటి ముందుకు నడుస్తున్నాను.

సద్దు ఆగింది. నా అడుగు ముందుకు పడలే.

“బేటా... ”

చివ్వున వెనక్కి తిరిగాను. ఆ కంఠస్వరాన్ని నేనెలా గుర్తుపట్టకుండా ఉండగలను? కళ్ళు వెడల్పు చేసుకుని ఆమె వేపు చూస్తున్నాను. సందేహం లేదు. మా... బడీమా...

నాకు తెలియకుండానే, నేను పిలవకుండానే నా కళ్ళల్లోంచి కన్నీళ్ళు త్రోసుకొస్తున్నాయి.

నేను ఆమెనే తదేకంగా చూస్తూ నుంచున్నాను. ఆమె నా దగ్గరికి వచ్చి నా చేయి పట్టుకుని అడుగుతూ ఉంది. 'కబ్ ఆయా బేటా? కైసా హో బేటా? ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు మున్నా?'

సమాధానాలు తెలిసినా చెప్పలేని అసహాయ స్థితి. మౌనంగా కన్నీళ్ళు కారుస్తూ ఆమెనే చూస్తున్నాను.

నన్ను నేను గుర్తు పట్టలేని, నేనేం చేస్తున్నానో నాకే తెలియని నా చిన్నతనంలో జరిగిన విషయాలు కాసింత పెరిగి పెద్దయ్యాక విన్నవి హఠాత్తుగా గుర్తుకు వస్తున్నాయి.

అప్పట్లో అమ్మ రాట్నం తిప్పేదానికి వెళ్ళేదట. దారపు కండెలు ఇన్ని వొడికితే ఇంత డబ్బు అని ఇచ్చేవాళ్ళట. అమ్మ నన్ను అన్నయ్య దగ్గర వొదిలి అలా వెళ్ళినపుడు నేను ఒక్కొక్కసారి ఆకలితో ఏడుస్తూ ఉంటే ఈమె నాకు పాలు పట్టేదట. నేను పాలు తాగుతూ ఆమె వేపే చూస్తూ ఉంటే 'ఆకలా బేటా' అంటూ నన్నలానే ఎదకు హత్తుకునేదట.

"మా ! బడీమా !" నాకు తెలియకుండానే నా పెదాలు పలవరిస్తున్నాయి.

"బేటా" అంటూ ఆమె నన్ను గట్టిగా కౌగిలించుకుంది.

అది ఆనందమా? సంతోషమా? దుఃఖమా? నాకు తెలియదు.

నా కళ్ళల్లోంచి కన్నీళ్ళు జారిపోతున్నాయి. ఆమె కన్నీళ్ళు నా పాపాన్ని కడిగేస్తున్నట్టు నా వీపును తడిపేస్తున్నాయి.

"కౌన్ హై గే" అంటూ వినవచ్చిన మాటలకు బడీమా చేతులను విడిపించుకుని పక్కకు చూశాను.

బాగా నడుము వొంగిపోయిన ముసలాయన. ఆ పొడుగాటి గడ్డం, పొడుగు ముక్కు చూస్తుంటే అతడ్ని బడీమా భర్తగా గుర్తించడానికి నాకెంతసేపో పట్టలేదు. కన్నీళ్ళు తుడుచుకుంటూ 'బడీమా' వేపు చూశాను. ఆమె కొంగుతో కళ్ళొత్తుకుంటూ—

"ఆప్‌కో యాద్‌హై... బహుత్ సాల్ కే పీచే కృష్ణమూర్తి భయ్యా పీచేవాలీ ఘర్‌మె తేనా... ఉన్‌కా చోటా బచ్చా... " నన్ను చూపిస్తూ కళ్ళు దించుకుని తడబడుతూ ఆమె చెబుతూ ఉంది.

కళ్ళెత్తి ఆమెను చూడలేకపోయాను. గుండెలో ఇనుప కవ్వాన్ని పెట్టి చిలికినట్టయ్యింది.

"ఎక్కడ బేటా... ఎక్కడ ఉన్నావు?" తడుముకుంటూ అతను నా దగ్గరకి వచ్చాడు.

దగ్గరగా నిలబడ్డాను. నా వొళ్ళంతా తడుముతూ "ఎంత పెద్దవాడివై పోయావు బేటా, ఇప్పుడు మీ వాళ్ళే ఉండి ఉంటే... "

నా శరీరంలో వంద డైనమైట్లు వొక్కసారే ఫెటిల్ ఫెటిల్‌మని పేలినట్టయ్యింది.

'ఎందుకిలా అయ్యింది? ఎందుకిలా?' అని గట్టిగా అరవబోయే నా నోరు నొక్కేస్తూ కోడి గొంతు చించుకుని గట్టిగా అరిచింది.

* * * * *

గాఢ నిద్ర–

నిద్రలో కల –

కల–

మండే ఎండ.

పడిపోయిన ఇల్లు.

ఇంటి ముందు జడలు విప్పుకున్న మర్రిచెట్టు. చెట్టు కొమ్మ మీద గ్రద్ద. ఇంటి చూరులో నివాసం ఏర్పరచుకున్న పిచ్చుకల సంసారం. ఆకలితో ఎర్రటి నోళ్ళు తెరిచి అరుస్తూ బయటికి వచ్చిన పిచ్చుక పిల్లల్ని అవకాశం కోసం ఎదురు చూస్తున్న గ్రద్ద చప్పున ఎగిరొచ్చి వాటిని నోటితో కరుచుకుని ఆకాశంలోకి ఎగిరిపోయింది. కొంత సేపటికి గూటికి తిరిగి వచ్చిన తల్లి పిచ్చుక ఖాళీగూడును చూసి హృదయవిదారకంగా ఏడ్వసాగింది. అయ్యో...

ఎవరో కదపటంతో కల గొలుసు ఎక్కడికక్కడ తెగిపోయి అగుపించని లోకాలలోకి జారిపోవటంతో మెలుకువ వచ్చి కళ్ళు నులుముకుంటూ చూశాను.

“ఏం బేటా ! నిద్దట్లో పాడుకలగానీ వచ్చిందా?” అంది బడీమా.

“అవును బడీమా” అంటూ విచిత్రమైన ఆ కల గురించి ఆలోచిస్తూ లేచి స్నానాలగది వేపు అడుగులు వేశాను. ముఖం, కాళ్ళు చేతులు కడుక్కుని సంచిలోని తుండుగుడ్డతో తుడుచుకుంటూ వంటింట్లోకి వచ్చాను. పట్టపగలే చీకటిగా ఉన్న గది. ఇంటికప్పుకు ఉన్న గవాక్షం నుంచి లోపలికి ప్రవేశిస్తున్న సన్నటి వెలుతురు కింద పొయ్యి ముందు కూర్చోనుంది బడీమా. నన్ను చూడగానే కూర్చునేందుకు చెక్కపీట వేసింది. మసిపట్టిన ఆ గది గోడలను చూస్తూ కూర్చున్నాను. కూర్చున్నానన్న మాటే గానీ మనసు మనసులో లేదు. ఏదో అడగాలని మనసు ఆరాటపడుతూ ఉంది. కానీ ఏమడగాలో అర్థం కావటం లేదు. అడిగిన ప్రశ్నలకు వచ్చే సమాధానాలు ఎలా ఉంటాయోననే సందేహంతో, భయంతో మౌనంగా కూర్చుని పొయ్యిలోని మంటకేసి చూస్తూ ఉన్నాను. నా మనసు ఆ పొయ్యిలానే ఉంది.

చివరికి ఏదైతే అది కానీలెమ్మని అడగటానికి ఆమె వేపు తిరిగాను. అప్పటిదాకా నా మనసులో గింగురులు తిరుగుతున్న ప్రశ్న నా నోటి నుంచి తటాలున తోసుకుని వచ్చింది–“మా వాళ్ళంతా ఎక్కడున్నారు?”

అడగాలనుకున్నది అడిగేశాను. ఎలాంటి జవాబు వస్తుందోనన్న భయంతో నా శరీరం బిగుసుకుపోతున్నట్టుగా అనిపించింది.

ఆమె నా వేపు బాధగా చూసి పొయ్యిలోంచి ముందుకు తోసుకొచ్చిన మంటను లోపలికి నెట్టసాగింది.

నా మనసంతా అల్లకల్లోలంగా మారింది. ముందుకు ఆలోచించలేకపోయాను. ఆలోచించటానికి చేతకాలేదు. ఆలోచించకుండా ఉండటం ఉత్తమమేమో?

నా ఆలోచనలను చెదరగొడుతూ సన్నటి రుద్ధ స్వరంతో– “విని మాత్రం ఏమి చేయగలవు బేటా?” అందామె.

నేను వినలేనా? నేను వినలేనంతటి సంఘటనలు జరిగిపోయింటాయా? నేనేమీ చేయలేనా?

“నీవు జైలుకు వెళ్ళిన నెల తిరక్కుండానే మీ నానమ్మ చనిపోయింది. మీ నాన్న ఊరు విడిచిపోయాడు. మీ పిన్ని, అప్పటికామె కడుపుతో ఉంది. ఓ చిన్న మూటతో వెళ్ళింది. మళ్ళీ తిరిగి రాలే. ఇప్పుడు ఈ ఊర్లోనే ఉందని విన్నా ...” ఆమె చెబుతూనే ఉంది.

నా చెవులు, తల మొద్దుబారిపోయాయి. ఏమీ వినపట్టం లేదు. కళ్ళ ముందు ఉన్నదంతా గిర్రున తిరుగుతున్నట్టుగా ఉంది. నన్ను నమిలి మింగేలా నా కళ్ళ ముందుకు వచ్చి నిల్చున్న ప్రశ్న–దీనికంతటికీ కారకున్ని నేనేనా?

నేనే అయితే –

భగవంతుడా ! నాకేమిటి శిక్ష?

* * * * *

ఆమె ద్వారా విన్న విషయాలు నన్ను దహించి వేయటంతో జ్వరం వచ్చిన వాడిలా ఒక రోజంతా పడకనే అంటుకుని ఉండిపోయాను. ఈవాళెందుకో మాధవి గుర్తుకు రావటంతో కోల్పోయిన శక్తి తిరిగి వస్తున్నట్టుగా అనిపించింది. గబగబా లేచి కాలకృత్యాలు ముగించి ఇంటి నుంచి బయటపడ్డాను. కొబ్బరి చెట్టున్న వీధిలోని పిండిమిల్లు దగ్గరికి వచ్చేసరికి అనుకోకుండా నా కళ్ళు రోడ్డుకు అటువేపున్న టీ కొట్టు కోసం వెదికాయి. టీ కొట్టుకు మారుగా ‘హలో బ్రదర్ హెయిర్ కటింగ్ సెలూన్’ కనిపించింది.

అప్పుడున్న టీ కొట్లో నల్లగా, ఎర్రటి కళ్ళతో ముఖాన కుంకుమ బొట్టుతో ఒకతను ఉండేవాడు. అతనికి మంత్రాలు వస్తాయని, మా ఇంటి వెనకాతల ఉన్న చింతచెట్టు మీదున్న ఆడ దెయ్యాన్ని పట్టుకుని సీసాలో బంధించి శ్మశానంలో పాతిపెట్టాడని అందరూ అనుకునేవాళ్ళు. తేలు, పాము కాటు వేస్తే మంత్రం వేసి బాగు చేస్తాడనేవారు.

ఓ రోజు అమ్మను తేలు కరిచేసరికి అతను వచ్చి ఏవేవో మంత్రాలు చదివాడు. ఆ తరువాత దణ్ణాలు పెట్టి నీళ్ళు నములుతూ వెళ్ళిపోయాడు. ఆవాళ ఇంటి కప్పునే పీకేసేలా ఎందుకనో అందరూ ఏడ్చారు. అమ్మ నాతో మాటాలాడ్డం లేదని నేనూ గట్టిగా ఏడుస్తూ నేలంతా దొర్లాను. చావంటే ఏమిటో తెలియని వయస్సులో పోగొట్టుకున్న అమ్మ గుర్తుకు రావటంతో కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. చప్పున తల దించుకుని కళ్ళు తుడుచుకుంటూ గబగబా అడుగులు ముందుకు వేయసాగాను.

వెంకన్నబావి దగ్గరికి వచ్చేసరికి అక్కడ చిన్న చిన్న పిల్లలు చొక్కాలు, లాగులూ లేకుండా బావి కట్టపై నుంచి నీళ్ళలోకి దూకుతుండటం, మరికొందరు పెద్దపెద్ద బండరాళ్ళపై పడుకుని సూర్యుని వేడికి తడిసిన వొళ్ళు ఆరబెట్టుకుంటూ ఉండటం చూస్తుంటే మనస్సు కాస్సేపు చిన్ననాటి ఆకర్షణల వేపు పరుగెట్టింది.

'ఠంగ్, ఠంగ్'మని బిందెల శబ్దానికి ఈ లోకంలోకి వచ్చి చూస్తే బావికి కుడిపక్కన ఉన్న వీధి కొళాయి దగ్గర నీళ్ళ కోసం ఒకర్నొకరు తోసుకుంటున్న ఆడవాళ్ళు కనిపించారు. వాళ్ళను దాటుకుని 'మున్సిపల్ ప్రసూతి నిలయం' దాటి పక్కనున్న సందులోకి తిరిగాను. జమ్మిచెట్టు కట్ట పక్కన ఉన్న ఇల్లే మాధవి వాళ్ళది. ఆ ఇంటి ముందు ఆగిపోయాను. అదే సమయంలో తలుపులు తెరుచుకుని బయటికి వచ్చిన ఓ మధ్య వయస్కుడు నా వేపు తేరిపార చూస్తూ "ఎవరు ? ఎవరు కావాలి?" అన్నాడు.

"నేను..." సిగ్గుతో మాట మింగేశాను.

నా వేపు గుర్రుగా చూస్తూ "ఎవరయ్యా నీవు?" కొంచెం రెట్టిస్తూ అడిగాడు.

"నేను కృష్ణమూర్తిగారి అబ్బాయిని. మాధవి..." అతడ్ని సంకోచంగా చూస్తూ మెల్లగా అన్నాను.

"అంటే... ఓహ్ ! నువ్వేనన్న మాట. హత్య చేసి జైలుకు పోయిన మొగాడివి" హఠాత్తుగా అతనన్నాడు.

మొహం మీద ఉమ్మేసినట్టయ్యింది.

"నేను పనికిరాని మగవాణ్ణి కాదయ్యోయ్. దీనితోటి నీ ఇష్టమొచ్చినట్టు తిరిగితే అసలు విషయం తెలియక చేసుకున్నా. దాని మనసులో నీవే ఉన్నావని తెలిశాక ముండలా ముసుగేసుకుని కూర్చోటానికి నేనేమైనా వెర్రిబాగులోడినా? నిన్ను చూసిన కంటితో నన్ను చూస్తుందేమిటి. తన్ని తగలేసినా? ఇలాంటి ముండలకు ఆ దిక్కుమాలిన వెంకన్న బావొకటి ఉందిగా. దాన్నే చూసుకుందా ముండ! దాని పీడ వొదిలించుకుని దాని చెల్లెల్నే చేసుకున్నా..."

అతనింకా ఏదో చెబుతూ కాండ్రించి ఉమ్ముతూనే ఉన్నాడు. పదునైన కత్తితో నా గుండెను కోస్తున్నట్టుగా ఉంది.

నేనెలా అడుగులు వేస్తున్నానో నాకే తెలియదు.

మాధవికి పెళ్ళయ్యిందా? ఇతన్నా ఆమె చేసుకుంది? ఆమె ఇక లేదా? నా స్నేహితురాలు కావటం ఆమె నేరమా? ఆమె చావుకు నేను కారకుడినా? భగవంతుడా నేనింకా ఎందుకు బ్రతికి ఉన్నాను?

* * * * *

మట్టిపాత్రలా పగిలి ముక్కలైన మనస్సును అతికించేందుకు వ్యర్థప్రయత్నం చేస్తున్నాను.

నిజమే! ఏ బంగారమో లేక ఏ ఇత్తడో అయితే దాన్ని అతికించడానికి ఏ రసాయనాన్నైనా సహాయానికి తీసుకోవచ్చు. అయితే ముక్కలైన మనస్సును అతికించేందుకు ఇంతవరకు ఎవ్వరూ ఏ రసాయనాన్ని కనిపెట్టలేకపోయారు. అయ్యో భగవంతుడా? హూ! భగవంతుడు! ఎక్కడున్నాడు? ఉంటే ఇంత క్రూరుడా? చిన్నతప్పులకు ఇంత పెద్దశిక్షలా?అదీ తప్పులు చేయనివారికీ శిక్షలా?

బర్రుమని కారు దుమ్ము రేపుకుంటూ ప్రక్కనుంచే దూసుకుపోయింది.

కుడి పక్కకు తిరిగాను.

'మారెమ్మ గుడి' కనిపించింది.

ఒక్క క్షణం ఆలోచించి తలుపుల దగ్గరికి వెళ్ళి నిలబడ్డాను.

తాళం వేసినా, తలుపులకున్న ఊచల సందుల్లోంచి చిన్న కుంటలో ఉన్న దేవతావిగ్రహం లీలగా కనిపించింది. ఏదో గుర్తుకు వచ్చినవాడిలా చేతులు జోడించాను. నాకు తెలియకుండానే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

'తల్లీ ! పిన్ని ఇక్కడే ఉందని తెలిసింది. వెళుతున్నాను. తప్పెవరిదో ఆమే తేల్చాలి. నేను చేసింది నేరమా కాదా అన్నదీ ఆమే చెప్పాలి. కేవలం ఆమె మాత్రమే చెప్పగలదు. బడీమా సేకరించిన విషయాలు విన్నప్పటి నుంచి ఆమె దగ్గరికి వెళ్ళాలని నా మనసు తహతహలాడుతోంది. మా జీవితాలకు దారి నీవే చూపాలి తల్లీ' నా మనసు అతి దీనంగా వేడుకుంది.

ఇరుకైన మురికి సందులో మెల్లగా నడుస్తూ నా లోపలికి దృష్టి సారించాను.

అస్పష్టంగా ఉన్న పిన్ని రూపం హృదయఫలకం మీద స్పష్టంగా కనిపించసాగింది.

ఎంత అందమైంది పిన్ని! తెల్లగా, అందంగా ఉండే పిన్నిని చూస్తే ఏదో తెలియని ఆనందం మనసును కమ్ముకునేది.

అమ్మ పోయిన తరువాత నాన్న పిన్నినే చేసుకున్నాడు. తల్లి లేని నన్ను బాగా ముద్దు చేసేది. పక్కన పడుకోబెట్టుకుని ఎక్కడెక్కడో చూసినట్టు అందమైన రాజకుమారుల–రాజకుమార్తెల కథలు చెప్పేది. కళ్ళకు కట్టినట్టు ఎంతో అందంగా చెప్పేది.

అయితే ఆమె చెప్పిన ప్రతీ కథలోని రాజకుమారి ఆమే అనిపించేది.

అలా ఆమె సాంగత్యంలో–

ఆనందంగా, ఆహ్లాదంగా గడిచిపోతున్న కాలంలో నాలో దొంగలా యవ్వనం ప్రవేశించింది.

తుఫానులా నిలువెల్లా కంపింపజేసింది. నా నరనరాలను కదిలించింది.

నాలో శారీరకంగా, మానసికంగా జరుగుతున్న మార్పులకు నాకెంతో ఆశ్చర్యంగా ఉండేది.

కంగారుగా ఉండేది.

భయంగానూ ఉండేది.

ఏదోలా ఉండేది.

ఏదేదో చేసేయాలనిపించేది.

ఒకరోజు...

దబ్బుమని ఏదో కాలికి తగిలి ముందుకు తూలి పడబోయి బలవంతంగా నిలద్రొక్కుకుని చూశాను. పశువులను కట్టివేసేందుకని నేలలో పాతిన కొయ్య. తలెత్తి ముందుకు చూశాను. ఒక్కసారి ఒళ్ళు జలదరించింది. బడీమా చెప్పిన ప్రకారం ఇదే ఇల్లు.

గొంతు తడారిపోతున్నట్టుంది. సన్నగా వొణుకుతున్న కాళ్ళతో భయంభయంగా ఆ ఇంట్లో అడుగు పెట్టాను.

మసక చీకటి కమ్ముకున్నందున గోడవారన వేసిన నులక మంచం మీద ఎవరో పడుకుని ఉన్నట్టు అస్పష్టంగా కనిపించింది.

ఆమెనా? ఆమే అయితే ఎందుకలా పడుకుని ఉంది?

అంతలో గదిలో వెలుతురు పరుచుకోవటంతో తల తిప్పి చూశాను.

గోడకున్న చిన్నిగూడులో దీపాన్ని పెట్టి ఇటు తిరిగి నన్ను చూడటంతో ఆశ్చర్యంతో, భయంతో కళ్ళు పెద్దవి చేసుకుని నన్నే చూస్తూ ఉండిపోయిందా పాప. అక్కడక్కడ చిరుగులు పడి మాసిపోయిన పొట్టిచోళీ, లంగాతో బలహీనంగా ఉన్నా చక్కగా ఉంది.

"ఎవరూ?" హీనస్వరం వినిపించి తల తిప్పాను.

మంచానికి అతుక్కుపోయిన శవాకారంలా ఉందామె.

గుంటలు పడి లోతుకు పోయిన కళ్ళతో నా వేపు తీక్షణంగా చూస్తోందామె.

నాకు తెలియకుండానే ఓ అడుగు వెనక్కు వేశాను.

"నీవు... నీవు... నీవేనా?" ఆమె హఠాత్తుగా అడిగింది.

నాలో వంద రకాల భావాలు ఉవ్వెత్తున ఎగిసిపడ్డాయి.

కొద్దిసేపు భయంకరమైన మౌనం మా మధ్య అడ్డుగోడలా నుంచుంది.

"ఈ పాపిష్టిదాన్ని చూడటానికి ఎందుకు వచ్చావు?"

ఎవరు పాపిష్టివాళ్ళు? ఏది పాపం? శరీరంతో చేస్తేనే పాపమా? మనసుతో చేస్తే పాపం కాదా?

"నిజం నీకు తెలియదు. మా అక్క అంటే మీ అమ్మ చనిపోయిన తరువాత మీ నాన్న నన్ను చేసుకున్నారు. నిజానికి అప్పటికే నేనూ, మీ బాబాయి ఒకర్నొకరు ఇష్టపడ్డాం. పెద్దలకు చెప్పి పెళ్ళి చేసుకోవాలనుకున్నాం. అంతలో అక్క మరణం. నిన్ను చూసుకోటానికి, అక్క

మరణంతో కృంగిపోయిన బావను చూసుకోవటానికి నన్ను ఆయనకు ఇచ్చి పెళ్ళి చేశారు. మేము మా మనసుల్ని చంపుకున్నాం. నాకు ఈ పెళ్ళి ఇష్టం లేకపోయినా పెద్దల నిర్ణయానికి తల వంచాను. అయితే నన్ను పెళ్ళి చేసుకున్నా ఆయన ఎందుకో నన్ను దూరంగా ఉంచారు. నీవు నాకు బాగా మాలిమి అయ్యావు. నీకు కథలు చెప్పటం, పాఠాలు చదివించటంలో కాలం గడిచిపోయేది. కాలం గడుస్తున్న కొద్దీ నేనూ జీవితంతో రాజీ పడటానికి సిద్ధమయ్యాను. అయితే ఆయన నన్ను భార్యగా దగ్గరకు తీయలేదు. నీవు పెరిగి పెద్దగవుతున్నావు. రాను రానూ నేను ఒంటరితనాన్ని భరించలేకపోయాను. పోగొట్టుకున్న ప్రేమ కోసం పరితపించసాగాను. నేను మళ్ళీ మీ బాబాయికి దగ్గరయ్యాను. అలాంటి సమయంలోనే నీవు మమ్మల్ని చూసి…” ఆమె వెక్కసాగింది.

దిగ్భ్రాంతితో ఆమె వేపే చూస్తూ ఉండిపోయాను.

ఏం చేశాను నేను?

ఆ రోజు…

నా మనసంతా అల్లకల్లోలంగా మారింది.

మనసును కవ్వంలా చిలుకుతున్న నూతన యవ్వనం…

భగ్గుమని శరీరాన్ని కాలుస్తున్న కోరికలు…

ఏదో కావాలని, ఏదో చేయాలని ఎగిసెగిసిపడుతున్న మనసు…

మనసుకు శరీరానికి మధ్య యుద్ధం…

గెలుపు ఓటమిల మధ్య నలుగుతూ ఎలా ఇంటికి వచ్చానో…

గదిలో కనిపించిన దృశ్యం…

చూడకూడనిది చూసిన కళ్ళు

తల మీద పిడుగు పడినట్టయి ఒక్కసారిగా మనసులో మంటలు ఎగిసిపడ్డాయి

కోపంతో శరీరం వొణికిపోయింది

చేతికి అందిన క్రికెట్ బాట్‌తో దూసుకుపోయాను

కంగారుగా ఆ ఇద్దరూ నన్ను ఆపబోయారు.

అంతలో నా చేతిలోని బ్యాట్ బాబాయి తలను బద్దలు కొట్టింది.

తలపట్టుకుని నేల కూలిన బాబాయి…

అది చూసి కెవ్వుమని కేక పెడుతూ స్పృహ తప్పిన పిన్ని…

తుఫానులా ఆవరించిన కోపం పటాపంచలైంది.

ఈ లోకంలోకి వచ్చి చూస్తే ఎదురుగా కింద పడిన శవం…

చుట్టూ కమ్ముకున్న చీకటి నా కళ్ళను కమ్మేసినట్టయ్యింది

భయంతో, దుఃఖంతో గజగజా వొణికిపోయాను.

నాన్నను తలుచుకోగానే, వెన్నులో భయం తన్నుకు వచ్చింది

ఆ భయం నన్ను ఇంటి నుంచి బయటపడేలా చేసింది.

పరుగు తీశాను... దిక్కు తెన్ను తెలియనట్టు... ఒకటే పరుగు...

రెండు రోజులు ఎక్కడెక్కడో తిరిగాను.... ఎక్కడెక్కడో తలదాచుకున్నాను

మూడో రోజున పోలీసులు నన్ను పట్టుకుని పోయారు.

హత్యానేరానికి నాకు శిక్ష పడింది. నన్ను జైళ్ళో వేశారు.

జైలు గోడల మధ్య ఎన్ని రాత్రులు గుండెలు పగిలేలా కుళ్ళికుళ్ళి ఏడ్చానో?

అప్పుడప్పుడూ నాన్న వచ్చి నన్ను చూసి కంటతడి పెడుతూ పోయేవాడు. ఆయన ముఖం చూడలేక నేను తలెత్తి ఆయన వంక చూసేవాడ్ని కాను. కొంతకాలం తరువాత నాన్న రావటం మానేశాడు. నాన్న కోసం కళ్ళు కాయలు కాసేలా ఎదురు చూసేవాడిని. నాన్న నా మీద కోపంతో రావడం మానేశాడని నాలో నేనే ఏడ్చుకునేవాడిని.

ఒంటరితనంతో పిచ్చెక్కినట్టయ్యేది. కాలం గడుస్తున్న కొద్దీ జైలు జీవితానికి అలవాటుపడ్డాను. శిక్షాకాలం పూర్తి చేసుకుని బయటకు అడుగు పెట్టేసరికి కాలం పద్నాలుగు సంవత్సరాలను వెనక్కి నెట్టేసింది. ఇంటికి వెళ్ళాలని ఎంతగా అనిపించినా తెలియని భయం నన్ను ఆపింది. కడుపు నింపుకోవటం కోసం నానా రకాల పనులు చేశాను. చివరికి ఓ మార్వాడీ దగ్గర గుమాస్తాగా చేరాను. ఈ మధ్యనే మళ్ళీ పుట్టిన ఊరును, అయినవాళ్ళను చూడాలని పదేపదే అనిపించటంతో ఏది ఏమైనా కానీ అని నేను బయలుదేరి వచ్చాను. వచ్చి చూస్తే...

"అమ్మా! ఎవరమ్మా అతను?"– పాప తల్లి చేతులు పట్టి లాగుతూ అడుగుతోంది.

చిన్నారి పాప కంఠధ్వనికి నన్ను చుట్టుకున్న ఆలోచనలు పావురాల్లా దిక్కుకొకటి ఎగిరిపోయాయి.

నేను నోరు చచ్చినవాడిలా చూస్తూనే ఉన్నాను.

"అతను నీకు... నీకు... " ఆమె గభాలున పాపను గుండెల మీదికి లాక్కుని వెక్కసాగింది. భగవంతుడా! ఏమిటీ ఘోరం? నా లోలోతును తాకుతూ నా గుండెను పిండేస్తున్న ఆమె ఏడ్పును ఎలా ఆపేది? పాప అడిగిన ప్రశ్నకు ఆమె ఏమని సమాధానం చెబుతుంది? నన్నేమని పరిచయం చేస్తుంది? ఇప్పుడు నేనేం చెయ్యాలి?

పాపకు నేనేం అవుతాను?

అన్ననా? తండ్రి హంతకుడినా?

గాలి తెర గట్టిగా వీచింది.

చిన్న గూడులోని దీపం ఆరిపోయింది.



77948 20104

# చిచ్చు

వియోగి (కోపల్లె విజయ ప్రసాద్)

మద్దిలేటి చిన్న పాన్‌షాపును ఒక కాలేజికి కొంచెం ఎదురుగా ప్రారంభించాడు. అంతకు ముందు అతనికొక పాను షాపు ఇంటి దగ్గర ఉండేది. ఆది అంత సెంటరు కాకపోవడంతో ఆదాయం అంతంత మాత్రంగానే ఉండేది. ఎట్టకేలకు ఆ కాలేజీ దగ్గర షాపు దొరకడంతో ఎంతో సంతోషపడి– అద్దె ఎక్కువైనా భరించి ఆ అంగడిని ప్రారంభించాడు.

అతని అంగడిలో పిల్లలకు పనికొచ్చేవి– ప్రయాణీకులకు పనికొచ్చేవి– టూత్‌పేస్టులు– బ్రష్షులు– షాంపులు వగైరాలు దొరుకుతాయి. దానికి తోడు కిల్లీ కట్టగలడు– తమలపాకులు తదితర సామానులు దొరుకుతాయి. గుట్కా కూడా అమ్ముతాడు. సిగరెట్లు చెప్పనక్కరలేదు. ఇంకా కొన్ని చిల్లర మల్లరవి.

స్టూడెంట్లు సిగరెట్లు– గుట్కాలు బాగా కొంటూ వుంటారు. ఆటో డ్రైవర్లు– కూలీలు– పానులు కట్టించుకుంటూ ఉంటారు. ఏతావాతా తెరచిన ఆరు నెలల్లోనే అభివృద్ధి చెందింది. కొందరు నిరోధులు అడుగుతుంటే అవి కూడా తీసుకురావడం మొదలెట్టాడు, అమ్మకానికి కాదేది అనర్హం!

ఆ రోజు ఒకతను వచ్చి కొత్త సరుకు అందించాడు రహస్యంగా–

“అరే ! ఏంటివి ! నేనెప్పుడూ అమ్మలేదు” అభ్యంతరం చెప్పాడు.

"చూడు భాయ్ ! ఇవి హాట్ కేకుల్లాగా అమ్ముడవుతాయి. దీంలో కమీషను చాలా ఎక్కువ–" రహస్యంగా చెప్పాడు.

"అస్సలేంటివివి! ఎవరు కొంటారు !" కంగారుగా అడిగాడు అటుయిటు చూస్తూ.

"అమాయకుడిలాగున్నావు– దమ్ము– దమ్ మారో దమ్ వినలేదా ? మత్తు మందు, హరేకృష్ణ హరే రామ! ఇది పీలిస్తే నిషా వెంటనే తలకెక్కుతుంది. అలాంటివే యివి. స్టూడెంట్లు మస్తుగా కొంటారు. ఆ మధ్య సరుకు దొరకలేదు. పెట్టి చూడు నీకే తెలుస్తుంది. కాని పోలీసులతో జాగ్రత్త!"

"అంత రిస్కు నాకెందుకు" భయపడుతూ అడిగాడు.

"పైసలు భాయ్ ! పైసలు ! నువ్వెప్పుడూ యిలానే ఉండాలనుకుంటున్నావా? రెండు మూడేళ్ళల్లో ఒక ఇల్లు కట్టుకోవాలని లేదా?" అంటూ చాలా చాలా విషయాలు బోధించాడు.

ఏమైతేనేం మద్దిలేటి మెత్తబడి అతని సరుకును తన అంగడిలో అమ్మడానికి ఒప్పుకున్నాడు. అప్పట్నించి అతని దశ తిరిగింది. గడ్డాలు మీసాలు సరిగారాని కుర్రకారు కూడా రహస్యంగా అవి కొనుక్కుని పోవడం మొదలెట్టారు. రకరకాల కండోములు తెచ్చి పెడుతుంటే హాట్ కేకుల్లా ఖర్చవుతున్నాయి. ఇంక పాన్‌పరాగ్ లాంటివి బహిరంగంగానే చదువురాని వాళ్ళు సైతం ఎగబడి కొనుక్కుంటున్నారు.

రెండేళ్ళు గడిచే సరికి నిజంగానే ఒక యిల్లు కొనుక్కోగలిగాడు. పిల్లల్ని మంచి కాన్వెంటు స్కూల్లో చదివించ సాగాడు. భార్య అంకమ్మ కూడా అతని ప్రయోజకత్వానికి సంతోషిస్తున్నది. అతను ఊళ్ళో లేనప్పుడు తను కూర్చుంటూ ఉండేది.

కాలం కొందరికి వేగంగా – కొందరికి మందకొడిగా తిరుగుతున్నది.

రాత్రి ఎనిమిదయింది. పొద్దుటినుండి ముసురు పట్టింది. కాలేజికి వెళ్ళిన శ్వేత యింకా యింటికి రాలేదు. అంకమ్మ ఫోను చేసి చెప్పింది మద్దిలేటికి.

"ఆరుకు రావలసింది యింకా రాలేదా ! కంగారు పడకు– ఫ్రండ్సింట్లో పార్టీ ఉంటే వెళ్ళి ఉంటుంది. తనకు సెల్లు చెయ్యి" విసుక్కుంటూ చెప్పాడు. మంచి గిరాకి సమయం. తను కొట్టు కట్టేయాలంటే పదవుతుంది. పిల్లలన్న తర్వాత స్నేహితులు సరదాలు ఉంటాయిగా. దానికే యింత కంగారు. శ్వేత యింటర్ చదువుతున్నది.

మళ్ళీ సెల్లు మోగింది. "దాని సెల్లు పలకడం లేదు. ఔట్ ఆఫ్ రీచ్ అంటున్నది.. ఎన్ని సార్లు చేసినా తగలడం లేదు." కంగారుగా చెప్పింది అంకమ్మ.

"సరే ! వాడేం గాడిదలు కాస్తున్నాడు – శీను గాడిని వెతికి రమ్మను" చెప్పాడు విసుగ్గా మద్దిలేటి.

"వాడా ! వాడు ముందే ఫ్రండ్సుతో సినిమాకు చెక్కేశాడు, వాడి సెల్లు కూడా స్విచ్ఛాఫ్‌లో ఉంది" చెప్పింది.

"సరే ! దేవుడ్ని నమ్ముకో అదే వస్తుంది" అంటూ కసురుకున్నాడు.

ఇంటికి పదికి చేరుకున్నాడు. అప్పటికి వాసు వచ్చి శ్వేత స్నేహితురాళ్ళను ఎంక్వయిరీ చేశాడు. ఎవడో శ్యామ్ అనే ఫ్రెండు బర్తుడే అని పార్టీ యిస్తానంటే శ్వేత యింకో శ్రావణి వెళ్ళారుట– వాళ్ళ సెల్లు నెంబర్లు వీరి దగ్గర లేవట!

మద్దిలేటి శివతాండవం చేస్తూ ఎదురు చూడసాగాడు. నిమిషాలు గంటల్లా గడుస్తున్నాయి. అంకమ్మ అంకమ్మశివాలేస్తున్నది.

"ఆడపిల్లకు చదువులేంటి – ఈ తిరుగుళ్ళేంటి – అస్సలు సెల్లు ఎందుకు దానికి? పెళ్ళి చేసి ఒక అయ్య చేతిలో పెడితే వాడి చావు వాడు చచ్చేవాడు."

ఇంతలో అతని సెల్లు మోగింది. 'హలో' అంటూ ఎత్తి అవతలివాళ్ళు చెప్పిన విషయం విని– అతను అదిరిపోయాడు. "ఏం జరిగింది?" అని అడుగుతున్నా వినిపించుకోకుండా మోటరు బైకు ఎక్కి, భార్యను ఎక్కించుకుని జనరలు హాస్పిటల్ ముందు దిగాడు. అదురుతున్న గుండెలతో లోపలికి వచ్చాడు భార్యతో సహా.

చివరికి శ్వేత వున్న గది కనుక్కున్నాడు – బయట శ్యామ్ తలవంచుకుని నిల్చున్నాడు. లోపల డాక్టర్లు – నర్సులు శ్వేతకు వైద్యం చేస్తున్నారు. స్పృహలో లేదు.

"అసలేం జరిగింది? " శ్యామ్‌ను కాలరు పట్టుకుని అడిగాడు.

"ఏం కాలేదు – వీక్ అయిపోయింది–" నసుగుతూ చెప్పాడు.

వాడిని వదిలేసి డాక్టరు దగ్గరకు వచ్చాడు. అంకమ్మ నోట్లో గుడ్డ కుక్కుకుంది.

"నువ్వేనా ఈ పిల్ల తండ్రివి? నువ్వు తల్లివా?" డాక్టరు అడిగాడు తిరస్కారంగా.

మ్లానంగా, మౌనంగా తలూపారు– శ్వేత మొహం వంక చూస్తూ. మత్తుగా పడుకునుంది.

"పిల్లలు ఏం చేస్తున్నారో – ఎలా పెరుగుతున్నారో చూసే బాధ్యత తల్లిదండ్రులకు లేదా? ఎంత సేపటికి మీ సుఖాలలో మీరుంటే యిలానే తయారవుతారు. సరియైన టైంకు చేర్చారు కాబట్టి ప్రాణగండం తప్పింది" అంటూ కోపంగా కాసేపు క్లాసు పీకాడు.

జరిగిన సంగతి నిదానంగా తెల్సింది. మత్తు మందులు తీసుకుని ఎప్పటిలాగే పార్టీలో అందరూ ఎంజాయ్ చేస్తూంటే – కొందరు వద్దు వద్దంటున్నా వినకుండా శ్వేతకు ఎక్కువ డోస్ ఇచ్చారట. దానిని తట్టుకోలేక అపస్మారక స్థితిలో పడిపోతే ఆఘమేఘాలమీద హాస్పిటల్లో చేర్చారట! అంకమ్మ గుండెలు బాదుకుంది. తన పెంపకంలో లోపం ఎక్కడుందో అర్థం కాలేదు. కాని మద్దిలేటికి అర్థమయింది. తను సమాజానికి పెట్టిన చిచ్చు తన యింటిని కూడా కాలుస్తున్నదని.





98488 04504

# అక్షయమైన వెన్నెల

డా॥ పేరం ఇందిరా దేవి

మున్సిపల్ కమీషనర్ అయిన నా క్లాస్మేట్ మధుని కలవడానికి వాళ్ళ ఆఫీసుకు వెళ్లాను. ఇద్దరం తరచూ కలుస్తుంటాం. మాట్లాడుకుంటూ ఉండగానే...

"మీ కోసం ఎవరో అమ్మాయి వచ్చారు సర్, రెండు మూడు సార్లు వచ్చినా, బిజీగా వున్నారంటే వెళ్ళిపోయారు, పంపనా?" అన్నాడు సెక్రెటరి. నాపక్క చూశాడు మధు– మా సమయాన్ని కేటాయించడానికి. "సరే కానీ" అన్నా. నేను అక్కడే వున్న హిందూ పేపర్ తీసుకున్నా. మధు, వచ్చిన అమ్మాయిల సంభాషణ ఇంటరెస్టింగ్‌గా వుండడంతో హిందూ పేపర్ ప్రక్కన పెట్టా. క్లీన్ అండ్ గ్రీన్ ప్రోగ్రాం గురించి ఆ అమ్మాయి వివరిస్తోంది. తక్కువ ధరలో డస్ట్‌బిన్స్‌ని ఎలా తయారు చేయొచ్చో... చెబుతూ వాటికి ఫండ్స్ కూడా తను కలెక్ట్ చేస్తానని చెప్పడంతో, మరింత ఆసక్తిగా చూశా. ఆ అమ్మాయి రూపం, వ్యక్తిత్వం నన్ను చాలా ఆకర్షించాయి. ఈ కాలం యువతలో యింత మంచి భావాలా! దేశం, సమాజంపైన యింత ఆసక్తా? ఓహ్... ప్రశాంతమైన ఆ వదనంలో స్పష్టమైన తన ఆశయాల పట్ల వున్న నమ్మకం నన్ను అబ్బురపరచింది.

"ఆలోచించి చెబుతాను." అన్నాడు మధు.

"థాంక్ యు సర్ " అని, ఆ అమ్మాయి వెళ్లిపోయింది.

"సారీ రా !" అన్నాడు మధు.

"పర్లేదు కానీ ఆ అమ్మాయి పేరు ఏంటి, నే వినలా?" అన్నాను.

"ఇదిగో కార్డ్ ఇచ్చింది చూడు" ఇచ్చాడు మధు.

వెన్నెల, పి.ఓ, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, మెయిన్ బ్రాంచ్ అని వుంది. ఎంత అందమైన పేరు? తల్లిదండ్రులు మంచి భావుకులు కాబోలు, అనుకున్నా.

"ఏంటి డ్రా చేసి చూపించింది?" అడిగా.

"డస్ట్‌బిన్ మోడల్స్... చూడు..." పేపర్ నాకిచ్చాడు. దాంట్లో నాలుగు మోడల్స్... వాటి తయారీకి అయ్యే ఖర్చు కూడా రాసింది.

"ఆ అమ్మాయిని నేను మళ్ళీ కలవాలి మధూ" అన్నా.

"నీ ఆశయాలకీ, ఆలోచనలకీ దగ్గరగా వుంది కదా..." మధుకు అర్థమైంది.

మూడు రోజుల తర్వాత మధు నన్ను రమ్మన్నాడు. "వెన్నెల వస్తోందా?" అన్నా.

"అమావాస్య రోజున వెన్నెలా...!" నవ్వాడు.

"నిజంగా ఆ అమ్మాయి అమావాస్య రోజున కూడా వెన్నెల కురిపించేలా వుంది కదా!"

"చెత్తా చెదారంతో డీల్ చేసేవాడ్ని బాబూ... నీలా రొమాంటిక్ పోయెట్రీ టీచ్ చేసేవాడ్ని కాను. ఆ అమ్మాయి చెప్పిన మోడల్ డస్ట్ బిన్ ఓకే చేస్తున్నాం. నీకు పరిచయం చేస్తాను. లంచ్ బ్రేక్‌లో రాగలవా?" అన్నాడు.

"కాలేజీకి సెలవు పెట్టి అయినా వస్తాను" అన్నాను.

నేను వెళ్ళిన కాసేపటికి వెన్నెల కూడా వచ్చింది.

"ఇతను ఆనంద్ నా బెస్ట్ ఫ్రెండ్. ఇంగ్లీష్ లెక్చరర్. మీలాగే సోషల్ సర్వీసు ఇష్టం. డొనేషన్స్ బాగా ఇస్తాడు. మీ ఆర్గనైజేషన్‌కి అడగండి" అన్నాడు.

"గ్లాడ్ టు మీట్యు సర్" అంది.

"రియల్లీ వెరీ గ్లాడ్ టు సి యు..." నా మనసుకు హాయిగా అనిపించింది... ఆ అమ్మాయిని పలకరించడం. ఆ తర్వాత వెన్నెలను స్టడీ చేయడం నాకిష్టమైన పనిగా మారింది.

క్లీన్ అండ్ గ్రీన్ ప్రోగ్రాంకు మా స్టూడెంట్స్‌ను కూడా తీసుకెళ్ళడంతో వెన్నెలతో స్నేహం పెరిగింది. కానీ ఆమె కుటుంబం గురించి మాత్రం ఎప్పుడూ ఆమె చెప్పలేదు, నేను అడగలేదు. దానికి ఇంకా టైం వుందని అనుకున్నా. అనుపమతో, అక్షయ్‌తో కూడా వెన్నెల గురించి చెప్పేవాడ్ని. వాళ్ళు కూడా ఆసక్తిగా వినేవాళ్ళు. మీ ఇల్లు ఎక్కడ అని ఏదో సందర్భంలో అడిగాను. అడ్రసు చెబుతూ వాళ్ళింటికి రమ్మన్నది. కానీ వెంటనే వెళ్ళలేదు. సందేహించాను... ఆ అమ్మాయిని ఎక్కువ అబ్సర్వ్ చేసినట్లు ఆమెకు తెలియకూడదని.

వెన్నెలను కలవక చాలా రోజులైంది. చూడాలనిపించింది. మా పరిచయం పెరగాలి... ఆ అమ్మాయితో జీవితాంతం అనుబంధం కావాలి.

ఫోన్ చేశా వస్తున్నానని. "మోస్ట్ వెల్కం సర్" అంది.

"రండి సర్ " అంది నన్ను గుమ్మంలో చూడగానే. ఐదేళ్ళబాబు టీవీలో టాం అండ్ జెర్రీ చూస్తున్నాడు. వెన్నెల ఏదో చదువుతూ, ఏదో పాట వింటోంది. వెంటనే టీవీ, సీడీ ప్లేయర్ కూడా ఆపేసింది.

"ఇందాక వస్తున్న పాట పెట్టరా వెన్నెలా... అలాంటి ... ట్యూన్తో తెలుగులో ఏదో పాట వుంది" అన్నాను.

సీడీ ప్లే చేస్తూ "అవును సర్. ఇది కార్లైల్ సాంగ్గా పిలవబడే ఇంగ్లీష్ సినిమా పాట. సాంద్రకేట్ అనే ఆమె పాడింది. నిజానికి ఇది నమ్జిలిన్ నోరోబంజాద్ అనే ఆమె పాడిన – మంగోలియన్ జానపదగీతం. అండర్ ద సన్ ఆఫ్ ప్లాసిడ్ వాల్డ్ అనే పాటకు అనుకరణ. దీన్నే మనవాళ్ళు 'తెలుసా మనసా' పాటకు ట్యూన్ తీసుకున్నారు."

కార్లీ డోంట్ బి సాడ్
లైఫ్ ఈజ్ క్రేజి
లైఫ్ ఈజ్ మ్యాడ్
డోంట్ బి అఫ్రైడ్
కార్లీ డోంట్ బి సాడ్
దట్స్ యువర్ డెస్టిని
ద ఓన్లీ ఛాన్స్
టేక్ ఇట్, టేక్ ఇట్ ఇన్ యువర్ హాండ్స్

– పాట వింటూ, అద్భుతం అనుకున్నా. పాటే కాదు వెన్నెల తెలివితేటలు కూడా. ఈ అమ్మాయికి చాలా విషయాలు తెలుసు.... ఆశ్చర్యంతో పాటు నాకు ఆనందం కలిగింది. బాబు రిమోట్ తీసుకుంటూ... "అమ్మా ప్లీజ్" అన్నాడు.

"మీ అబ్బాయా?" ఆశ్చర్యంగా అన్నాను. కాసేపు ఏమీ తోచలా... వెన్నెల పెళ్లి కాని అమ్మాయిలాగే వుంది. ఆమెపై నా ఆశలు... ఫ్చ్... వెంటనే తమాయించుకున్నా.

"అవును సర్ – సర్ కి నమస్తే చెప్పు ధ్రువ్" అంది. వాడు సిగ్గుగా నమస్తే చెప్పి, మళ్ళీ టీవీ రిమోట్ తీసుకోబోయాడు. "నో, నువ్వు ఇప్పుడు డ్రాయింగ్ చేస్తావన్న మాట" అంటూ ఓ డ్రాయింగ్ బుక్, వాటర్ కలర్స్ ఇచ్చింది. బుద్ధిగా వాడు ఆ పనిలో మునిగిపోయాడు.

"చెప్పండి సర్ " అంది.

"ఎంత వరకు వచ్చింది డస్ట్బిన్ ఫండ్ కలెక్షన్ – ముందుగా ఎక్కడ పెట్టాలని?" అడిగా.

"మొదటగా జనరల్ హాస్పిటల్ అనుకున్నాం సర్ – అక్కడే కదా పరిసరాలు శుభ్రంగా వుండాల్సింది. వంద ఆర్డర్ చేశాం. తరువాత ఫండ్స్ను బట్టి మిగతా ప్రాంతాల్లో చేద్దామని.." ఆగింది.

"అవునవును అది నిజం. నా విరాళం ఇద్దామని" – డబ్బు తీసి టీపాయ్ మీద పెట్టా.

"మీరు కూడా బాధ్యత తీసుకుంటే బావుంటుంది. డబ్బు కంటే మనుషుల అవసరమే ఎక్కువ వుంది. మాకు సొసైటీ – అలాగేం లేదు... కొద్దిమంది స్నేహితులం కలసి చేస్తున్నాం మన వూరు శుభ్రంగా, పచ్చగా వుండాలని" అంది. అందంపై, సొంత ఆనందంపై – ఆసక్తి ఉండాల్సిన వయస్సులో, సామాజిక శ్రేయస్సు కోరే వ్యక్తిగా – ఆమెపై నాకు అపారమైన గౌరవం కలిగింది.

టీపాయ్ మీద జోసెఫ్ బల్గకోవ్ నావల్ ది మాస్టర్ అండ్ మార్గరిట చూసి "ఇది మీరు చదువుతున్నారా?" అన్నా.

"ఊ" అంది.

"ఎమ్మెస్సీ ఫిజిక్స్ చేశామన్నారు – మరి సాహిత్యం ! అదీ మైఖేల్ బల్గకోవ్ – అంత ఈజీ కాదు కూడాను..."

చిన్నగా నవ్వింది. పక్కనే వున్న బుక్ షెల్ఫ్ చూశా – నబోకావఈ, బోరిస్ పాస్తేర్నాక్, అన్నా అఖ్మతోవా, పాబ్లోనెరుడా, టి.ఎస్.ఇలియట్, తిలక్, శ్రీశ్రీ, చలం, గురజాడ, బుచ్చిబాబు, గోపీచంద్, ఇంకా లబ్ద ప్రతిష్ఠులైన ఎంతో మంది కవుల, రచయితల పుస్తకాలు చూస్తే, నాకు తల తిరిగింది. నేనింతకాలం సాహిత్యం యింత విస్తృతంగా చదివే వాళ్ళను కలవనే లేదు. సాహిత్యం గురించి నేను అక్షయ్‌తో తప్ప ఇంకెవరితోనూ మాట్లాడే అవకాశమే లేదు. వెన్నెలకిష్టమైన రచనల గురించి అడిగినప్పుడు తను చదివిన పుస్తకాలు, తాను చూసిన సినిమాలు, థియేటర్ ప్లేసు, ఒపెరాసు, చూసిన ప్రపంచం, కోరుకునే సమాజం గురించి చెప్పింది. ఓహ్ అద్భుతమైన వ్యక్తి అనుకున్నా. ఆ అమ్మాయిని చూసే కొద్దీ ముచ్చటేసింది. అప్పుడు గుర్తొచ్చింది – ఈ అమ్మాయి వరించిన భాగ్యశాలి ఎవరో మరి.

"మీ వారేం చేస్తుంటారు?" అడిగా.

కాసేపు మౌనం వహించిన వెన్నెల మెల్లిగా "హీ ఈస్ నో మోర్" అంది.

ఒక్కసారి నా హృదయం భగ్గుమంది. అప్రయత్నంగా నా కళ్ళలో నీళ్ళు. వెన్నెల మౌనంగా వుండిపోయింది. ఎలాగో గొంతు పెగల్చుకుని –

"అయాం సారీ వెన్నెలా, మిమ్మల్ని గాయపెట్టాననుకుంటాను."

"అదేమీ లేదు లెండి, ఎప్పుడూ ఎదుర్కొనే చర్చనే – అలవాటు పడ్డాను." కళ్ళలో తడి మెరుస్తుండగా నవ్వింది. "మా అత్తగారు, మామగారు వాకింగ్ వెళ్ళారు. వస్తారు – మీకు పరిచయం చేస్తాను. మామగారు కూడా బాగా చదువుతారు."

ఓహ్ ! భర్త మరణించినా అతని తల్లిదండ్రుల్ని చూసుకుంటున్నదంటే... హాట్స్ ఆఫ్ టు యు అనుకున్నా. చిన్న చిన్న కష్టాలకే కన్నీళ్ళమయమయ్యే వాళ్ళు, ధైర్యాన్ని కోల్పోయి

ఆత్మహత్య చేసుకునే వాళ్ళున్న లోకంలో – ఈ అమ్మాయి తన కష్టాలన్నీ మరచి కుటుంబం పట్ల, సమాజం పట్ల ఎంత బాధ్యతతో ప్రవర్తిస్తోంది! “దగ్గరగా వెళ్ళేకొద్దీ కొంతమంది గొప్పవాళ్ళు సామాన్యులుగా కనపడతారు. కొందరు సామాన్యులుగా కనిపించి – చేరువయ్యే కొద్దీ గొప్పగా కనిపిస్తారు. వెన్నెల మొదటినుండీ నాకొక అద్భుతం. ఇప్పుడు మరింత అద్భుతంగా కనిపిస్తోంది.”

తర్వాత వెన్నెల అత్తమామలు, అమెరికాలో వెన్నెల అన్నయ్య దగ్గర నుండి వచ్చిన తల్లిదండ్రులు కూడా పరిచయం కావడంతో – నేను తరచూ వాళ్ళింటికి వెళ్ళేవాడ్ని. వెన్నెల జీవితంలోని చీకటి చూశాక, ఆమె జీవితంలో పరిపూర్ణత రావాలంటే, ఆమె మళ్ళీ పెళ్లి చేసుకుంటే బాగుంటుంది అనిపించింది. తన భర్తను ఎంత ప్రేమించినా, జీవితాన్ని మోడులా గడిపేయాలనే నిర్ణయానికి తను రాకపోయి ఉండచ్చు. తన అభిప్రాయాల్ని గౌరవించే వ్యక్తి దొరికితే బహుశా చేసుకుంటుందేమో! వాళ్ళ తల్లిదండ్రులతో, అత్తమామలతో మాట్లాడాలని నిర్ణయించుకున్నా. అదే విషయం అనుపమతో అన్నా. ‘‘నీవు ఆ అమ్మాయి వ్యక్తిగత విషయాల్లో కల్పించుకుంటున్నావేమో! అంత తెలివైన అమ్మాయికి ఇంకొకరు తన విషయాల్లో కల్పించుకోవడం నచ్చకపోవచ్చు. పైగా ఇది చాలా సున్నితమైన విషయం” అంది.

అక్షయ్ మాత్రం “ అంత స్నేహం ఉందిగా మీకు ఆ కుటుంబంతో... ఇష్టం లేకపోతే లేదంటారు. కానీ, సిల్లీగా ఆ టాపిక్ తెచ్చినందుకు మీ పట్ల వ్యతిరేకత రాదనుకుంటా” అన్నాడు.

“నువ్వు చెప్పు అక్షయ్, అలాంటి అమ్మాయిని ఇష్టపడని వాళ్లుంటారా?”

“చూస్తే కాని చెప్పలేను” అన్నాడు.

“అయితే ఎప్పుడొస్తావు?” అన్నా.

“త్వరలో”

“ఆ త్వరలో ఎప్పుడు?”

గట్టిగా నవ్వాడు అక్షయ్. “సరే మీకు ఆ అమ్మాయి అంత నచ్చిందంటే, ఇంక మీదే ఆఖరి నిర్ణయం” అన్నాడు.

“నువ్వు వచ్చే ఆదివారం వస్తున్నావు” అన్నాను.

మధు, నేను వెన్నెల పునర్వివాహం గురించి ఆమె తల్లిదండ్రులతో, అత్తమామలతో మాట్లాడాం. వాళ్ళు మనస్ఫూర్తిగా అంగీకరించారు. వెన్నెలకు నచ్చిన వ్యక్తి దొరికితే తమకెంతో సంతోషమని, అదే తాము కూడా కోరుకుంటున్నామని అనడం, నాకెంతో సంతోషాన్ని ఇచ్చింది. వెన్నెలతో మాట్లాడ్డం గురించి రిహార్సల్ చేసుకున్నా. ఎలా మాట్లాడితే, ఎలా మొదలెడితే బాగుంటుందో అని తెగ ఆలోచించా... అక్షయ్, అనుపమ, నేను వెళ్ళాం – వెన్నెల ఇంటికి. ఆమె అప్పుడే బయటికి వెళుతోంది... ఫ్రెండ్ పెళ్లికని... ఎంత చక్కగా అలంకరించుకుందో!... అక్షయ్ కళ్ళు మెరిశాయి... వెన్నెలని చూడగానే. అది నేను గ్రహించాను. వెన్నెల రెండు

గంటల్లో వచ్చేస్తానని, ఫోంచేసి వెళ్ళమని కోరింది. ధ్రువ్ మారాం చేస్తుంటే, మేము తెచ్చిన చాక్లెట్లు ఇచ్చి, మాతో లోపలికి తెచ్చాం. వెన్నెల వచ్చాక అక్షయ్‌ను పరిచయం చేశా.

"మిమ్మల్ని చూడకపోయినా మీ గురించి సర్ చెబుతూ వుంటారు."

"మీ గురించి కూడా నాకు చెబుతుంటారు. అందుకే మీరు నాకు క్రొత్తగా లేరు" అన్నాడు అక్షయ్.

ఇద్దరూ సాహిత్యంలో కొత్త పోకడల గురించి మాట్లాడుతుంటే వింటూ వున్నాను. తర్వాత అక్షయ్ ఫ్రెండ్‌ని కలవడానికి వెళ్లిపోయాడు. అనుపమ, నేను కూడా వీడ్కోలు తీసుకున్నాం.

మరుసటి రోజు అక్షయ్‌తోనూ, అనుపమతోనూ మాట్లాడాక వెన్నెల్ని కలిశాను. " నేను మీ శ్రేయోభిలాషిని కదూ వెన్నెలా!"

"అవును మీరంటే నాకు చాలా గౌరవం సర్, చెప్పండి."

"అయితే నేను చెప్పే విషయం కాస్త ఆలోచించండి."

"చెప్పండి".

"మీరు మళ్ళీ పెళ్లి ఎందుకు చేసుకోకూడదు?"

వెన్నెల కాసేపు మౌనం వహించింది. "నాకా ఆలోచన, అవసరం రాలేదు. నేను సంతోషంగానే వున్నాను సర్."

"మీకు తోడూ నీడగా ఒక వ్యక్తి వుంటే బాగుంటుంది కదా?"

"నాకు రాజ్ చనిపోతూ అతని తల్లిదండ్రుల్ని అప్పగించాడు. నన్ను స్వీకరించే దానికి సిద్ధంగా వున్నా, వీళ్ళ బాధ్యత తీసుకోవడానికి ఎవరూ సిద్ధంగా వుండరు సర్. అది నాకు తెలుసు... అందుకే ఆ ఆలోచన చేయలేదు."

"ధ్రువ్‌తో పాటు, మీ బాధ్యతల్ని అన్నిటినీ సంతోషంగా పంచుకునే వ్యక్తి దొరికితే, మీకిష్టమేనా?"

"ఎందుకో రాజ్ స్థానం... ఇంకొకరికి ఇవ్వాలంటే నాకు చాలా భయంగా వుంది. అలాంటి ఆలోచనే భరించలేను." ఆమె కళ్ళలో కన్నీళ్ళు బుగ్గలపై జారాయి.

"అయాం సారీ వెన్నెలా, జీవితంలో రాబోయే రోజులు మరింత కష్టంగా వుంటాయి ఒంటరితనంతో. మీ శ్రేయస్సు కోరి చెబుతున్నా. అక్షయ్‌పై మీ అభిప్రాయమేంటి?"

"మీ అబ్బాయి అక్షయ్ గురించా ! ఎందుకు ?" కొంచెం ఆశ్చర్యంగా అంది.

"వెన్నెలా మిమ్మల్ని చూసిన క్షణంలోనే మీ అభిమానినైనాను. అక్షయ్ ఆలోచన విధానం ఈ కాలం పిల్లల్లా కాదు. వాడికి మీలాగే, నాలాగే సాహిత్యం, సమాజ సేవ... ఇంకా చాలా సున్నితమైన భావాలతో ఉంటాడు... వాడికి తగిన అమ్మాయిని చూసే బాధ్యత నాపై పెట్టాడు. మిమ్మల్ని చూశాక మీరు నచ్చారు వాడికి... మీకు ఇష్టమైతే మా ఇంటికోడలుగా ఆహ్వానిస్తున్నా" అది చెప్పాక నాకు మనసు తేలికైంది.

"అంత మంచి చదువు, వుద్యోగం వున్న అక్షయ్‌కి అన్ని యోగ్యతలూ వున్న అమ్మాయి దొరుకుతుంది. నాపై సానుభూతితోనా ఈ ఆలోచన!" అంది వెన్నెల.

ఆమె గొంతులో కొంచెం నిరాశ ధ్వనించింది.

"మీలాంటి మంచి అమ్మాయిని అక్షయ్ చేసుకోవాలనుకోవడంలో సానుభూతి లేదు. స్వార్థం వుంది." వెన్నెల పలకలేదు. వెన్నెల్ని ఒప్పించేందుకు చాలా శ్రమపడ్డా. అక్షయ్‌తో మాట్లాడాలి అంది. సరే అన్నా.

ఇద్దరూ మాట్లాడుకున్నారు. ఇద్దరి మొహాల్లో వున్న సంతోషం చూసి నాక్కూడా చాలా సంతోషమేసింది. అందరం రిజిష్టర్ ఆఫీసుకు వెళ్ళబోయే ముందు వెన్నెల అన్నయ్య అన్నాడు...

"అక్షయ్! నా చిన్నారి అల్లుడు ధ్రువ్‌ని నువ్వు బాగా చూసుకోవాలి. వాడంటే మాకు ప్రాణం, ఎంతయినా మీ రక్తం కాదని ఏదైనా ఫీలింగ్స్ వుంటే, నేను తీసుకెళతాను." ఆ టాపిక్ రావడం వెన్నెలకు నచ్చలేదు. నాక్కూడా నచ్చలేదు.

అయితే అక్షయ్ అదేమీ పట్టించుకోకుండా "రక్తం ఎవరిదన్నది ముఖ్యం కాదు, ఎవరు బాధ్యత తీసుకున్నారు అన్నది ముఖ్యం. మా నాన్నకి నేను బయోలాజికల్ సన్‌ని కాదు. మరి నన్ను ఆయన ఎలా చూసుకున్నారో నాకు తెలుసు. ఆయన కంటే మంచి తండ్రి ఎవరికీ వుండరు. మా నాన్నకు సాధ్యమైంది నాకెందుకు సాధ్యం కాదు!" అన్నాడు ధ్రువ్‌ని చేతుల్లోకి తీసుకుంటూ. 'అవునా !' అన్నట్లు చూసింది వెన్నెల నా వైపు అనుపమ వైపు... నవ్వి తల వూపాం... వెన్నెల అందంగా, ఆనందంగా నవ్వింది. ఆ నవ్వుల్ని అక్షయ్ ఎప్పటికీ వాడనివ్వడని నాకు తెలుసు.





94402 05303

# పునరపి

 

మారుతి పౌరోహితం

సెల్లు ఫోను మోగ్య

"ఎవురప్పా ఇంత రేతిరప్పుడు" అనుకుంటా సూస్తి.

మాయమ్మ.

"ఏమప్పా ఈయాలప్పుడు ఫోను చేసింది" అనుకుంటా ఫోను తీస్తి.

"చెప్మా" అంటి

"ఏమప్పా మీరు బాగుండారా? పిల్లోల్లు బాగుండారా" అన్య.

"ఆ బాగుండాము. నాయన ఎట్లా వుండాడు" అంటి.

"ఆ బాగుండాడప్పా" అని "నీకొాక మాటరా" అన్య.

"చెప్మా" అంటి.

"ఏం లేదురా, ఊర్ల వున్న మన ఇంటిని ఈడిగ చిన్న భీమన్న కొనుక్కొని వుండే కదా! ఆయప్ప ఆ ఇల్లు అమ్మకానికి పెట్టినాడు అంట. మొన్న కుర్వ గిడ్డయ్య మీనాయన కాడికి పంచాంగం సూసేకి వచ్చిండ్య, గిడ్డయ్య పెద్ద కొడుకు మొన్న గుండెనొప్పితో సచ్చిపోయినాడు అంట. పెద్దల్ని కలిపేకి దినం అడిగేకి వచ్చి ఉండ్య. అప్పుడు ఈమాట సెప్పె. నాకి ఎందుకో ఆఇల్లు మనమే మళ్ళా కొనాలనిపిస్తా వుంది. కొందామారా" అన్య.

"అవునా? చిన్న భీమన్న ఏంటికి అమ్ముతున్నాడు అంట?" అంటి.

"అమ్ముకోకుంటె ఏముందిరా? కాల్వ ఎండిపోయ, వానలు రావడం ల్యా, వూరు నాశనం అయిపోయిడిస్య. సేన్లన్ని అమ్మకానికి

పెట్టిరి. కొనేదానికి ఎవురూ రాల్యా. చిన్న భీమన్న కొడుక్కి బి.యి.డి. సేసినా వుద్యోగం రాల్యా. ఏం చేస్తాడు పాపం అమ్ముకోక. ఊర్ల మొన్న ఒకసారి గిడ్డయ్య ఎదురు పడితే ఒకసారి స్వామోల్లకు సెప్పు గిడ్డయ్యా అని చిన్న భీమన్న సెప్పినాడు అంట" అన్య.

"అట్లనా మా. సర్లే. ఆదివారం వస్తాను. వూరికి పోదామ్లే" అని "ఎంత సెబుతాడో ఏమో" అంటి.

"ఏం సెబుతాడు లేరా. ఎక్కువ తక్కువ సెప్పె మనిసి కాదులే. సూసి సెపుతాడులే. ఆదివారం రాప్పా. వూరికి పోయి వద్దాం" అన్య .

"సర్లేమా" అంటి.

మాయమ్మతో మాట్లాడినాక నిద్ర పట్టల్యా. మా ఇల్లు, మా వూరు గుర్తుకు వస్తా వుండాయి. ఇల్లు కట్టుకోనీక మాయమ్మ, మా నాయన పడిన కష్టం, మా అక్క పెండ్లి కోసం దాన్ని అమ్మేటప్పుడు మా అమ్మ పడిన బాధా గుర్తుకు వచ్చ్య.

మా వూరు గువ్వలదొడ్డి. ఎమ్మిగనూరుకు పన్నెండు కిలోమీటర్ల దూరం వుంటాది . తుంగభద్ర కాల్వ కింద మావూరోల్లు ఆరుతడి పంట పండిస్తా వుండ్రి. వానాకాలం వానకే పండుతా ఉండ్య. కాల్వ పారినన్ని దినాలు మావూరు కోనసీమ లాగ ఉండ్య. యండాకాలం పలుకురుబండ, ఆస్పరి, ముత్తుకూరు వూర్ల నుండి మావూరికి జనాలు బతికేకి వస్తుండ్రి. మాము వీళ్ళని సుగ్గికి వచ్చేర్య అంటూ వుంటిమి. సుగ్గికి మావూరికి వచ్చే వాళ్ళు ప్రతి యాడాది ఒకరికే కూలి పోతా వుండ్రి. అంటే ఎప్పుడు వచ్చినా రైతును మార్చుత ల్యాకుండ్రి. మా రైతులు గూడ ఎవుర్ని అంటే వాళ్ళని పిల్సుకోకుండా ప్రతి యాడాది వచ్చే వొళ్ళనె పిలుసుకుంటా వుండ్రి. రెండు దినాలు అయినా వాళ్ళు వచ్చే వరకు ఎదురు సూస్తా వుండ్రి. మా వూర్లో సేనులు ఎక్కువగా ఎర్రనేల సేనులు వుండాయి. మాది ఎర్రనేల సేనే . మా నాయన వూర్లో గిడ్డయ్యస్వామి గుడిపూజ సేస్తా వుండినందుకు మాకు ఆరు ఎకరాల ఇనాము భూమి ఇచ్చి వుండ్రి. మా నాయన ఒక తుక్కు పూజలు సేసుకుంట మరో తుక్కు సేద్యం కూడా సేస్తూ ఉండ్య. మా సేనుని "శెభాష్ గాని సేను" అంటూ వుండ్రి. ఏంటికప్పా అంటే మా సేను సదరంగా వుండె కాబట్టి. కుర్వ గిడ్డయ్య మాకి తప్ప వేరే ఎవురికి కూలి పోతా వుండ్యా . మాము కూడా ఆయప్పని అట్లనే సూసుకుంటా వుంటిమి. సేన్లు అన్నీ "శెభాష్ గాని సేను" లాగా గాని వుంటే నీళ్ళు పెట్టేకి యదారే వుండదు సూడప్పా అంటూ ఉండ్య.

మాయమ్మ, మానాయన ఈ సేనుల పడిన కష్టం తలుసుకుంటే ఇప్పుడికి నా కండ్లల్ల నీళ్ళు తిరుగుతాయి సూడప్పా. కంచె ఐలయ్య సారు బాపనోళ్ళు తిండి మీద యావతోనే వండే వృత్తిని ఎన్నుకొనేర్య అంటాడు. నాకి ఆయప్ప రాసిన దాని మీద శానా అభ్యంతరము వుండాది. మాము కూడా బాపనోల్లే. మాయమ్మ గాని, మా నాయన గాని మాముగాని యానాడు తిండికి

అంగలార్చల్యా. తిండికి కనా కష్టం పడినోల్లం. ఒకసారి ఏమి అయ్యింది అంటే నాను డిగ్రీ పూర్తి సేసినాక బి.యిడి. సేయాల్ల అనుకొంటి. పేపర్ లోన ప్రకటన వచ్చ్యు. నూట ఇరవై ఐదు రూపాయలు ఫీజు. ఎట్లప్పా దేవుడా అనుకొంటి. మాయమ్మకి సెప్పితి.

"సూద్దాం లేరా దేవుడు వుండాడు" అనె.

సరిగ్గా అప్పుడే పార్లపల్లె కొమిటోల్లు సత్యనారాయణ సామి పూజ చేయిన్చేకి మా నాయనని పిలిసేకి వచ్చిరి.

"పూజ సేసినందుకి యాబై రూపాయలు ఇస్తాం" అనిరి .

మానాయన "సరేలేప్పా" అన్య .

పార్లపల్లి కోమిటాయప్ప "సామి వంట సేసేకి ఎవుర్నన్న బాపనోల్లని సూడి, నూట యాబై గాని ఇస్తాం" అనిరి. మాయమ్మ వెంటనే అందుకున్య . "నానే వస్తానులే అయ్యా, కాకపోతె నూట యాబై ఇప్పుడే ఇచ్చి పోవాల" అన్య. ఆ కోమిటాయప్ప "సరేలే అమ్మయ్యా" అని నూట యాబై రూపాయలు ఇచ్చ్యు. వాళ్ళు అట్లా పోయిరో లేదో మాయమ్మ నాకి ఆ నూట యాబై రూపాయలు ఇచ్చి "పోరా, బి.యిడి.కి కట్టి రాపో" అన్య . మల్ల ఐలయ్య సారు ఏమో తినమరిగి వంట వృత్తిని ఎంచుకునేర్య బాపనోళ్ళు అంటాడు. మా తిప్పలేమొ ఇట్లా ఉంద్య. ఆయప్ప మా అట్లటొల్ల మనసు నొప్పించే మాటలు శాన మాట్లాడ్య. మల్ల ఆయప్ప అనుభవము అట్లా వుందో ఏమో?

మానాయన ఒక తుక్కు పురోహితం సేసుకుంటా ఇంకోతుక్కు సేద్యం సేస్తా ఉంద్య. మావూర్ల ఎవురికి కూలి పోయినా దుడ్లు ఇయ్యకుంద్రి. గింజలు ఇస్తుంద్రి. మాము మాత్రం ఎమ్మిగనూర్ బంగారు రాజన్న సావుకారి దగ్గర అప్పు చేసి తెచ్చిన దుడ్లు ఇస్తా వుంటిమి. దానికే మా ఊర్ల బాపనోళ్ళ కూలి బంగారు కూలి అంటా వుంద్రి. మా ఊర్ల రైతులు శాన మంది బంగారు రాజన్న ధని కాడ అప్పు సేసి సేన్లకి, మందులకి, ఖర్చులకి పెడతా వుంద్రి. ఆయప్ప దళారి యాపారం సేస్తా వుంద్య. ఆయప్ప దయా దాచ్చిన్యాల మీద మా బతుకులు ఆదార పడి ఉంద్య. నాను ఎప్పుడన్నా మా నాయనతో కలిసి ఆయప్ప కాడికి పోతా వుంటి. ఆయప్ప రైతుల్ని పురుగులకన్న అద్వానంగా సూస్తా వుంద్య. రైతు నమస్కారం పెడితే ఆయప్ప వాళ్ళ తుక్కు సూడ కూడ సూడకుంద్య. తనకి ఒకటే తెలివి వున్నట్ల, ఇంక ఎవురికి లేనట్ల మాట్లాడతా వుంద్య. గంటలు గంటలు ఎదురుసూస్తా వుంటిమి. ఐదు నూర్లు అడిగితే మూడు నూర్లు ఇస్తా వుంద్య. వడ్డికి ఇచ్చినా అది అట్లా ల్యాకుంద్య. తిరిపానికి ఇచ్చినట్ల, బిచ్చగానికి దానము సేసినట్లా వుంటుంద్య.

పంట పండినాక ఆయప్పకే అమ్మాల. నాకి తెలిసి ఎవురి అప్పు ఆయప్ప దగ్గిర తెగకుంద్య. సేను ఇత్తిన కాడి నుంచి పెరికి అమ్మేవరకి ఆయప్ప మీదనే ఆదారపడాల. ఎక్కువ మంది

బుడ్డలు (వేరుశనగ) వేస్తా వుండ్రి. సెనగ పీకినాక బండకుంట మీద రెండు మూడు దినాలు ఆరబెట్టి ఎమ్మగనూర్లో మార్కెట్టుకు తీసక పోతుంటిమి. మార్కెట్టు కమిటీల ఎండనక వాననక పండిచ్చిన పంటని కుప్పగా పోసి మా జీవితాలని బజారులో పోసినట్ల పోస్తుంటిమి. మార్కెట్టు ఆయప్ప వచ్చి కుప్పలోకి సేయి దూరిచ్చి పిడికెడు నిండా బుడ్డలు తీసికొని సెవుకాడ పెట్టుకొని ఏమో పెద్ద తెలిసినాయప్ప మాదిరి ఊపుతా వుండ్య. మా అందరు మా కష్టం తీర్చేకి వొచ్చిన దేవుని మాదిరి ఆయప్పను సూస్తుంటిమి. పేపర్ల ధర రాసుకుని పోతా వుండ్య. ఆయప్ప రాసిందే ధర. మా కష్టం, మా పెట్టుబడి లెక్కలోకి ల్యా. మా నాయన "రోడ్డు మీద పుగ్యాలు (బజ్జిలు) వేసుకొనే వోడు కూడా రూపాయకి ఇన్ని పుగ్యాలు అని సెబుతాడు, బేరం సేస్తే నాకి గిట్టే లేదు అని సేపుతాడు, ఇంకా అడిగితే ఇష్టం వుంటే కొను ల్యాకపోతే ఫో అంటాడు. అంతకన్నా రైతు బతుకు అద్వానం అయిపాయ" అంటుండ్య.

ఎండా కాలం కాల్వ నీళ్ళతో పంట పండిస్తా వుండ్రి. పంట ఎక్కువొస్తుండ్య. వానాకాలం వానలు సరిగా రాకుండ్య. దాని కోసం వానకాలం పంట తక్కువ పండుతా వుండ్య. ఒక్కోసారి మళ్ళీ ఇత్తేకి ఇత్తనాలకి కూడా తక్కువ వస్తుండ్య. మాకి ఇత్తనీక ఇత్తనాలు తక్కువ వస్తే నేరుడుప్పల సెట్టి దగ్గర బుడ్ల ఇత్తనాలు నాగుకి తెస్తా వుంటిమి . నాగు అంటే మీకి తెల్దు కదా? పంట పండినాక ఒకటిన్నర రెట్లు మనం తిరిగి వాళ్లకి ఇయ్యాల.

సేను ఇత్తిన కాడి నుంచి పీకే వరకు కంటి మీద కునుకు లేకుండ్య. ప్రెపంచమ్లో ఇప్పటికీ రెండు యుద్ధాలు జరిగేవ్య అని సదివినాను గాని రైతుకి మాత్రం దినూము ప్రేపంచ యుద్ధమే. ఒకపారి బండకుంట మీద బుడ్డలు ఆరబెట్టి వుంటిమి. యాడ నుంచి వచ్చెనో పెద్ద వాన వచ్చిడిస్య. నాను, మాయమ్మ, గిడ్డయ్య వుంటిమి. ఇంగ సూస్కో బుడ్డలన్ని వాన నీళ్ళల్లో కొట్టుకపోతుంటే మాయమ్మ జల్ల తీసుకొని నీళ్ళల్ల పోతున్న బుడ్డలని ఒలిపి ఒలిపి గడ్డకి ఏస్తా వుంటే నాకేమో మాయమ్మ భారతంలోన అభిమన్యుని మాదిరి కనిపిచ్చ్య. గిడ్డయ్య తెగించి కొట్టుకుపోతున్న బుడ్డలని ఒడిసిపట్టి బండ మీద ఏడుసుకుంట పోసేది సూసి నాకిగూడ ఏడుపు వచ్చిడిస్య. మాయమ్మ గిడ్డయ్యతో "మన గాశారం (గ్రహచారం) బాగాలేదు లేప్పా ఏంటికి ఏడుస్తావు" అన్య. కాని మాయమ్మ మాము అంతా బయట పడుకొని వుంటే ఒక్కతే ఇంట్ల కూసోని ఏడిసింది నాను సూడలేదు అనుకొనింది. మాయమ్మ తన కష్టం తన పిల్లలకి రాకూడదని వంటపని, ఇంటిపని, సేనుపని సేసి మమ్ముల్ని సేద్యం అనే యమలోకము నుంచి తప్పిచ్చిన దేవత మాకి. మీరు అనుకునొచ్చు, "బాపనాయమ్మ ఇంత కష్టం చేసి ఉంటాదా" అని. బాపనత్వం మాకి అన్నం పెట్టి వుంటే మాయమ్మ, మా నాయన ఇంత కష్టం ఏంటికి సేస్తుండ్రి?

మా ఊరోళ్ళు అంతా ఎమ్మగనూర్లో అనిమేశయ్య శెట్టి అంగడిలో సరుకులు ఉద్దర పెట్టి కొనుక్కొంటా వుండ్రి. యామాటకి ఆమాట సేప్పుకోవల్ల గాని ఆయప్ప శానా మంచోడు.

దళారి అంగడి సావుకారి మాదిరి కాకుండా రైతులకి మర్యాద ఇస్తా వుండ్య. మా ఊరోళ్ళు కూడా ఆయప్ప దగ్గర అట్లా మర్యాద పెట్టుకొని వుండ్రి. మార్కెట్టులో పంట అమ్మినాక దళారీ సావుకారి తన అప్పు ఇరిగేసుకోని మిగిలిన దుడ్లు మాకి ఇస్తా వుండ్య. మాము ఆయప్ప దగ్గరి నుంచి అనిమేశయ్య శెట్టి అంగడి కాటికి వచ్చి అప్పు కడుతుంటిమి. ఈ రెండు తాన్ల అప్పు తీర్చేటప్పటికి ఏమీ మిగుల్త లేకుండ్య.

వానాకాలం సేన్లల్ల అనుములు, అలసందలు, పెసులు, నూలు, జొన్నలు, సద్దలు ఇత్తుతా వుండ్రి. సంక్రాంతి పండగకి మా నాయన పంచాంగం తీసుకోని సంక్రాంతి బిచ్చానికి ఊర్లేకి పోతా వుండ్య. గిడ్డయ్య, నాను, మాయన్న ఖాళీ యూరియ సంచులు తీసుకొని మా నాయన వెనకాల పోతా వుంటిమి. ఊర్ల మామంటే శానా మందికి అభిమానుము. బాపనోళ్ళు అయి వుండి కనా కష్టం పడుతున్నారని. ముందు ఈడిగోల్ల ఇండ్లు, తరువాత గొరవోల్ల ఇండ్లకి పోతా వుంటిమి. మా నాయనకి మంచం వేసి, దాని మీద జాడి కంబడి పరుస్తా వుండ్రి. తాగేకి పాలు ఇస్తా వుండ్రి. మా నాయన పంచాంగం తీసుకోని శంకరుడు ఏమిటి మీద వచ్చెడ్య? వానలు ఎట్లా వస్తాయి? ఈసారి కాలం ఎట్లా అయితాది? అనే విసయాలు సేబుతా వుండ్య. ప్రతి యాడాది కాలము బాగా అయితాది అని పంచాంగము సూసి సేబుతూ వుండ్య కాని మా నాయనతో కలుపుకొని అందరికి దరిద్రమే మిగులుతా వుండ్య. ఊర్ల రైతులు అందరు సామి వచ్చెడ్య అని వడ్లు, జొన్నలు, సజ్జలు, అలసందలు, నూలు, పెసులు ఒకటేమిటి అన్ని రకాల ధాన్యాలు చేటలనిండా తెచ్చి సంచుల్ల పోస్తా వుండ్రి. ఈ ధాన్యం మాకి ఒక సమ్మచ్చరానికి అయితా వుండ్య.

మా ఊర్ల మాకి తినేకి అంత ఇబ్బంది లేకుండ్య గాని సదువుకునేకి శాన కష్టంగా వుండ్య. ఓ.సి. అని బడిలోన బుక్కులు ఇయ్యకుండ్రి. మా సీనియర్ల దగ్గర సగము ధరకి కొనుక్కుంటా వుంటిమి.

ఒకతుక్కు పురోహితము, మరోతుక్కు సేద్యము. డార్విను సారు సెప్పినట్ల మనుగడ కోసరం పోరాటము సేస్తా వుంటిమి. మా నాయన యా వూరికి పూజలకి పోయినా సైకిలు మీదనే పోతా వుండ్య. పొద్దున్న పోయినోడు ఎర్రని ఎండకి సైకిలు తొక్కుకుంటా మాపుసారికి వస్తా వుండ్య. ఒక సావు కాదు మాది. నాను పదవ తరగతి పాసు అయినాక తిరపతి వేదపాఠశాలలోన సీటు వచ్చిండ్య. మాయమ్మ వద్దే వద్దు అని మొండికి పెట్టుకున్య. "మనము అనుభవించింది సాలదా? మన పిల్లోల్లకి కూడా ఈ ఉరులు ఏంటికి?" అని ఒక దినమంతా అన్నం తినల్యా. అట్లా మాయమ్మ ఒక నరకము నుంచి నన్ని తప్పించ్య. ఏండ్ల తరబడి ఎంత కాయకష్టం సేసినా, ఎన్ని ఊర్లల్ల పురోహితం సేసినా మా దరిద్రము తెగల్యా. ఒక దినము మాయమ్మ మా నాయనతో అన్నము తినేతప్పుడు "సెడి పట్నం సేరమని పెద్దలు సేప్పెర్య.

ఈడ ఇంక అయ్యేటట్ల లేదు. పిలగాల్లని ఎమ్మగనూరుకు పంపిద్దాము. ఆడనే ఒక రూము తీసుకొని సదువుకుంటారు. ఈ బతుకులు మన పిల్లోల్లకి వద్దు. సేద్యము లోన, పురోహితం లోన పిల్లోల్లు బతకలేరు" అన్య . "మా నాయన ఇంత మందిని గుంజగలమా?" అనే . "ఎట్లనో దైర్యం సేయల్ల" అన్య మా యమ్మ.

నాను, మాయన్న దత్తయ్య, మా అక్క ఎంకటమ్మ, మా తమ్ముడు సీను ఎమ్మగనూరుకు సేరుకుంటిమి. లచ్చిమి పేటలో నూరు రూపాయల బాడిగకి ఇల్లు తీస్తిమి. మా పెద్దమ్మ కొడుకు సత్యన్న ఒకనాడు మా యింటికి వచ్చి "సోమప్ప నగరులోన కొత్తగా ఆంజనేయస్వామి గుడి కట్టేర్య. పొద్దున్న, మాపుసారి గుడి పూజకి పోతే నెలకి యాభై రూపాయలు జీతం ఇస్తారంట. దచ్చినలు ఒక నూరు రూపాయల కాడికి నెలకి రావొచ్చు" అని సెప్య. మా యన్న ఒప్పుకున్య. ఇంటి బాడిగ ఎల్లిపోతాదని మా ఆశ. మాము శ్రద్ధగా గుడికి పోయేది సూసి మా సత్యన్న అన్ననే మాత్రాల తిమ్మప్ప గుడి కూడా వుండాది చేస్తారా? నెలకి యాభై ఐదు రూపాయలు ఇస్తారు" అని అడిగ్య . మాయన్న "సరేలేనా. మాము ముగ్గురము వుండాము. ఎవురో ఒకరు పోతాములే" అన్య.

ఎమ్మగనూరు టౌను కదా! గుడ్లకి శనివారము, సోమారము దచ్చినలు వస్తూ వుండ్య. చిన్నగా ఇంటి కర్చులకి ఇబ్బంది తగ్గుకుంట వచ్చ్య. మాయమ్మ, మానాయన కూడా గువ్వలదొడ్డి ఇడిసిపెట్టి ఎమ్మిగనూరుకు వస్తామనిరి. ఊర్ల వున్న ఇల్లు ఖాళీ సేసి ఈడిగి దుల్లయ్య బండి మాట్లాడుకొని సామాను అంతా బండిల ఏసుకొని ఎమ్మిగనూరుకు బయలుదేరితే వూరు ఊరంతా బాధ పడ్య. మాయమ్మ ఏడుపు ఏడుపు కాదు. ఊర్ల వున్న ఆడోల్లు అంతా మాయమ్మకి దైర్యం సెప్పిరి. "ఏంటికి ఏడుస్తావు లేమ్మా? ఈ వూరికి వచ్చిన కాడ్నించి ఒక్క దినము సుఖ పడల్యా! బాపనోళ్ళు అయినా కనా కష్టం సేస్తిరి. ఏం సేస్తావు లేమ్మా. గాశారము అట్లా వుండాది. మాము కూడా వూరు ఇడసక తప్పేటట్ల లేదు. అప్పుడే శాన మంది బొంబాయికి పోయెర్య కదా? అన్ని వూర్లోల్లు మన వూరు సుగ్గికి వస్తుండ్రి. ఇప్పుడు మన ఊరే సుగ్గికి పోయే గతి పట్ట్య. ఏం సేస్తాం మన ఖర్మ" అనిరి.

ఎమ్మగనూరుకి అందరు సేరుకొంటిమి. దీపావళి, ఉగాది, దసరా పండగలకి మా నాయనని, మా అన్నని అంగడి పూజలకి పిలుస్తుండ్రి. ఆయప్పోల్లు ఇద్దరు సంకల బుక్కు పెట్టుకొని బజార్ల తిరుగుతా వుండ్రి. ఎవురో ఒకరు పూజకి పిలుస్తా వుండ్రి. ఇంతలోన మా అక్క సేతికి వచ్చ్య. మా అక్క పెండ్లి తలుసుకొంటేనే మాకి భయము అయితా వుండ్య. మా అక్క గొంతులోన ఒక తులం బంగారం గొలుసు కూడా లేని దరిద్రులము అని మాయమ్మ బాధపడతా వుండ్య. గతము (మౌఢ్యమి) పడినప్పుడు మాత్రం ఎమ్మగనూరులో కూడా కష్టంగా వుంటుండ్య.

ఒకనాడు తినేకి ఇంట్లో ఏమీ లేకుండ్య. పక్కనే మా పెద్దమ్మోల్లు వున్నా మా కష్టం మాయమ్మ వాళ్లకి ఏమీ సెప్ప కుండ్య. యానాడు వాళ్ళని ఒక సేరు బియ్యము అడగల్యా. అంత ఆత్మాభిమానము కలిగినాయమ్మ. ఎట్లరా దేవుడా అనుకొంటా వుంటే ఒక ఆయప్ప పంచాంగం సూసేకి వచ్చ్య. పది రూపాయలు దచ్చిన పెట్ట్య. మా కండ్లు అన్ని ఆ పదిరూపాయల మీదే. ఆయప్ప పంచాంగము సేప్పించుకొని పోయినాక మామందరమూ ఆ పది రూపాయలతో ఏమి సేయాలప్పా అనుకొని కడాకి టీ, బన్ను తెచ్చుకోవాలని అనుకొంటిమి. మా తమ్ముడు సీనుని బన్ను తెచ్చేకి పంపితిమి. వాడు బన్నులు తెస్తా వుంటే కోతి వాట్ని ఎత్తకపోయింది. పాపం వాడు ఏడుసుకొంటా వచ్చ్య . ఆ దినం మా జీవితములోన మరసిపోలేము. అందరమూ ఒకరిని సూసి ఒకరు ఏడుసుకొంటా టీ తాగి ఆకలిని జయిస్తిమి.

ఇంగ ఇట్లా కాదని మా అక్క ఇంటికాడ ట్యూషన్ స్టార్టు సేస్య. ఒక ముప్పై మంది పిల్లలు రాబట్టిరి. కాన్వెంట్‌లోన టీచరుగా సేరె. ఇంగ మా అక్క పెండ్లి గురించి ప్రయత్నాలు మొదలు పెడితిమి. మా అదృష్టానికి ఆ ఏడు సేనులోన గుర్నాలు (పొద్దు తిరుగుడు) వేసింటిమి. పంట బాగా వచ్చ్య. ఒక ముప్పైఐదు వేలు సేతికి వచ్చ్య. మా తుక్కు బాపనోళ్ళ అమ్మాయి పెండ్లి అంటె అంతకు మించిన కష్టము ఇంకోటి వుండదు. మామే అమ్మాయిని తీసుకొని అబ్బాయికి సూపిచ్చుక రావల్ల. పాపం మానాయన మా అక్కని వెంట బెట్టుకొని సంబంధం వుంది అని సెప్పిన కాడికెళ్ళ పోయి వస్తా వుండ్య. మా తాహతుకి తగిన సంబంధం దొరకడం శాన కష్టంగా వుండ్య. ఎట్లేట్లో కర్నూలుల ఒక సంబంధము కుదిర్య. వాళ్ళ దగ్గర వీళ్ళ దగ్గర అప్పు సేస్తిమి.మాదాంట్లో మామే పెండ్లి సేసి యియ్యల్ల. ఎట్లప్పా అనుకొంటా వుంటే మాయమ్మే “ఊర్ల వున్న ఇల్లు అమ్ముదాము. ఇంగ ఊర్ల ఎవురు ఉండేటట్ల లేదు. ఏంటికి ఇంక. అమ్మిదుద్దాము” అన్య. అందరమూ ఇల్లు అమ్మేకి నిర్ణయము తీసుకొంటిమి. మా అక్క పెండ్లి కూడా మా ఎగితి వున్నకాటికి ఘనంగానే సేస్తిమి. మా అన్నదమ్ముల పట్టుదల, మాయమ్మ నాయనలు పడిన కష్టాన్ని అందరు మెచ్చుకొనిరి. మాయమ్మ సంబరము సేప్పనీక్య ల్యా. ఒగ మూడేండ్లు మా అక్క పెండ్లి గురించే మాయమ్మ వచ్చినోల్లకంత కథలు కథలుగా సెబుతావుండ్య. అట్లా అప్పుడు మా అక్క పెండ్లి కోసము అమ్మిన ఇల్లు మళ్ళా ఇప్పుడు మాకి అమ్మకానికి మా దగ్గరికి వొచ్చింది. ఈడిగ చిన్న భీమన్నకి ముప్పైఐదు వేలకి అమ్మింటిమి. ఇగ ఇట్లా మళ్ళా మా ఇల్లు మాకే అమ్మకానికి వచ్చ్య. చిన్న భీమన్నను తలుసుకోని ఆయప్పకి ఏమి కష్టము వచ్చినదో అని బాధ పడుకుంటా నిద్దరనే పట్టల్యా. కాల్వ ఉన్నప్పుడే మా బతుకులు అట్లా వుండ్య, ఇంగ కాల్వ ఎండిపోయినాక ఊర్ల రైతుల పరిస్తితి ఎట్లుండాదో ఏమో అనుకుంటా వుంటే సెల్లులోన మెసేజి వచ్చ్య. రాయలసీమ నీళ్ళ హక్కుల కోసం కర్నూలులోన క్రిష్ణదేవరాయల విగ్రహము దగ్గర ప్రజాసంఘాలోల్లు ధర్నా సేస్తా వుండారు అందరు పాల్గొనండి అని వుండ్య. ఎట్లా అయినా గాని ధర్నాలోన పాల్గొనాల అని గట్టిగా అనుకొంటిని. అప్పుడుగాని నాకి నిద్ర పట్టల్యా.



98486 26114

# బోగన్ విలియా

కళ్యాణదుర్గం స్వర్ణలత

నియాన్ లైట్ల వెలుతురు గదంతా వ్యాపించింది. ఫాల్స్ రూఫింగ్‌లో సీలింగ్‌కు వుండే క్యాసెట్ మోడల్ ఎ/సి ల చల్లదనం పరచుకుంది. వట్టివేళ్ళ రూం ఫ్రెష్‌నర్ వేసినట్లున్నారు. పరిమళం ప్రశాంతతను ఇస్తోంది.

విశాలమైన గదిలో ఓ ప్రక్కగా సీల్డ్ మినరల్ వాటర్ బాటిల్స్ మరో ప్రక్కగా సిస్టమ్ ఆపరేటర్.

ఓ గోడకు తెల్లనైన బోర్డు. పక్కనే పాయింటర్, ప్రొజెక్టర్ ఆన్ అయ్యి వుంది.

రూమ్‌లో ఓ పది కుర్చీలు... రాసుకోవడానికి వీలుగా ప్లాంక్స్ వున్నాయి... మీటింగ్‌కు నాతో బాటు అటెండ్ కావాల్సిన అందరూ బయట కబుర్లు పెట్టారు.

ఓ ఐదారు నిమిషాలు గడిచాయి... గబగబ బయట వున్న వాళ్ళు లోపలికి వచ్చి కూర్చున్నారు. అంత ప్రశాంతంగా వున్న గదిలో వున్నా... అందరి కళ్ళల్లో భయం తాలూకు పిరికితనం... ఎవరి మొహాల్లోనూ ఉత్సాహం లేదు. వాళ్ళ మొహాల్లో లేని సంతోషాన్ని నేను వెతుక్కుంటున్నంతలో సి.యి.ఓ. ఉమేష్ పరుగులాంటి వేగంతో గదిలోకి వచ్చాడు.

అందరూ గబుక్కున నిల్చున్నారు. రావడంతోటే ఉమేష్...

“వాసూ ! వీకెండ్ టెస్ట్ ప్రొజెక్ట్ చెయ్యి” అన్నాడు.

అందరి కళ్ళల్లో మరీ భయం శాతం పెరిగిన ఆనవాళ్ళు.

ఇంటర్‌డ్యూసింగ్... విషింగ్ లాంటివేమీ లేకుండా... "ఈ వీకెండ్ రిజల్ట్స్ చూశారా... మీ బ్రాంచ్‌ను మీరు గమనిస్తున్నారా... అసలు ఫిజిక్స్, కెమిస్ట్రీలో ఆ మార్కులేంటి, ఫెయిల్యూర్ పర్సంటేజ్ చూస్తే మీకు సిగ్గేయదా. బాయ్స్ క్యాంపస్ చాలా పూర్‌గా వుంది... ఐ.సి. క్యాంపస్‌లో కెమిస్ట్రీ దారుణం..." అంటూ వైట్ స్క్రీన్ మీద గ్రాఫ్ చూపించాడు. అందరి మొహాల్లో విచిత్రమైన భయం. "ఇలాంటి మార్కులతో ఇలాంటి రిజల్ట్స్‌తో మనం కార్పోరేట్‌లో నిలబడితే నవ్వుతారందరూ. అందరూ రిజల్ట్స్ గురించే ఆలోచించండి. ఇక రెసిడెన్షియల్ బాయ్స్ క్యాంపస్ రిజల్ట్ చూడండి" అంటూ స్క్రీన్ మీద చూపాడు. అందరూ ఒక్కసారి స్క్రీన్‌ను చూడ్డం మానేసి భూపాల్‌రెడ్డిని చూడ్డం మొదలుపెట్టారు. త్వరత్వరగా రంగులు మారుతోంది ఆ మొహం ... కత్తిగాటుకు రక్తం చుక్క లేదన్న మాటకు సరైన నిదర్శనం బహుశా ఇదేనేమో... పాయింటర్ 68% దగ్గర ఆగింది. "ఇంత పూర్ రిజల్ట్ ... వీకెండ్ టెస్ట్స్‌లో ఎప్పుడూ చూడలేదు. రెసిడెన్షియల్‌లో వుండే పిల్లలు వాళ్ళు... 24 గంటలు మీతోనే వుంటారు. ఎంత బెస్ట్ రిజల్ట్ తేవచ్చు... నో... మీరసలు ట్రై చేయడం లేదు. భూపాల్ నీవిలా ఐతే కష్టం... నేనూ మరో రకంగా ఆలోచించాల్సి వస్తుంది." చాలా కఠినమౌతుంది ఉమేష్ కంఠస్వరం. అందరి గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయి. "వాసూ... అటెండెన్స్ ప్రొజెక్టు చెయ్యి" అంటూ పాయింటర్‌ను స్క్రీన్ దగ్గరకు తీసుకెళ్ళాడు ఉమేష్... "చూశారా... గర్ల్స్ క్యాంపస్ ఫస్ట్ పొజిషన్ 98%" అనగానే అందరూ గర్వంతో ఉబ్బిన సునంద మొహం కేసి చూశారు... "ఇంక మెడికల్ క్యాంపస్, ఇంజనీరింగ్ క్యాంపస్ ఇంకా ఇంప్రూవ్ చెయ్యాలి. అటెండెన్స్, వీకెండ్ రిజల్ట్స్, ఎంసెట్ రిజల్ట్స్‌లో ఇంప్రూవ్‌మెంట్ చూపకపోతే కుదరదు." చాలా కఠినంగా మాటలు తూటాల్లా అందరి గుండెల్లో గుచ్చుకుంటున్నాయి. "ఇంప్రూవ్‌మెంట్ కోసం ఇంకా మీరు చాలా ట్రై చెయ్యాలి..." చెప్పేశాడు ఉమేష్.. దాని కంటే అరిచేశాడు... అన్న పదం కరెక్ట్ ఏమో.

"ఇంప్రూవ్ ఇంప్రూవ్ ఇంప్రూవ్ బాగా గుర్తు పెట్టుకోండి, ఇక మీరెళ్ళొచ్చు... ఒక్క నిమిషం... మీకు పరిచయం చేయాల్సిన వ్యక్తి... కొత్తగా రెసిడెన్షియల్ గర్ల్స్ క్యాంపస్ ప్రిన్సిపల్‌గా అపాయింట్ అయ్యారు. 20 సంవత్సరాల ఎక్స్పీరియన్స్ ప్రైవేట్ కాలేజీలో" అంటూ నన్ను చూపాడు...

అందరూ ఒక్కసారి నన్ను చూసి నవ్వీ నవ్వనట్లుగా కళ్ళతో పలకరించారు. నేను 'నమస్తే!' చెప్పా. అంతే డిస్పర్స్... మరో వీకెండ్ ఎగ్జామ్ అయ్యింది... ఆదివారం.

ఉదయం ఎంసెట్ ఎగ్జామ్స్ రాస్తున్నారు అమ్మాయిలు.

11.30 కంతా క్యాంపస్ మొత్తం వందల మంది పేరెంట్స్‌తో సందడిగా వుంది. 12 గంటలు కాగానే క్యాంపస్ మొత్తం ఆనందాలకు, ఆత్మీయతలకు వేదిక అయ్యింది. తల్లిదండ్రులు

పెద్ద పెద్ద క్యారియర్లతో ఇష్టమైన చిరుతిళ్ళ బ్యాగులతో వేచి వున్నారు. బెల్ మోగడంతోటే పిల్లలు బయటకు వచ్చి వాళ్ళ ఆత్మీయుల్ని హత్తుకొని ఏడుస్తున్నారు. అందరి కళ్ళల్లో నీటి పొర... అందరి ప్రయత్నం తమ కన్నీళ్ళు దాచుకోవాలనే కానీ వాటికి బయట పడాలనుంది మరి... ఆపగలమా...

"బక్కగా అయ్యావేందిరా"... "తినాల నాన్న".... "హాస్టల్‌లో నచ్చకపోతే క్యాంటీన్‌లో ఐనా కొనుక్కోరా తల్లీ..." ఆల్‌మోస్ట్ ఇలాంటి మాటలే..

క్లాసెస్ వున్నప్పుడు అంత అందంగా కన్పించని పిల్లలు పేరెంట్స్ వస్తున్నారనగానే చక్కగా తలారా స్నానాలు చేసి అందంగా ముస్తాబయ్యారీరోజు... కానీ దాగనిది ఒకే కన్నీటి పొర... 'మేడమ్ పేరెంట్ మీతో మాట్లాడాలట...' ఆయా వచ్చి చెప్పింది... రమ్మన్నా... వచ్చిన పేరెంట్ విష్ చేసి కూర్చున్నాడు. "ఫస్ట్ ఇయర్ బై.పి.సి. గాయత్రి మా అమ్మాయే..." అన్నాడు.

"అలాగా గుడ్.. అమ్మాయి బాగా చదువుకుంటుందిలే... నో వర్రీ.." ఈ కొంతకాలంలోనే తనను బాగా గమనించానన్న నమ్మకం నా కంఠంలో ధ్వనించేలా... "థ్యాంక్స్ మేడమ్.. కానీ తనకు హోం సిక్ ఎక్కువ... చాలా ఏడుస్తుంది... రాలేక పోతే ఫోన్ చేసి ఏడుస్తుంది... ఇక ఈ వేళ మేం వెళ్ళాక... ఎలా" అని బాధతో అన్నాడు. కళ్ళల్లో వచ్చిన నీటి పొరను మ్యానేజ్ చేస్తూ ప్రక్కగా వున్న క్యాలెండర్‌ను చూస్తూ... "పర్లేదు పిల్లలు మీరున్నప్పుడు ఏడుస్తారు. తరువాత చదువులో పడతారు.. ఫ్రెండ్స్... క్లాసెస్... ప్రిపరేషన్... మిమ్మల్ని త్వరగానే మరచిపోతారు." నా గతానుభవం ఇలా ప్యాసిఫై చేయడానికి బాగా ఉపయోగపడ్తుంది. 3 గంటలకు బెల్ మోగడంతో బరువైన గుండెలతో ఖాళీ అయిన క్యారియర్లతో వచ్చిన వాళ్ళందరూ వెళ్తున్నారు. టాటాలు, బాయ్ బాయ్‌లు... ఏడుపులు... ఆలింగనాలు... ఆనందాలు... సంతృప్తులు.. ఒక్కొక్కరి మొహంలో ఒక్కో భావన ప్రాంగణమంతా కాసేపు ఆప్యాయతల పూలు పూసి.. పరిమళించి... వాడిపొయ్యింది.

మెల్లగా పలుచపడి... ఖాళీ అయింది ప్రాంగణం...

సెక్యూరిటీ తన డ్యూటీ చాలా వేగంగా చేశాడనుకుంటా...

నా ఛాంబర్‌లోకి వెళ్తూ చూశా... బయట గాయత్రి ఏడుస్తూ నిలుచుంది. లోపలకు రమ్మని సైగ చేసి వెళ్ళి నా చైర్‌లో కూర్చున్నా. వచ్చి నిల్చుంది. "చెప్పు నాన్నా" అన్నా ప్రేమగా. "మేడం ఈ ఎనిమిది బుక్స్ చదవడానికి నేను అమ్మా, నాన్నా, అత్తయ్యా, మామయ్యా, అమ్మమ్మ, తాతయ్యా, చెల్లి, తమ్ముడు అందర్నీ వదలి వుండాల్నా.... ఒకర్ని వదలిపెడితే ఓ బుక్ చదవచ్చా... వాళ్ళతో వుంటూనే ఇంటర్, ఎంసెట్ బుక్స్ చదవలేనా..." అంటూ ఏడ్చేసింది... నాకు మనసంతా వికలమైంది.

“అలా కాదురా గాయత్రీ! నీ మంచి భవిష్యత్తు కోసమేగా నాన్నగారు కష్టపడ్తున్నది. నీవు గ్రోనప్‌వి కదా... జీవితానికి ఆశయం వుండాలి.. అది సాధించడం కోసం శ్రమ తప్పదు... ఇక అమ్మానాన్నలతో కలసి వుండడమా... అది జీవితాంతం వుంటాం. ఇప్పుడు నీ ధ్యేయం అది కాదు. నీ గమ్యాన్ని నీవు చేరినపుడు వాళ్ళ ఆనందాన్ని కొలవగలవా” అన్నా... తన చేతుల్ని నా చేతుల్లోకి తీసుకుంటూ... సడెన్‌గా గాయత్రి కింద కూర్చోని నా ఒళ్ళో తల పెట్టుకుంది... ఏడుస్తోంది. నాలోని మాతృత్వం మేల్కొని, తన తల నిమిరాను.

మరికాసేపు తనను అలాగే వుండనిచ్చి “లే నాన్నా... రిలాక్స్... యు కెన్ డూ యిట్... నీవు ఈ కాలేజ్ టాపర్‌వి కావాలి... ఫస్ట్‌టైం లోనే మెడికల్ సీటు సాధించాలి” అంటూ చాలా సేపు మోటివేట్ చేశా... నా మోటివేషన్‌కు నాకే సంతోషమైంది. గాయత్రి కళ్ళల్లో బేలతనం పోయి కాన్ఫిడెన్స్ కన్పించింది. తాను “థ్యాంక్స్ మామ్.. గుడ్ యీవినింగ్” అంటూ వెళ్ళిపోయింది. కానీ ఆ తడికళ్ళు చాలాసేపటి దాకా నన్నే చూస్తున్న భావన నాకు.. విద్యా విధానం మీద, మెకాలే మీద చాలా కోపం వస్తోంది. ఆత్మీయుల కోసం ఆరాటపడేట్టు చేస్తున్న చదువుల మీద మరీ కోపంగా వుంది... అంతలో హెడ్ ఆఫీసు నుండి ఫోన్.. హలో అన్నా.. ‘మేడం మీ ఎగ్జాం అటెండెన్స్ ఇంకా ఆన్‌లైన్‌లో పెట్టలేదే’ అన్నారవతల. ‘అవును కంప్యూటర్ ప్రాబ్లమ్ వుంది... ఇప్పుడు రిపేర్ చేస్తున్నారు. అయ్యాక పెడతా’ అన్నా... సిస్టమ్ వున్న గది వైపు వెళ్తూ... ‘మీ దగ్గర కుదిరితే పెట్టండి లేదా డీటైల్స్ వేరే బ్రాంచ్‌కు పంపి అక్కడ నుండి ఆన్‌లైన్‌లో పెట్టించండి... ఇప్పటికే చాలా ఆలస్యమైంది...’ కాస్తంత కటువుగా చెప్పారవతల. 10 నిమిషాల్లో మళ్ళీ ఫోన్ ‘ఇంకా అటెండెన్స్ పెట్టలేదే...’ ‘లేదు, వెళ్ళారు.. పెడుతున్నారన్నా’ నమ్రత ధ్వనించేట్లు. ఈ కాల్ కట్ అవుతుండగానే లోకల్ ఆఫీస్ నుండి ఫోన్, అటెండెన్స్ ఆన్‌లైన్‌లో పెట్టరా... ఏంటి ఆదివారం ఎంజాయ్ చేస్తున్నారా... నేను హైదరాబాద్‌కు రిపోర్టు ఏమని పంపాలి... మీ బ్రాంచ్ లేదనా’ వెటకారంగా అన్నారవతల. ‘ఊరి బయట వున్నాం కదా.. సిస్టమ్ ప్రాబ్లం, వీలైనంత త్వరగా పెడతాను.’ తప్పు చేసిన భావన ధ్వనించింది నా గొంతులో...

అంతలో చేతిలో అటెండెన్స్ రిజిష్టర్‌తో కంప్యూటర్ ఆపరేటర్... ‘మేడం చూడండి సాయినిత్య ఆబ్‌సెంట్’ అంటూ వేలు పెట్టి చూపించాడు.

“అయ్యో ఈ అమ్మాయి క్యాంపస్‌లోనే వుండాల్నే బయటకెళ్ళే పర్మిషన్ ఇవ్వలేదు నేను.”

జూనియర్ వైస్ ప్రిన్సిపల్‌ని పిలిపించి అడిగా... ‘మార్నింగ్ వెళ్ళడం చూశా... తరువాత పేరెంట్స్‌తో మాట్లాడుతూ గమనించలేదండి.’ నా గుండె ఆగినంత పనైంది. హాస్టల్‌లో అమ్మాయి కనిపించలేదంటే మాటలా... అయ్య బాబోయ్... పేరెంట్స్... ప్రెస్... నాకు కాస్తంత టెన్షన్ పెరిగింది... హాస్టల్ వార్డెన్‌ను ఫ్లోర్ ఇన్‌ఛార్జ్‌ను పిలచి వెతకమన్నా... కాసేపట్లో ఫ్లోర్ ఇన్‌ఛార్జ్

వచ్చి 'మామ్ తాను ఫస్ట్ పీరియడ్ అయ్యాక వామిట్ అయితే రూముకు వెళ్ళిందట' అంది. పరుగు లాంటి నడకతో ఆ అమ్మాయి గది దాకా వెళ్ళాను... పడుకోనుంది సాయినిత్య... 'అమ్మయ్య వుంది.. చాలు' అనుకుంటూ ఒక్కసారి తాకి చూశా... ఒళ్ళు కాలిపోతుంది.. డాక్టర్‌ను పిలిపించి టాబ్లెట్స్ ఇచ్చాక... వాళ్ళ పేరెంట్స్‌కు ఫోన్ చేశా... 'మేము రాలేదని దిగులు పడివుంటుంది మేడమ్ ప్లీజ్. వచ్చేస్తాం అని చెప్పండి' అన్నారు వాళ్ళ నాన్న కంగారుగా...

నిత్యకు సెలైన్ పెట్టారు... తనను చూస్తే జాలేసింది. అంతలో మళ్ళీ ఫోన్, అటెండెన్స్ ఇంకా ఆన్‌లైన్‌లో పెట్టలేదని... త్వరత్వరగా ఆపరేటర్‌ను పంపి డీటైల్స్ అప్‌లోడ్ చేయించా... సాయంత్రం 8 గంటలకు బెల్ మోగగానే పుస్తకాలు పక్కన పెట్టి జూనియర్ అమ్మాయిలు డిన్నర్‌కు బయలుదేరారు.

తాము మధ్యాహ్నం తిన్న వెరైటీలకు ఇప్పటి ఫుడ్‌కు కంపేర్ చేస్తున్నారందరూను. గాయత్రి నా దగ్గరగా వచ్చి 'బాయ్ మామ్ గుడ్‌నైట్' అంది కళ్ళల్లో కొత్త మెరుపుతో... ప్రతి వారం వీకెండ్ రివ్యూలు. అటెండెన్స్ రివ్యూలు బాగా అలవాటు పడ్డాను. అరుపులలాంటి ఆ మీటింగ్స్‌లో ఫీలింగ్స్ బయట కనపడకుండా కూర్చోవడానికి, పవర్ పాయింట్ ప్రెజెంటేషన్‌తో ప్రతివారం ఒక్కో బ్రాంచ్‌కు అక్షింతలు, మంగళహారతులు... మొత్తం 8 బ్రాంచీలు... 8 మంది ప్రిన్సిపల్స్ ఎప్పుడూ చేతులు కట్టుకొని దోషుల్లాగా... వట్టివేళ్ళ గుభాళింపు, నియాన్ లైట్ల వెలుతురు, ఎ/సి చల్లదనం ఏవీ ఎవరూ గమనించరు. వైట్ స్క్రీన్‌పై ప్రొజెక్ట్ అవుతున్న దానిలో తమ కాలేజి ఏ పొజిషన్‌లో వుందన్నదే ఆలోచన... మీటింగ్ అయ్యాక ఎవరి పరుగులు వాళ్ళు... ఇక మిడ్ టర్మ్ ఎగ్జామ్స్ స్టార్ట్ అవుతున్నాయి. క్యాంపస్ మొత్తం సైలెంట్‌గా సమాధులతో వున్న శ్మశానంలా వుంది.

అందరు పిల్లలు, యస్.యల్స్, జె.యల్స్, వైస్ ప్రిన్సిపల్స్ అందరూ ప్రతి సెకండును వినియోగిస్తున్నారు. డౌట్స్ క్లారిఫికేషన్‌కు ఈ ఎగ్జామ్స్‌కు యస్.యల్స్ కూడా వుంటున్నారు.

బహుశా ఉమేష్ వీళ్ళకూ క్లాస్ తీసుకున్నాడేమో. ప్రతి ఒక్కరూ పుస్తకాల వంక చూస్తూ కొందరు మరో పుస్తకంలో నోట్ చేస్తూ... నాకనిపించిందపుడు... ఒక వేళ ఊపిరి తీసుకోవడం ఒక పని అయ్యుంటే వీళ్ళెవరూ తీసుకునే వాళ్ళు కాదేమో ఎందుకు టైం వేస్ట్ అని.

ఆ దేవుడి దయ ఊపిరి తీసుకోకపోయినా అదే ఆడుతుంది... బ్రతికిపోయారు...

నా భావనకు నాకే నవ్వు వచ్చి పెదాలు కొద్దిగా విప్పారాయి.

అబ్బ ! నేను నవ్వాను... అవును ఇందాక నవ్వాను... ఎన్నాళ్ళయ్యింది ఈ మాత్రం నవ్వక... ఇక్కడికి వచ్చాక బహుశా ఇదే మొదటి నవ్వు అనుకుంటా...

ఆశ్చర్యం... అవును ఎప్పుడూ నవ్విన సందర్భాలు లేవు. ఎంతసేపు రిజల్ట్స్, అటెండెన్స్, మీటింగ్, వెరిఫికేషన్ మార్క్స్ కంపారిజన్... ఇలా అంతే కదా...

అయ్యో ... నేనూ నవ్వడం మరచిపోతున్నానే... ఎలా?

వైస్ ప్రిన్సిపల్స్‌ను పిలచి అడిగా... పిల్లలు ఎలా చదువుతున్నారని... "టర్మ్ ఎగ్జాం ఆన్సర్‌షీట్స్ వేరే క్యాంపస్‌కు వెళ్తాయి. ఆన్సరింగ్ మెథడ్‌లో కాస్త తేడా వచ్చినా టోటల్ తగ్గుతుంది... ర్యాంకు పోతుంది. యస్.యల్స్, జె.యల్స్ హెల్ప్ తీసుకోండి... ప్రతి విద్యార్థి ప్రతి ఆన్సర్ కరెక్ట్‌గా రాయగల్గేట్టు ప్రాక్టీస్ చేయించండి... ఎక్కడా మిస్ అవ్వకూడదు." నా కంఠంలో నుండి ఉమేష్ స్వరం ధ్వనించింది నాకే...

"ఓకే మామ్, మేము చూస్తున్నాము" అన్నారిద్దరూ. నా ఛాంబర్‌లోకెళ్ళి కూర్చున్నా. ఫ్యాన్ చాలా చిన్నగా తిరుగుతున్నట్లనిపించి స్పీడ్ పెంచే ప్రయత్నం చేశా... ఆహా... అది ఆల్‌రెడీ ఐదులో వుంది కానీ గాలే నాకు చాలట్లేదు.. గుండె వేగం పెరుగుతోంది... వీకెండ్ ఎగ్జాం మీటింగ్స్‌లోనే రంకెలు వేసే ఉమేష్ ఈ మిడ్‌టర్మ్ రిజల్ట్‌కు ఎలా రియాక్ట్ అవుతాడో...

ఎగురుతాడో... కరుస్తాడో... ఏంటో....

క్రూరంగా గ్రాఫ్‌ను వైట్ స్క్రీన్‌పై చూపుతున్న ఉమేష్ కనపడ్డాడు నా కళ్ళకు.

టేక్ ది నేమ్ ఆఫ్ ది డెవిల్ హియర్ ఇట్ కమ్స్ మై లార్డ్ అన్నట్టు క్యాంపస్ ముందు కార్ ఆగిన చప్పుడు...

వెంటనే పరుగులాంటి నడకతో అన్నీ క్లాస్ రూమ్స్, హాస్టల్స్‌కు వెళ్ళిన ఉమేష్...

ప్రతి క్షణం ప్రతి ప్రదేశంలో ఎక్కడ తప్పు దొరుకుతుందా అన్న ప్రయత్నం...

ఓ పది నిముషాల్లో నా ఛాంబర్‌లో నా సీటులో కూర్చొని నన్ను పిలిపించాడు. ఫ్లోర్ ఇంఛార్జ్‌ను మొదలుకొని, వార్డెన్స్, జె.యల్స్, యస్.యల్స్ అందర్నీ కలిపి టకటక చడామడా వుతికి, పిండి, జాడించి, ఆరేసి ప్రశాంతంగా వెళ్ళిపోయాడు... తాను.

తుఫాను మిగిల్చిన బీభత్సాన్ని గుర్తు చేసేట్లుగా అందరి మొహాల్లో ఓ నిర్లిప్తపు చూపు... లైవ్ మర్డర్ చూస్తున్నంత భయం...

మళ్ళీ అందర్నీ ప్యాసిఫై చేసి క్లాసెస్‌కు పంపాను. టర్మినల్ ఎగ్జామ్స్ ఇక కెమిస్ట్రీ మాత్రం వుంది. అయ్యాక ఒక వారం సెలవులు.. ఏదో సాధించబోతున్నా అన్న ఉత్సాహం... యస్.యల్స్‌ని, జె.యల్స్‌ని పిలచి స్లో లర్నర్స్ గురించి కూడా ఆరా తీశా... నో ప్రాబ్లమ్... బాగా ప్రిపేర్ అయ్యారందరూ... ఈ ఎగ్జామ్స్ అందరూ ఇక బాగా రాసేస్తారన్నారంతా... అంతలో హెడ్ ఆఫీసు నుండి ఫోన్... 'గుడ్ మేడమ్' మీ బ్రాంచ్ బాగా ఇంప్రూవ్ అయ్యింది. రిజల్ట్, అటెండెన్స్ బాగా ఇంప్రూవ్ చేశారు... హ్యాపీ అన్నారవతల... నేను గాలిలో తేలిపోతున్నట్లనిపించింది. ఇక రేపొక్కటే... అందరూ కెమిస్ట్రీ బాగా రాసేస్తే చాలు... ఈసారి మీటింగ్‌లో నేను సునందలాగా గర్వంగా అందరి కళ్ళ వంక చూడొచ్చు... అనుకుంటూ ఛాంబర్‌లో కూర్చున్నా... స్టూడెంట్స్, జె.యల్స్, యస్.యల్స్ అందరూ స్టడీ అవర్‌లో వున్నారు...

సాయంత్రం 6:30 దాటింది... కాస్త సఫకేషన్ అన్పించి టాప్ ఫ్లోర్‌కి వెళ్ళా... ఓ ఐదు నిమిషాల్లో ఆయా వచ్చింది. పేరెంట్ కలవడానికి వచ్చారని చెప్తూ... కాస్త అయినా చల్లగాలికి వుండనివ్వరే అనుకుంటూ మళ్ళీ ఛాంబర్‌కు వచ్చా... వచ్చింది గాయత్రి వాళ్ళ నాన్న... బాగా ఎర్రబడ్డ కళ్ళు... జుట్టు చిందర వందరగా... చాలా అలసినట్లున్న మొహం... వచ్చి కూర్చున్నాడు... అతన్ని గమనించిన నేను ఆయాతో నీళ్ళు తెప్పించా. గడగడా ఒక బాటిల్ నీళ్ళు తాగేసి 'థ్యాంక్స్' అంటూ 'గాయత్రిని తీసుకెళ్తా మేడమ్' అన్నారాయన. ఎందుకన్నట్టు చూశా...

"వాళ్ళ మామయ్య మధ్యాహ్నం బైక్ యాక్సిడెంట్‌లో చనిపోయాడు. ఇంతసేపూ హాస్పిటల్‌లో వున్నాం. రేపు మధ్యాహ్నం క్రిమేషన్... అందుకే" అన్నాడు నేలచూపులు చూస్తూ. నా గుండె ఆగినంత పని అయింది... "అయ్యో ఎలా జరిగింది యాక్సిడెంట్...? అని అడిగా..." కానీ నా మనసంతా గాయత్రి వెళ్ళిపోతే రేపటి ఎగ్జాం అటెండెన్స్ గురించి, రిజల్ట్ ఆలోచన, వైట్ స్క్రీన్‌పై నా క్యాంపస్ స్టేటస్ కిందికి పడిపోతున్న భావన... మనసంతా గాబరాగా అవుతోంది... ఒక బాటిల్ నీళ్ళు తాగా... మళ్ళీ అడిగా 'ఎలా జరిగింది యాక్సిడెంట్...'

"లారీ గుద్దేసింది. చిన్నప్పటి నుండి గాయత్రికి వాళ్ళ మామయ్య అంటే ప్రాణం... వాళ్ళిద్దరు ఎంత మమకారంగా వుంటారో మాటల్లో చెప్పలేను" అంటూ వాళ్ళిద్దరి అనుబంధాన్ని చెప్తున్నాడాయన...

నాకవేమీ విన్పించడం లేదు. కాసేపాగి నెమ్మదిగా చెప్పా... "మీరు సాయంత్రం ఫోన్‌లో గాయత్రికి విషయం చెప్పారా..." అని.

"లేదు... కంగారు పడుతుందని ఏమీ చెప్పలేదు" అన్నాడాయన. ఇక నాలోని ఎక్స్‌పీరియన్సు ఎదుటి వారి ఆలోచనలను మార్చేసే ప్రయత్నం మొదలు పెట్టింది. "అసలే గాయత్రి చాలా సెన్సిటివ్. చిన్నదానికే ఏడ్చేస్తుంది. మీరు రావడం ఆలస్యం అయినా నాతో చెప్పి ఏడుస్తుంది. అలాంటిది ఇలాంటి వార్త చెప్తే తట్టుకుంటుందా... తనకేమైనా అయితే..."

ఒక్క సెకండ్ రియాక్షన్ కోసం ఆగా... యస్ అతడి కళ్ళు కాస్త భయపడ్డట్టు కన్పించాయి....

ఓకే... మళ్ళీ కంటిన్యూ చేశా. "అసలే యాక్సిడెంట్ అంటున్నారు. అలాంటి బాడీని చూస్తే భరించగలదా తాను." చెప్తున్నా.. చెప్తున్నా...

"దయచేసి నా మాట వినండి... ఇప్పుడు గాయత్రిని డిస్టర్బ్ చేయొద్దు.. క్రిమేషన్ కానివ్వండి... రేపు సాయంత్రం నుండి ఎలాగూ హాలిడేసేగా... తాను ఇంటికి వస్తుంది. బాడీని తాను చూస్తే భరించలేదు.. సాయంత్రం కార్యక్రమాలు ముగిశాక చెప్తే ఏడుపు మాత్రమే వుంటుంది.. ఇక అంతకుమించి చూడదు కాబట్టి త్వరలోనే కోలుకుంటుంది.." చెప్తున్నా... నేను చెప్తున్నా...

అలాగే అతని కళ్ళను గమనిస్తూనే వున్నా... కాస్తంత యాక్సెప్టెన్సీ కన్పించింది... ఆ చూపులో చాలిక... నా మాట కచ్చితంగా వింటాడన్న నమ్మకం... మళ్ళీ మొదలెట్టా... తన సెన్సిటివిటీ గురించి... "అందులోనూ అమ్మాయిలు ఇలాంటివి భరించలేరు... తానొక్కతి ఏడవడం తప్ప మిగిలిన ఏ కార్యక్రమంలోనూ పాలు పంచుకోలేదు... దయచేసి ఇప్పుడు వద్దు... రేపు సాయంత్రం తీసుకెళ్ళండి..." అన్నా...

నా మోటివేషన్ బాగా పని చేసింది... "సరే మేడమ్ రేపు మా బంధువులనెవర్నైనా పంపుతా, అమ్మాయిని వాళ్ళతో పంపండి" అని చెప్పి తలదించుకొని వెళ్ళిపోయాడు.

నా మనసంతా కలతగా... గజిబిజిగా... మళ్ళీ రెండు గ్లాసుల నీళ్ళు తాగా గడగడా... వెళ్ళి చూశా... గాయత్రి స్టడీ అవర్స్‌లో వుంది... బుద్ధిగా చదువుకుంటోంది.

మనసు మీద బండరాయితో కొడుతున్న భావన... ఇంటికెళ్ళి పడుకున్నా... అహా ... నిద్ర పట్టడం లేదు...

ఏడుస్తున్న గాయత్రి ... యాక్సిడెంట్ అయిన వాళ్ళ మామయ్య ఇద్దరే కన్పిస్తున్నారు.

రాత్రి భారంగా కాదు... చాలా భయానకంగా గడిచింది. ఉదయం మళ్ళీ కాలేజ్ వెళ్ళా.... ఎగ్జాం స్టార్ట్ అయ్యింది. కెమిస్ట్రీ పేపర్ స్టాఫ్‌కు చూపించా... అందరి మొహాల్లో ఓ వెలుగు... నో ప్రాబ్లం అందరూ బాగా రాస్తారు... ఎస్సే కూడా... హ్యాపీ అన్నారు యస్.యల్స్...

అబ్బ ... కాస్త రిలీఫ్ అన్పించింది.

క్లాసెస్ వైపు వెళ్ళా... అందరితో బాటు గాయత్రి...

సిన్సియర్‌గా ఎగ్జామ్ రాస్తూ... నాకు చెంపను ఛెళ్ళుమని కొట్టినట్టనిపించింది. గబుక్కున ప్రక్కకు తిరిగా... గుండె వేగం పెరుగుతోంది... కాళ్ళు వణికినట్టు అవుతోంది... గాయత్రి వాళ్ళ మామయ్య యాక్సిడెంట్ అయ్యి రక్తం స్రవిస్తూ వుంటే వచ్చి దగ్గర నుంచున్న భావన.

'కనీసం ఆఖరిసారి చూడనివ్వలేదే...'

'ఏం సాధించావు నీవు...' నన్ను నిలదీస్తున్నాడు.

చెమటలు పడ్తున్నాయి... గొంతు ఎండిపోతోంది..

నాలుక పిడచకట్టుకు పోతోంది... వెళ్ళి ఛాంబర్‌లో కూర్చున్నా... ఊపిరి ఆడటం లేదు. వైట్ స్క్రీన్ మీద రెసిడెన్షియల్ గర్ల్స్ క్యాంపస్... టాప్ పొజిషన్... నా మొహంలో విచిత్రమైన గర్వం.. నాకెదురుగా రక్తం ధారలుగా కారుతున్న గాయత్రి వాళ్ళ మామయ్య... ఎర్రబారిన కళ్ళతో గాయత్రి... కన్పిస్తున్నారు... నేనేంటిలా... మానవత్వం నాలో కూడా నశించిందా? హృదయం ద్రవిస్తోంది...

ఔను ఇదో విషవలయం, కార్పోరేట్ విషవలయం...

ఇందులోకి అడుగు పెట్టాక మానవతను మరవాల్సిందే... ఇక్కడ బోధివృక్షం కూడా బోన్సాయి అవుతుంది. బుద్ధదేవుడు బిన్‌లాడెన్ అవుతాడు. కరుణశ్రీ కూడా కఠినాత్ముడౌతాడు.

తేనెలో పడ్డ ఈగలాగా కొట్టుకుంటూ ఇక్కడే... ఇక్కడందరూ బయట వాళ్ళకు చూడటానికి సంతోషంగా వున్నట్టు కన్పిస్తారు. ఇక్కడున్నది ఆత్మలు లేని జీవచ్ఛవాలు...

ఆలోచనలు లేని శరీరాలు...

మానవత్వం లేని మరమనుషులు...

రంగులు మాత్రమే కన్పించి...

పరిమళించని... బోగన్ విలియాలు...





94914 07655

# నళిని

డా॥ కె. చంద్ర మౌళిని

బోర్డు మీద వేసిన లెక్కలన్నీ నోట్సులో గబగబా రాసేసుకుని, డస్టర్ చేతిలో పట్టుకుని రెడీగా నిల్చునేది నళిని. పిల్లలందరూ రాసుకోవడం పూర్తవగానే బోర్డంతా నీట్‌గా తుడిచేసేది. ప్రతిరోజూ అలాగే చేసేది. ఆ డస్టర్ తీసుకొచ్చింది కూడా తనే. వాళ్ళమ్మ టైలర్ కాబట్టి మిగిలిపోయిన గుడ్డ పేలికలన్నీ కలిపి చిన్న దిండులా కుట్టించి తయారుచేసుకొచ్చింది. కాబట్టి ఆ డస్టర్‌ను ఎవరి చేతుల్లోకీ పోనిచ్చేది కాదు. బోర్డు తుడిచే పని ఎవరికీ దక్కనిచ్చేది కాదు. నేను తుడవబోయినా అడ్డుపడి మరీ తనే తుడిచేసేది. బోర్డును తుడిచిన ప్రతిసారీ డస్టర్‌ను విదిలించుకొస్తానని బైటికెళ్ళి వచ్చే నళిని ముఖమంతా తెల్లని చాక్‌పీస్ పౌడర్ అల్లుకుపోయేది. అది చూసి క్లాసులో పిల్లలందరూ ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ నవ్వేవాళ్ళు.

నళిని అంత తెలివైన విద్యార్థేమీ కాదు గానీ పిల్ల మాత్రం చాలా వినయం కలది. క్లాసులో పిల్లలెవరితోనూ పెద్దగా మాట్లాడేది కాదు. ఎవరితోనూ కలసి కూర్చునేది కాదు. అందరికీ దూరంగా చివర్లో ఒంటరిగా కూర్చునేది. రెండు, మూడు సందర్భాలలో అందరితో పాటు కలసి కూర్చోమని హెచ్చరించాను కానీ మరుసటి రోజు మళ్ళా విడిగానే కనిపించేది.

ఈ రోజు ఏవో సందేహాలున్నాయంటూ స్టాఫ్‌రూంలో వున్న నా దగ్గరికి వచ్చింది నళిని... లెక్కలు చెప్పడం పూర్తయ్యాక " ఎందుకు

ఎవరితోనూ కలవవు. విడిగా కూర్చుంటావెందుకు? బాగా చదివే పిల్లల దగ్గర కూర్చుంటే నీవు కూడా బాగా చదువుకోవచ్చు కదా!" అన్నాను.

నళిని ఏమీ మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది.

"రేపు నేను క్లాసుకొచ్చేసరికి నీవు అందరితో కలసి కూర్చుని కనిపించాలి. చివర్లో కూర్చున్నావంటే మాత్రం నేనూరుకోను" అన్నాను హెచ్చరింపుగా. నేనలా అనేసరికి నళిని ఏదో గొణుగుతున్నట్లుగా నసిగింది. అర్థం కాకపోవడంతో "ఏందే నీ బాధ" అని అడిగాను.

"వాళ్ళంతా నన్నేడిపిస్తున్నారు టీచర్" అంది కళ్ళ నిండుగా నీళ్ళతో.

"ఎందుకు " అన్నట్లు ప్రశ్నార్థకంగా చూసేసరికి...

"నేను నల్లగా వుంటా కదా !" అంటూ నళిని కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది.

నళిని చెప్పింది విని నిర్ఘాంతపోయిన నాకు తేరుకోవడానికి కొన్ని క్షణాలు పట్టింది. నళినిని క్లాసులో పిల్లలంతా "నల్లీ... నల్లీ" అని పిలవడం గుర్తొచ్చింది. ఇన్ని రోజులూ నళినిని 'నల్లీ' అని ముద్దుగా పిలుస్తున్నారని అనుకున్నా కానీ ఆ పిలవడంలో ఆ పిల్ల రంగును ఎగతాళి చేస్తున్నారని ఊహించలేకపోయా. బోర్డు తుడవడానికి నళిని ఎందుకంతలా తాపత్రయపడుతుందో ఆలోచిస్తుంటే ఇప్పుడర్థమౌతూ వుంది. చాక్‌పీస్ పౌడర్‌తో తన నలుపును కప్పిపెట్టి తన ముఖాన్ని తెల్లగా కనిపించేలా చేయాలనుకుంటున్న ఆ పిల్ల అమాయకత్వాన్ని తలచుకుంటుంటే నళిని మీద చాలా జాలేసింది. అంత చిన్న వయసులోనే శరీరపు రంగు కారణంగా.... పిల్లలందరికీ దూరమై... నళిని అనుభవిస్తున్న ఒంటరితనాన్ని తలచుకునే సరికి మనసు భారమైపోయింది. లీజర్ పీరియడ్ కావడంతో కళ్ళు మూసుకుని కుర్చీలో వెనక్కు వాలిపోయా. మెల్లగా జ్ఞాపకాల పొరల్లోంచి కదలాడిన కవిత రూపం కళ్ళ ముందు నిలచింది.

కవిత మా పిన్ని కూతురు. తను నల్లగా వుండేది. ఆ నలుపు కవితను ఎంత వివక్షకు గురి చేసిందో అంతా గుర్తుకు  రాసాగింది.

వాళ్ళ నాన్నమ్మ 'నలుపు నారాయణుడు మెచ్చు' అంటూ మొదట్లో ఎంతో ముద్దు చేసేది. కానీ ఆ ముద్దు మురిపాలు సాగింది కవితకు చెల్లెలు పుట్టే వరకే. కవిత చెల్లెలు అనిత తెల్లగా పుట్టడం కవిత పాలిట శాపమైంది. అంతవరకూ గారం చేసిన నాన్నమ్మ ప్రేమలో ఊహించని మార్పొచ్చి కవితను చిన్నచూపు చూడ్డం మొదలుపెట్టింది. దాంతో పసితనం నుంచే కవితకు తన రంగు కారణంగా తన ఇంట్లో వాళ్ళ నుంచే అవమానాలను ఎదుర్కోవాల్సిన పరిస్థితి ఎదురైంది.

పిన్ని కవితను 'కవీ! కవీ!' అని  ముద్దుగా పిలుచుకునేది కానీ నాన్నమ్మ మాత్రం 'కర్రీ! కర్రీ!' అని ఎగతాళిగా పిలిచేది. ఆ పిలుపుకు కవిత చిన్నబుచ్చుకుంటే "అసలే నల్లదానివి. ఆ ముఖాన్ని ఇంకా నల్లగా పెట్టుకుంటావేందే" అని నాన్నమ్మ పడీ పడీ నవ్వేది.

దాంతో అనిత తెల్లగా వుండబట్టే కదా... తనకీ పరిస్థితని భావించిన కవిత, అనిత మీద రాను రానూ ద్వేషం పెంచుకోసాగింది. ఇంట్లోవాళ్ళు తనకన్నా అనితకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారన్న బాధను తీర్చుకోవడానికి కవిత, అనితను తనతో ఆడుకోనిచ్చేది కాదు, ఆటవస్తువులూ ఇచ్చేది కాదు, ఇద్దరి మధ్యా వైరం ముదిరి బద్ధశత్రువులైపోయారు.

ఇంట్లో పరిస్థితి ఇలా వుంటే బళ్ళో పరిస్థితి కవితను మరింత ఇబ్బంది పెట్టేలా తయారైంది. కవిత, అనిత ఇద్దరూ కలసి బడికి వెళితే స్నేహితులంతా బ్లాక్ & వైట్ అని కామెంట్ చేసి ఏడిపించేవాళ్ళు. ఇది చాలదన్నట్లు కవిత చదివే క్లాసులో 'కవిత' అనే పేరుతోనే మరో అమ్మాయి వుండడంతో ఏ కవితో గుర్తుపట్టడం కోసం కవితను 'కర్రె కవిత' అని పిలిచేవాళ్ళు. ఆ పిలుపు విన్న ప్రతిసారీ కవిత మనసు ఎంతగానో గాయపడేది.

కాలేజీలో చేరేటప్పటికి కవితకు వయసుతో పాటు అందం పట్ల శ్రద్ధ తీసుకోవాలనే ఆరాటం పెరిగిపోయింది. దాంతో ఎక్కువ సమయం అద్దం ముందే గడిపేది. తెల్లగా కనిపించడం కోసం పౌడర్ ఎక్కువగా పూసుకొనేది. తెల్లరంగును సొమ్ము చేసుకునే వ్యాపార సంస్థల ప్రకటనలను గుడ్డిగా నమ్మేది. ఏవేవో క్రీములు వాడేది. ఎప్పుడు చూసినా ముఖానికి ఏదో ఒకటి పూసుకుంటూనే ఉండేది.

కవిత చేష్టలు చూసి ఒక్కోసారి చిరాకు, కోపం వచ్చినా వెంటనే తనపై జాలి, సానుభూతి కలిగేవి. అక్కడికీ తనను కలిసిన ప్రతిసారీ నేను తనకు ఎన్నో విధాలుగా నచ్చజెప్పేదాన్ని.

"కవీ! నీకేం తక్కువరా! అనవసరంగా విలువైన సమయం వృథా చేసుకుంటున్నావు. చదువును నిర్లక్ష్యం చేస్తున్నావు. నీవు నీ రంగును గురించిన అనవసరమైన ఆలోచనలతో సతమతమై పోతూ... ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్న దానిలా విచారంగా కనిపిస్తూ... నవ్వడమే మరచిపోయినావు. మనిషి నిజమైన అందం చెరగని చిరునవ్వులోనే దాగుంటుంది. అద్దంలో చూసుకునే ప్రతిసారీ నీవు నలుపన్న బెంగతో, నీ ప్రయోగాలు నిన్ను తెల్లబరచలేదన్న విచారంతో, నీవు అందవిహీనంగా వున్నావన్న భ్రమలో మునిగిపోయి... ఆత్మన్యూనతతో కుంగిపోతున్నావు. కానీ నీలో వున్న నిజమైన అందాన్ని నీవు గుర్తించలేకపోతున్నావు. మనసులో ఏ చింతా పెట్టుకోకుండా హాయిగా నవ్వుతూ ఒక్కసారి నిన్ను నువ్వు చూసుకో. ఆ నవ్వే నీ ముఖంలో కోటికాంతులను తీసుకొస్తుంది" అంటూ మెల్లమెల్లగా కవిత ఆలోచనలను మార్చే ప్రయత్నం చేసేదాన్ని.

కానీ కవిత తన పద్ధతిని మార్చుకునే లోపలే ఊహించని సంఘటన జరిగింది.

అనుకోకుండా బాబాయి తరపు బంధువుల నుంచి కవితకు ఒక పెళ్ళి సంబంధం వచ్చింది. కానీ పెళ్ళిచూపుల కొచ్చిన అబ్బాయి కవితను కాకుండా అనితను ఇష్టపడడంతో మంచి సంబంధం అని వాళ్ళ నాన్నమ్మ బలవంతపెట్టడంతో పిన్నివాళ్ళు తప్పనిసరై చిన్నదైనా,

కవిత పెళ్ళికన్నా ముందే అనిత పెళ్ళి చేసేశారు. దాంతో కవిత మానసికంగా పూర్తిగా కుంగిపోయింది. ఎంతలా కుంగిపోయిందంటే కవితను ఒంటరిగా వదిలితే ఏ అఘాయిత్యమైనా చేసుకుంటుందేమో అనేంతగా పరిస్థితి దిగజారిపోయింది. దాంతో పిన్ని భయపడిపోయి కవితను కొన్నాళ్ళపాటు మా ఇంట్లో వుంచింది. ఒంటరిగా కూర్చుని కుమిలి కుమిలి ఏడ్చే కవితను ఓదార్చడానికి ఎన్నో రకాలుగా ప్రయత్నించాను. కానీ లాభం లేకపోయింది. అలాంటి పరిస్థితుల్లో ఒకరోజు వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు అనుకోకుండా ఒక సంఘటన జరిగింది. మా అదృష్టం కొద్దీ ఆ సంఘటన కవితను పూర్తిగా మార్చేసింది.

ఆ రోజు మా కాలేజీలో జరిగే ఫేర్‌వెల్ పార్టీకి కవితను కూడా వెంట తీసుకెళ్ళా. ఆ ఫంక్షన్‌కు మా కాలేజీ యాజమాన్యం ఒక విశిష్ట అతిథిని పిలవడం జరిగింది. ఆ అతిథి ఎవరో వేదిక మీద చూసేవరకు మాక్కూడా తెలియదు. వేదికపైన ఆమెను చూడగానే అందరమూ ఒక్కసారిగా షాక్ తిన్నాము. ఆమెను ఇంతకు ముందు పేపర్లో, టీవీల్లో చూశాం గానీ ప్రత్యక్షంగా చూస్తామనుకోలేదు. ఆమె పేరు సారిక. ఆమె ఒక ఆసిడ్ దాడికి గురైన బాధితురాలు. ఆమెను చూడగానే ఫంక్షన్ హాల్ ఒక్కసారిగా నిశ్శబ్దంతో స్తంభించిపోయింది. సారిక ముఖమంతా నల్లగా కమిలిపోయింది. బుగ్గలు లోతుగా పోవడంతో, కనుగుడ్లు కాస్త ముందుకు పొడుచుకు వచ్చాయి. కుడిచేయి చూస్తే చేతి ఎముకకు అతుక్కుపోయిన ముడతలు పడ్డ తోలు తప్ప కండ కన్పించడం లేదు. తలపైన జుట్టు ముందువైపు కాలిపోవడంతో నుదురు వెడల్పుగా కన్పిస్తూ వుంది. సారిక తన అందవికారాన్ని దాచే ప్రయత్నం చేయలేదు. ఎలాంటి ముసుగులూ కప్పుకోలేదు. ఇంతమంది తననే చూస్తున్నారే అని సిగ్గుపడుతూ తలను కిందికి వాల్చలేదు. ఆమె మానసికంగా చాలా స్థిరంగా, దృఢంగానూ వున్నట్లు కనిపించింది. అన్నింటికన్నా చెప్పుకోవాల్సిన ముఖ్యమైన విషయం ఆమె ముఖంపై చెదరని చిరునవ్వు. ఫంక్షన్ చివరి వరకూ ఆ చిరునవ్వు అలాగే వుండింది. ఆ నవ్వే ఆమె అందవిహీనతని ఓడించింది. ఆమె ఆత్మవిశ్వాసాన్ని ప్రతిబింబించింది.

సారిక మాట్లాడేదానికి ముందు వేదిక వెనుక ముందుగానే ఏర్పాటు చేసిన ఒక తెరను తొలగించింది. అక్కడ చూస్తే ఒక పెద్ద ఫోటో కనిపించింది. సారికపై ఆసిడ్ దాడి జరగక ముందు తీసిన ఫోటో అని చెప్పినప్పుడు మా కళ్ళను మేము నమ్మలేకపోయాం. ఆ ఫోటోలో వున్నది సారికేనా అని చాలా ఆశ్చర్యపోయాం. ఎలాంటి ముఖం ఎలా తయారైంది కదా అని తలచుకోగానే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

సారిక తనపై జరిగిన ఆసిడ్ దాడిని వివరించడం మొదలుపెట్టింది. “ఆరోజును నా జీవితంలో ఎన్నటికీ మరచిపోలేను. ఒక దుర్మార్గుడు తన ప్రేమను తిరస్కరించానన్న కోపంతో నామీద ఆసిడ్‌తో దాడి చేశాడు. ఏం జరిగిందో తెలుసుకునే లోపల విపరీతమైన మంట.

ముఖం, మెడ, ఛాతీ, చేతులు అన్నీ వేడిగా కాలిపోతుంటే తట్టుకోలేక పోయాను. ప్రాణం పోతున్నట్లనిపించింది. నా ముఖం మీద నుంచి, చేతుల నుంచి చర్మం కాలిపోతూ, కరిగిపోతూ వూడిపోసాగింది. బాధతో అరుస్తూ, కేకలు పెడుతూ స్పృహ తప్పి పడిపోయా. కళ్ళు తెరచి చూసేసరికి హాస్పిటల్లో వున్నా. వెంట్రుకలు... చర్మం వూడిపోయి... ఎంత భయంకరంగా తయారయ్యానంటే... అద్దంలో నన్ను నేను చూసుకున్న క్షణాన నిజంగా నాకు చచ్చిపోవాలనిపించింది. కానీ ఆ సమయంలో నా తల్లిదండ్రులు... నా స్నేహితులు నన్నెంతలా ఊరడించారంటే వాళ్ళ మాటల ఓదార్పు వల్లే నేను చాలా త్వరగా కోలుకోగలిగాను. వాళ్ళ సహకారం లేకపోతే నేను ఈ రోజు ఇలా వుండగలిగేదాన్ని కాదు. నాలుగైదు సర్జరీలు జరిగాక మిగిలిన రూపమిది. నేను ఆ సమయంలో విపరీతమైన శారీరక, మానసిక క్షోభను అనుభవించాను. నా పాత ఫోటోలు చూసుకుని ప్రతిరోజూ కుమిలి కుమిలి ఏడ్చేదాన్ని. కానీ మెల్లమెల్లగా నేను అర్థం చేసుకున్నదొక్కటే. జరిగినదాన్ని ఎలాగూ మార్చలేను. ఎంత ఏడ్చినా పోయిన నా రూపం మళ్ళీ రాదు. అలాంటప్పుడు ఎవడో చేసిన తప్పుకు నేనెందుకు ఏడవాలి? నా వాళ్ళనందర్నీ ఎందుకు బాధపెట్టాలి? మనిషికి అందం కాదు, ఆత్మబలం ముఖ్యమని తెలుసుకున్నా. పైపైన కనిపించే అందం వయసుతో పాటు ఏదో ఒకరోజు కరిగిపోయేదే. ఆడపిల్లలకు అందం కన్నా ఆత్మవిశ్వాసం వుండడం చాలా చాలా అవసరం. అందుకే నేను ఆ బాధలో కూరుకుపోకుండా బైటపడగలిగాను.

'సముద్ర కెరటాలే నా ఆదర్శం. లేచి పడినందుకు కాదు. పడినా లేచినందుకు' అన్న వివేకానందుని స్ఫూర్తితో నేను నా ధైర్యాన్ని మళ్ళీ కూడగట్టుకోగలిగాను. కోల్పోయిన ఆత్మస్థైర్యాన్ని తిరిగి సమకూర్చుకోగలిగాను. నామీద దాడి చేసిన వాడికి శిక్షైతే పడింది కానీ నేను ఏం పోగొట్టుకున్నానో అది నా జీవితంలో ఎన్నటికీ తిరిగి రాదు కదా! నేను, నా కుటుంబం పడ్డ బాధ ఏ ఆడపిల్లా పడకూడదని ఆరోజే నిర్ణయించుకున్నా. ఆసిడ్ దాడులను ఆపేందుకు నా వంతు ప్రయత్నం చేయాలన్న సంకల్పంతో ముందడుగు వేశా. యువతకు సందేశం ఇవ్వాలన్న లక్ష్యంతో పయనిస్తున్నా. మీ అందరికీ నేను చెప్పేదొక్కటే. నాకు దక్కంది ఎవరికీ దక్కకూడదన్న ఆలోచనను మానుకోండి. ప్రేమను ప్రేమతోనే పొందండి. ప్రేమించిన వ్యక్తి దక్కకపోతే ద్వేషం పెంచుకోకండి. ఆడపిల్లల జీవితాలను నాశనం చేయకండి. జీవితంలో ప్రేమ ఒక్కటే ముఖ్యం కాదు. సాధించాల్సిన విజయాలు ఎన్నో మీ ముందున్నాయి...." అంటూ ఇలా సారిక మాట్లాడుతున్నంత సేపూ మా రోమాలు నిక్కబొడుచుకునే వున్నాయి.

ఆ రోజు ఇంటికొచ్చాక కూడా సారిక పదే పదే గుర్తుకొస్తూనే వుండింది. ఇక కవిత మీద సారిక మాటల ప్రభావం ఎంతగా పడిందో మాటల్లో చెప్పలేను. ఆ రాత్రంతా మేలుకునే వుంది. తెల్లారాక నా దగ్గరకొచ్చి "సారికను చూశాక, సారిక మాటలు విన్నాక నేను ఇన్నాళ్ళూ

ఏ సమస్యతో బాధపడుతున్నానో అదసలు సమస్యే కాదని అర్థమైందక్కా” అంటుంటే కవిత కళ్ళల్లో భవిష్యత్తు పట్ల కొత్త ఆశలు కనిపించాయి.

బెల్ కొట్టడంతో గతం నుంచి వాస్తవంలోకొచ్చి కళ్ళు తెరిచాను. నళిని కూడా కవితలా బాధపడకుండా వుండాలంటే వెంటనే జాగ్రత్త పడాలన్న నిశ్చయానికొచ్చాను. పాఠం రేపైనా చెప్పొచ్చు. ఈ రోజే పిల్లలందరితోనూ మాట్లాడాలి. ముఖ్యంగా నళినితో... అనుకుంటూ లేచి క్లాసుకు బైలుదేరాను.

